

లాలా లజపతిరాయ్ శతజయంతి సందర్భాన కేంద్ర రవాణాశాఖ ఉపమంత్రి ప్రధానమంత్రికి స్టాంపుల ఆల్బం సమర్పించారు.

---

కేంద్రసమాచారప్రసారశాఖామంత్రిణీ శ్రీమతి ఇందిరాగాంధి ఫిబ్రవరి ఒకటవ తేదీన ఒట్టావా (కెనడా రాజధాని) కెళ్ళారు



# యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 11 మార్చి, 1965 సంచిక 3


హిందీ భాషను అధికారభాషగా చేసి, ఇంగ్లీషును వెనక్కు తోసెయ్యటానికి కేంద్ర ప్రభుత్వోద్యోగులు చేసిన ప్రయత్నాలను అరికట్టానికి హిందీ మాట్లాడని రాష్ట్రాలన్నిటిలోనూ పెద్ద ఉద్యమం బయలుదేరింది.

ఈ ఉద్యమం, ముఖ్యంగా విద్యార్థులు లేవదీసినదే అయినా, తమిళనాడులో మాత్రం, కాంగ్రెసేతర పార్టీలు, అల్లరిమూకలు ఎక్కువగా కలుగజేసుకోవడం, విధ్వంసక చర్యలకు పాల్పడడం జరిగింది. విధ్వంసక చర్యలను అణచడానికి పోలీసులు కాల్పులు జరపడం, మిలిటరీకూడా కొన్నిచోట్ల కాల్పులు జరపడం జరిగింది. విస్తారంగా ధన, ప్రాణ నష్టాలు జరిగాయి ఈ సంఘటనలు చాలా శోచనీయం హిందీ ప్రతికూల ఉద్యమం అంత ఉధృతంగా విధ్వంసక చర్యలలోకి దిగడం ఎంతమాత్రమూ మంచిదికాదు.

విధ్వంసక చర్యలవల్ల ఎవరికీ ప్రయోజనం లేకపోగా, ప్రతివ్యక్తికీ ఎంతో కొంత కష్టమూ, నష్టమూ కలుగుతుంది పోస్టాఫీసులను, రైలుస్టేషన్లనూ, బస్సులనూ తగలబెట్టడం వల్ల నష్టపడేది ఎవరు? మనమే మనకు ఉన్న సౌకర్యాలను మనమే ధ్వంసం చేసుకుంటున్నామన్నమాట. మళ్లీ ఈ సౌకర్యాలను ఏర్పాటు చెయ్యటానికి ప్రభుత్వం ఖర్చుపెట్టే డబ్బు మనదే ఇతర అభివృద్ధి కార్యక్రమా

లకు వినియోగించవలసిన డబ్బు, ఉన్న సౌకర్యాలను ధ్వంసం చేసుకొని మళ్లీ వాటినే ఏర్పాటు చేసుకోడానికి వెచ్చింపవలసివస్తుంది. ఇతర కొత్త సౌకర్యాలను ఏర్పాటు చేసుకోవాలంటే, ఎక్కువ పన్నులను చెల్లించవలసివస్తుంది. కొన్ని సందర్భాలలో, ఇదివరకు ఉన్న సౌకర్యాలను మళ్లీ ఏర్పాటు చేసుకోవడమే దుష్కర మౌతుంది.

ఇక ప్రాణనష్టాలమాట – విధ్వంసకచర్యలు జరుగుతూవున్నప్పుడు పోలీసులు చూస్తూ వూరుకోరు. పోలీసు చర్యలవల్ల విధ్వంసకారులు కొంతమంది దెబ్బలు తిన్నా, ప్రాణాలు కోల్పోయినా అమాయకులూ, విధ్వంసకచర్యలతో సంబంధం లేనివారూకూడా ఎంతోమంది దెబ్బలు తినడం, ప్రాణాలను కోల్పోవడం జరుగుతుంది. పైగా, ఉద్రిక్తులైన విధ్వంసకారులు ఏ యిళ్ళమీద పడతారో, ఏ పాత కక్షలను మనసులో పెట్టుకొని ఎవరిని హింసిస్తారో చెప్పలేము.

అంచేత, దౌర్జన్యయుతమైన ఉద్యమాన్ని లేవదీయడంవల్ల, ఇతర దౌర్జన్య శక్తులను రెచ్చగొట్టడం అవుతుంది. ఎటువంటి పరిస్థితులలోనూ, దౌర్జన్యకాండలకు దిగకూడదనే నిర్ణయం, ప్రజలందరూ పూర్తిగా గ్రహించకపోతే, దేశంలో ఏ వ్యక్తికీ, ఏ కుటుంబానికీ శాంతి అనేది వుండదు. క్రమంగా ప్రజలకు అసలు ఉద్యమంపట్లనే సానుభూతి వుండదు.

ఈ విషయాన్ని మనసులో పెట్టుకొని, తమ ఆందోళనా కార్యక్రమాలను జాగ్రత్తగా నడపవలసిన బాధ్యత, ప్రతి ఉద్యమకర్తమీదా వుంది

*ఇక హిందీమాట –*

హిందీని ప్రధాన అధికార భాషగా చెయ్యడం, ప్రస్తుతానికి వెంటనే ఆపడం ప్రభుత్వ కర్తవ్యం. ఆంధ్ర, కర్నాటక, కేరళ, మదరాసు, ఒరిస్సా, బెంగాల్ రాష్ట్రాలు, హిందీని అధికారభాషగా అమలులోకి తేవడానికి సంసిద్ధంగా లేవు. ప్రజలందరి ఆమోదాన్ని పొంది, దేశమంతటికీ అధికారభాషగా హిందీ అమలులోకి రావాలంటే, అధమం నూరు, నూటయాభై సంవత్సరాలు పడుతుంది. నూరు, నూటయాభై సంవత్సరాల తరవాతిమాట, మనం చెప్పలేము కాని, ప్రస్తుతం మాత్రం హిందీని అధికారభాషగా మనం ఉపయోగించలేము.

ప్రస్తుత పరిస్థితిలో ఉత్తమమైన మార్గం — ఇంగ్లీషుకు ఇన్నాళ్ళూ ఉన్న అధికార ప్రతిపత్తిని అలాగే ఉండనివ్వడం, హిందీ మాతృభాషకాని రాష్ట్రాలతో కేంద్ర ప్రభుత్వం, ఇంగ్లీషులోనే వ్యవహారం నడపాలి. అంతకన్న వేరేమార్గం ఉండదని అనుకోవడం మూర్ఖత్వం అవుతుంది. ఈ మూర్ఖత్వంతో ఏపని చేసినా, పొంగి పొర్లుతూ వున్న ఏటికి ఎదురీదడం అవుతుంది. దేశమంతటా, ప్రజలందరూ సహకార భావంతో, సౌమనస్యంతో మెలగాలని కోరే ప్రభుత్వం అలాటి పని చెయ్యకూడదు. బలవంతాన ఒకభాషను నెత్తిన రుద్దితే, ఆ భాషను ఏప్రజలూ నేర్చుకోరు, ప్రతిఘటిస్తారు. అంచేత, హిందీని ప్రధానభాషగా వెంటనే అమలులోకి తెచ్చే ప్రయత్నాలను కేంద్రప్రభుత్వం విరమించడం మంచిది. ఇంగ్లీషుభాష అధికార భాషగా, ఇదివరకటి లాగే అమలులో వుంటుందనే హామీని హిందీ మాతృభాష కాని రాష్ట్రప్రజలకు ఇస్తూ, ఆ హామీని అమలు జరపడానికి అవసరమైన శాసనాన్ని చెయ్యడంకూడా అవసరం. ప్రతి రాష్ట్రమూ, తన మాతృభాషలో రాష్ట్రీయ వ్యవహారాలను జరుపుకుంటూ, అంతర రాష్ట్రీయ వ్యవహారాలనూ, కేంద్రప్రభుత్వంతో జరిపే వ్యవహారాలనూ, ఇంగ్లీషులో జరపడానికి సంపూర్ణమైన స్వేచ్ఛ కల్గి వుండాలి. హిందీయే మాతృభాషగాగల రాష్ట్రాలు తమలో తాము హిందీభాషను ఉపయోగించుకుంటే ఎవరికీ అభ్యంతరం ఉండదు. కేంద్రప్రభుత్వంతోకూడా హిందీలోనే వ్యవహారాలను జరపవచ్చును. కాని, హిందీ మాతృభాషకాని రాష్ట్రాలను మాత్రం యీ విషయంలో ఇబ్బంది పెట్టకూడదు. ఇబ్బంది పెడితే ఘర్షణ తప్పదు

న్యాయానికి, జాతీయ భాషలుగా పేర్కొనబడిన పద్నాలుగు భాషలను అధికార భాషలుగా అమలులోకి తేవచ్చును. అరవైలక్షల జనాభామాత్రమే గల స్విట్జర్లాండ్‌లో నాలుగు అధికార భాష లున్నప్పుడు, నలభైకోట్ల జనాభా గల భారత దేశంలో పద్నాలుగు అధికార భాషలు అమలు వుంటే, విచిత్రం ఏమీలేదు దీనివల్ల కేంద్ర ప్రభుత్వానికి కలిగే యిబ్బందికూడా ఏమంత పెద్దదికాదు. పద్నాలుగు భాషలను అధికార భాషలుగా ప్రకటించవలసిం దని, పూర్వపు ఆర్థికమంత్రి, ప్రస్తుతం ఢిల్లీ యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్ అయిన శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ ఇచ్చిన సలహా, ప్రస్తుతపు రాష్ట్రీయ ఉద్రిక్తతలను నమయింపజెయ్యడానికి చాలా చక్కగా

ఉపకరిస్తుంది. ప్రతి రాష్ట్రపుభాషా అధికారభాష అయినప్పుడు ప్రతి రాష్ట్రపు ప్రజలకూ, తమ భాషా ప్రతిపత్తినిగురించి గర్వించడానికి అవకాశం ఏర్పడుతుంది. రాష్ట్రాలన్నిటిమధ్యా ఒక సౌమనస్యభావం ఏర్పడుతుంది. ఆ తరువాత క్రమంగా, ఏదో ఒక భాష దేశమంతటికీ అధికార భాషగా రూపొందకపోదు. అంతవరకూ, ఇంగ్లీషు తన ప్రస్తుత ప్రతిపత్తిలోనే వుండాలి. ఆ తరువాతకూడా, ఇంగ్లీషుభాషే అధికార భాషగా వుంటే, అది ప్రజలందరి సమ్మతిమీదనే అలా వుంటుందన్నమాట. పద్నాలుగు జాతీయ భాషలలో ఇంగ్లీషుకూడా ఒకటి కదా! అది అధికార భాషగా ఉన్నందువల్ల తప్పేమిటి? జాతీయ భాషగా ఇంగ్లీషును అంగీకరించిన మనము, అధికార భాషగా దానిని ఎందుకు ఉపయోగించకూడదు!

ఇక సౌకర్యంమాట — దేశంలోని ప్రజలలో, దాదాపు మూడువంతులమందికి హిందీ మాతృభాషగా వున్నమాట వాస్తవమే. ఆ కారణంచేత, ఆ భాషను తక్కిన ప్రజలంతా నేర్చుకోవాలని పట్టుపట్టడం సబబుకాదు. ఆ భాషను నేర్చుకోవాలనే కోరిక తక్కినవారికి కలిగి, అందరూ ఆ భాషను నేర్చుకోవడం అనేది జరిగితే, ఎవరూ విచారించరు. కాని, బలవంతం జరిగినప్పుడు ప్రతిఘటన వస్తుంది.

పట్టుదలను విడిచిపెట్టి నట్లయితే, ప్రస్తుతపు భాషాసమస్యను పరిష్కరించడానికి అనేకమార్గాలు వున్నాయి. ఏ విధంగానైనాసరే, హిందీ మాతృభాష కానివారికి ఇబ్బంది కలుగకుండా యీ సమస్యను పరిష్కరించడం చాలా అవసరం.

ఈ సమస్యను నాయకులు చర్చించి. ఒక పరిష్కారానికి వచ్చేవరకూ ప్రజలు ఓపికపట్టివుండడం చాలా అవసరం. విధ్వంసక చర్యలవల్ల నష్టపడేది, ఆ చర్యలు ఏ ప్రాంతంలో జరుగుతాయో, ఆ ప్రాంతంలోని ప్రజలేగాని నాయకులుకాదు. అందుచేత, విధ్వంసకచర్యలు జరుగకుండా జాగ్రత్త వహించడంకూడా ప్రజల ధర్మం.



# మిస్ సుధారాణి

పరిమళ



గాలి రివ్వున వీచింది.

కిటికీ తలుపులు పెద్దగా శబ్దంచేస్తూ అటూ యిటూ ఊగిసలాడుతున్నయ్. కిటికీపక్కనే ఉన్న టేబుల్ మీది బున్సెన్ బర్నర్ గుప్పు మని ఆరి పోయింది.

టెస్టుట్యూబ్ పట్టుకుని బర్నరు మీద ఏదో వేడి చేస్తున్న సరోజ ఉలికిపడి తలెత్తి చూసింది "మేడమ్" వైపుగా.

"ఆచారీ! కిటికీ తలుపులు వేసి, లైట్లు వెలిగించు" అంటూ అరచింది మిస్ సుధారాణి కుర్చీలోనుండి లేస్తూ.

ఆచారి తలుపును వేసి స్విచ్ నొక్కాడు. కెమిస్ట్రీ లాబొరేటరీ అంతా ఒక వింత కాంతితో మెరిసిపోతోంది. ఆచారి నిప్పు పెట్టె తెచ్చి సరోజ బర్నర్ వెలిగించాడు.

"ఎన్ని రాడికల్సు డిటెక్టు చేసావు?" సరోజనిని సమీపిస్తూ అడిగింది మిస్ సుధారాణి

"మ్...మ్...మ్మూడండీ......"

"యువర్ నెంబర్?" పుస్తకంలో పేజీలు తిరగవేస్తూ అడిగింది మేడమ్.

"సెవెంటీ యైట్."

"యాసిడ్ రాడికల్స్ ఏమిటి?"

"బొరేటు, టార్టరేట్."

"టార్టరేట్ ఎలిమినేట్ చేశావా?"

"చేసా మేడమ్."

"బొరేట్‌కి గ్రీనెడ్జ్‌డ్ ఫ్లేమ్ వచ్చిందా?"

"వచ్చింది మేడమ్"

"సరే. బేసిక్ రాడికల్స్... ఏ గ్రూపు?"

"సెకండ్ గ్రూప్."

"ఏ మెటల్?"

"మె... ర్క్యు... రీ."

"మెర్క్యురీనా?"

"ఎస్... మేడ... మ్!"

"మెర్క్యురీ లేదు. సరీగ్గా ఎనలైజ్ చేసి చూడు." వెళ్ళిపోయింది మేడమ్.

కర్ఛీఫ్‌తో నుదుటిమీది చెమట బిందువులను తుడుచుకుంది సరోజ. కళ్ళకిడ్డం పడుతున్నా పొడుగాటి వెంట్రుకలను పైకి తోసుకుని పక్కపిన్ను సరిచేసికొంటూ మేడమ్ కుర్చీవైపుకు ఓరగా చూసింది.

మిస్ సుధారాణి తనవంకే చూస్తోంది.

అంతే. చటుక్కున ఆమె చెయ్యి క్రిందికి దిగింది. టెస్టట్యూబ్ పట్టుకుని సెకండ్‌గ్రూప్ మొదటినుంచీ చెయ్యటం ప్రారంభించింది.

అరగంట గడచింది

బయట హోరు మనే గాలితోపాటు గణగణ మనే బెల్లు విన్పించింది

చేతివాచీ చూసుకుంటూ సుధారాణి వచ్చింది.

"ఎంతవరకు వచ్చావ్?"

"సెకండ్ గ్రూప్‌లో లెడ్ ఉన్నదండీ."

ఎండిన పెదవులను నాలికతో తడుపుకుంటూ టెస్టట్యూబ్ ఎత్తి మేడమ్‌కి చూపింది. "గోల్డెన్ స్పాంగిల్స్ టెస్ట్."

"వెరీగుడ్... మరి యిందాక మెర్క్యురీ అని ఎందు కన్నావ్?"

కాలి బొటనవ్రేలితో నేలను రాస్తూ తల వంచి క్రిందిపెదవి కొరుక్కుంది సరోజ.

మిస్ సుధారాణి మెదడు గతంలోకి పరుగులు తీసింది. ఆ రోజు... అతను ప్రశ్నించినపుడు తను సరీగ్గా అలాగే నిలబడింది! అవే బెదురుచూపులు... అదే వణుకు...

"గట్టిగా 'కన్ఫర్మ్' చేసికోనిదే లెక్చరర్‌కి రిపోర్ట్ చెయ్యకూడదు. జాగ్రత్తగా ఒకటికి రెండుసార్లు టెస్ట్ చేసి అప్పుడుగాని ఒక కంక్లూజన్‌కి రాకూడదు... ఎక్జామినేషన్సులో తొందర పనికిరాదు..."

అలాగే నన్నట్లు వినయంగా తలూపింది సరోజ.

"ఇంకా ఎంత సేపు చేస్తావ్? ఐదు దాటింది"

"మరొక అరగంట చేస్తానండీ."

"అందరూ వెళ్ళిపోయారు. వర్షం వచ్చేటట్లున్నది. ఇంటికి వెళ్ళాలని లేదా?"




"ప్లీజ్... ఈ ఒక్క రాడికల్ కూడా చేసి..."

"సరే. నీ యిష్టం."

లేబొరేటరీ నుండి బయటకు వచ్చి వరండాలో నిలబడింది సుధారాణి.

సరోజను చూస్తుంటే, ఏవో స్మృతులు తన నుక్కిరి బిక్కిరి చేస్తున్నాయ్. ఆరేళ్ళక్రితం తన స్టూడెంట్ లైఫ్ గుర్తుకు వస్తోంది. సన్నగా బలహీనంగా ఉండే తను, బెదురుచూపులు చూస్తూ లేబొరేటరీలో ఎక్కడో ఒకమూల నిల్చుని ప్రయోగాలు చేసేది. ఇప్పుడు తను సరోజను ప్రశ్నించినట్లే శేఖర్ ఎప్పుడూ తనవద్దకు వచ్చి ఏమేం చేస్తూ న్నదీ అడిగి ఒక్కోప్పుడు మందలింపుగా మాట్లాడేవాడు కూడా.

శేఖర్...! ఏనాటి శేఖర్ !; రంగుల ప్రపంచాన్ని చూసి వెర్రిగా పరుగెత్తిన శేఖర్, ఎక్కడున్నా డిప్పుడు?

బయట సన్నగా తుపర పడుతోంది. రివ్వున వీచిన గాలితోపాటు సన్నని తుపర ఆమె శరీరాన్ని ఆప్యాయంగా కౌగలించుకుంది. ఆమె దేహం పులకరించింది.

పల్చని వాయిల్‌చీర శరీరానికి అతుక్కుపోయింది. దూరంగా ఫిజిక్స్ స్టాఫ్‌రూమ్ ముందు నిలబడిన లెక్చెరర్ కృష్ణమూర్తి తనవంక అదేపనిగా చూడటం గమనించిన సుధారాణి కనుబొమ్మలు చిట్లించుకుంటూ లేబొరేటరీలోకి వెళ్ళింది. సరోజ అలాగే నిలబడి పంచిన తలెత్తకుండా ప్రయోగం చేస్తోంది.

సుధారాణి చిన్నగా నిట్టూర్పు విడిచింది ఆరోజుకూడా... అలాగే వర్షం కురుస్తోంది. తను సిల్వర్ నైట్రేట్—పొటాషియం క్లోరైడ్ టైట్రేషన్సు చేస్తోంది. ఎంతకూ రీడింగ్సు కోయిన్సైడ్ అవటంలేదు. ఏ ఒక్కరిద్దరో తప్ప స్టూడెంట్సంతా యిళ్ళకు వెళ్ళారు.

అభిమానంతో తనకి కళ్ళనీళ్ళు వచ్చాయి. అందరూ ప్రాక్టికల్సు చక్కగా చెకచెకా చేసేస్తారు. తను ఎప్పుడూ వెనకే ఉంటుంది. ఇలా అయితే తన కీపేడు ఫస్టుక్లాస్ వచ్చినట్లే. ఎం. యస్సీ. చదివే గీత తన ముఖాన లేదు కాబోలు. చేతిరుమాలతో కళ్ళు తుడుచుకుంది.

"వాట్ మిస్ సుధారాణీ? హౌ ఫార్ హేవ్ యూ డన్?"

తలెత్తి చూసింది తను.

కళ్ళజోడులో నుండి క్రిందికి చూస్తూ అడిగాడు శేఖర్, 'టై' సవరించుకుంటూ.

అభిమానంతో తన ముఖం ఎఱ్ఱబడింది.

"కంకరెంట్ రీడింగ్సు రావటం లేదు సార్" వచ్చే ఏడుపును ఆపుకుంటూ అన్నది.

"ఎందుకు రావు ప్రయత్నిస్తే? నేను చూపిస్తా నుండు... ఏదీ ఆ కోనికల్ ఫ్లాస్కు క్లీన్ చేసి యివ్వు" అన్నాడు శేఖర్, షర్టు చేతులు పైకి మడచుకుంటూ. తను ఫ్లాస్కులు రెండు క్లీన్ చేసి యిచ్చింది

రెండు టైట్రేషన్సులోనూ పాయింట్ వన్ తేడా వచ్చింది కాసేపు బుఱ్ఱ గోక్కున్నాడు.

తను మళ్ళీ క్లీన్ చేసి యిచ్చింది. ఈ సారి జాగ్రత్తగా చేశాడు. సిల్వర్ నైట్రేట్ లాస్ట్ డ్రాప్ పడగానే ఏర్పడిన లేత గులాబీరంగు ప్రెసిపిటేట్ వైపు గుడ్లప్పగించి చూస్తూ నిలబడింది తను.

ఈసారి రెండు టైట్రేషన్సులోనూ రీడింగ్సు కోయిన్సైడ్ అయినాయి.

కళ్ళజోడు తీసి అద్దాలు రుమాలుతో తుడిచి మళ్ళీ ముఖానికి తగిలించుకున్నాడు శేఖర్

"నువ్వు కూడా మరో రెండు టైట్రేషన్సు చెయ్యి; యూ మస్ట్ బి వెరీ కేర్ ఫుల్ అండ్ పేషెంట్, దట్సాల్; అంతకంటె మరో డిఫికల్టీ ఏం లేదు." ఎంకరేజ్ చేస్తూ వెళ్ళిపోయాడు.

వట్టి బెదురుగొడ్డు తను. ఎక్స్పెరిమెంట్ రాకపోతే ఏడవటం తప్ప లెక్చెరర్ని అడిగటం చేతకాదు. శేఖర్ మాస్టారు ఎంత మంచాయన! అర గంటలో టైట్రేషన్సు, కాలుక్యులేషన్సూ పూర్తి చేసుకొని వెళ్ళింది.

కుర్చీలో కూర్చుని 'మామ్' నవల చదువుతున్న శేఖర్ తనని చూడగానే పుస్తకంమూసి తన చేతిలోని నోట్ బుక్ తీసుకుని సంతకం పెట్టాడు.

"పాయింట్ సిక్స పర్సంట్ ఎర్రర్, నాట్ బాడ్..."

"థాంక్యూ సర్..."

"మేడమ్ :"

ఉలిక్కిపడింది మిస్ సుధారాణి.

"కాల్షియం పచ్చిందండీ :" సరోజ చేత్తో టెస్ట్‌ట్యూబ్ పట్టుకు నిలబడింది.

"కరెక్ట్" అంటూ సైన్ చేసింది.

సరోజ కళ్లు ఆనందంతో మిలమిల మెరిసినయ్ సుధారాణి పెదవులపై చిన్న నవ్వు.........చేతులు కడుక్కుని రుమాలుతో తుడుచుకుంది సరోజ. బుక్కుపట్టుకుని లేబొరేటరీ ద్వారంవద్ద మేడమ్ పక్కగా నిలబడింది.

జోరున వర్షం కురుస్తోంది.

ఎదురుగాఉన్న బొటానికల్ గార్డెన్‌లో పూలమొక్కలమీద పడిన వర్షపునీరు జలజలమంటూ క్రిందికి రాలింది. ఆ నీరంతా సన్నని పాయలుగా చీలి పల్లపు ప్రాంతమైన కెమిస్ట్రీ లేబొరేటరీ ముందు కాలవగట్టిన నీటిలో కలసింది. ఆ కాలవలో తేలుతున్న గడ్డిపరకలను చూస్తూ నిలబడింది సుధారాణి.

వర్షం కురిసిన ఆ రోజు అలాగే తను శేఖర్ పక్కన నిల్చున్నది.

"మిస్ సుధారాణీ !"

"ఏమిటి మాస్టారూ ?"

"పాపం ఒక్కదానివి ఎలా వెళ్తావు? వర్షం కురుస్తోంది"

"ఫరవాలేదండీ వర్షం తగ్గగానే రిక్షాలో వెళ్తాను."

"వర్షం తగ్గకపోతే ?" నవ్వుతూ ప్రశ్నించాడు శేఖర్.

"మీరూ, అటెండర్లూ ఉన్నారుగా. మీ రెలా వెళ్తే నేనూ అలాగే వెళ్తాను." మాస్టారి చనువుకు లోలోపల విస్తుపోయినా పైకి నవ్వుతూనే జవాబిచ్చింది.

"నిన్నొకటి అడుగుతాను...ఏమీ అనుకోవు కదా ?"

"ఏమిటది ? అడగకూడని ప్రశ్న మీరేం వెయ్యరుగా ?"

"ఎప్పుడూ అలా విచారంగా ఉన్నట్లు కన్పిస్తావేం : యూ లుక్ లైక్ పెసిమిస్ట్."

"ఒక్కొక్కరి స్వభావం అది. దానికి నే నేం చెప్పేది ?" నవ్వింది తను.

"అవును. అదీ నిజమేలే. స్టూడెంటుగా ఉన్నప్పుడు...అంతే ఏడాది క్రిందటి వరకు నేనుకూడా అలాగే ఉండేవాడిని. నా ఫ్రెండ్సంతా నన్ను 'వీపింగ్ ఫిలాసఫర్' అని వెక్కిరిస్తూండేవాళ్ళు. ఉద్యోగంలోకి చేరినాక నవ్వటం, నలుగురితో మాట్లాడటం నేర్చుకున్నాను.''

జేబులోనుండి సిగరెట్ పెట్టె బయటకు తీసి చటుక్కున ఆమె ముఖంలోకి చూసి ఏదో గుర్తుకి వచ్చినట్లు మళ్ళీ దానిని యధాస్థానంలో పెట్టేశాడు. ముఖం పక్కకు తిప్పుకుని నవ్వుకుంది తను.

వర్షమంటే చిన్నప్పటినుండీ తనకెంతో యిష్టం. ఎన్నోసార్లు పెద్దయినాక కూడా వర్షంలోనిలబడి జ్వరంతెచ్చుకుంది

చల్లని గాలీ...ధారలుగా పడుతున్న వర్షం !

''శేఖరం మాస్టారు ఎంత మంచి వారు !" ఆ విషయం అది మాటయాభ య్యోసారి తననుకోవటం.

"వర్షం కురుస్తుంటే మనసు కెంతో హాయిగా ఉంటుంది కదూ ?"

ఉలికిపడింది తను. ఒక లెక్చెరర్ తనతో అంత క్లోజ్‌గా మాట్లాడుతుంటే ఏదో సంకోచ మనిపించింది. ఎన్నడూ అనుభవంలేని విషయం.

"అవునండీ !" అన్నది ఏమనాలో తోచక.

''మీ యిల్లెక్కడ ?"

''అలంకార్ వద్ద."

"లెస్సన్స్ బాగా అర్థం అవుతున్నాయా ?"

"ఊఁ......ఆఁ......"

"ఏమయినా డౌట్సుంటే నన్నడగ వచ్చు; నా సహాయం ఎప్పుడూ ఉంటుంది నీకు."

"థాంక్యూ సర్."

"నీలాటి స్టూడెంట్సుంటే నా కెంతో యిష్టం. నువు బ్రిలియంటని స్టూడెంట్సూ, లెక్చరర్లూ, అంతా అనుకుంటున్నారు. ఇప్పటినుండీ బాగా కృషి చేశావంటే మంచి రిజల్టు వస్తుంది. కాలేజీకి మంచి పేరు తెచ్చిపెట్టాలి."

కృతజ్ఞతా సంతోషాలతో పూడుకు పోయింది తనకంఠం తలవాల్చి మాస్టారి బూటువంక చూస్తూ నిలబడింది మౌనంగా.

"మేడమ్ !"

కళ్ళలో నిలిచిన నీటిబిందువులను కర్చీఫ్‌తో తుడుచుకుంటూ పక్కకు చూచింది సుధారాణి.

"ఏమి టమ్మా ?"

"మరి – మేడమ్... నాకు 'రేడియో యాక్టివిటీ' సరిగ్గా అర్థం కాలేదంటే క్లాస్‌లో– ఎప్పుడైనా వీలుంటే ఒకసారి ఎక్స్‌ప్లైన్ చేస్తారా ?"

"ఓ – అలాగే !"

"ఎప్పుడు రమ్మంటారు మీ యింటికి ?"

"కాలేజీ ఉన్నరోజుల్లో మార్నింగ్ నైన్ లోపల, యీవినింగ్ ఆఫ్టర్ సిక్స్ ఎప్పుడైనా సరే సాధారణంగా నే నెక్కడికీ వెళ్ళను. సెలవు దినాల్లో ఏ టైమ్‌లో వచ్చినా ఫరవాలేదు ''

"థాంక్యూ మేడమ్."

"నో – నో – దట్సాల్‌రైట్"

* * *

''చాలాబాగా చెప్పారు మేడమ్ మీరు. ఇన్నాళ్ళూ యీ లెస్సన్ అర్థంకాక తంటాలు పడుతున్నాను." పుస్తకాలు పుచ్చుకుని లేచి వెళ్ళబోతూ అన్నది సరోజ

"ప్రయత్నిస్తే సాధ్యంకాని విషయమేం లేదు."

"అవును మేడమ్."

"ఎప్పుడైనా డౌట్సు వస్తే యిలాగే చెప్పించుకుని వెళ్తూండు."



"అలాగే. యిక వస్తాను మేడమ్, గుడ్ నైట్."

"గుడ్‌నైట్."

గుమ్మంలో నిలబడి వీధిలైటు వెలుగులో నడచివెళ్తున్న సరోజ పొడుగాటి జడను చూస్తూన్న సుధారాణికి ఆలోచనలు ముసురుకున్నాయి.

"బాగున్నాయా నే నిచ్చిన ఎస్సేలు?" వాటిని తిరిగితీసుకుంటూ అడిగాడు శేఖర్.

"చాలా చక్కగా ఉన్నాయండీ. మీ ఎస్సేలు చదివిన తరువాత అంతకు ముందున్నడౌట్సన్నీ తొలగిపోయినయ్."

"థాంక్స్."

"...అని చెప్పవలసింది నేను."

"ఆఁ...ఎవరైతేనేం"నవ్వా డతను.

అతని రూములో టేబుల్ మీదున్న వెంకటేశ్వరస్వామి పటం చూసి "మీరు వెంకటేశ్వరస్వామి భక్తులేమిటి?"అని

అడిగింది తను ఆశ్చర్యంగా.

"అవును. మా యింటి యిలవేలపు ఆయనే." భక్తిశ్రద్ధ లుట్టిపడుతున్నాయ్ అతని కంఠంలో.

"ఐతే మీకు దేవుళ్ళన్నా, దెయ్యాలన్నా నమ్మకం ఉందన్నమాట.'' నవ్వాపుకోలేకపోయింది తను.

"ఏం. నీకు లేదా ?''

"ఉఁహుఁ... సైన్స్ సూడెంటునయి ఉండికూడా దైవత్వాన్ని విశ్వసించలేను నేను."

''సైన్సుకీ – భగవంతునిపై విశ్వాసము ఉండటానికీ సంబంధ మేమిటి మిస్ సుధారాణీ ? ఎన్ని పరిశోధనలు జరిపినా మానవుడు తెల్సుకోలేని, చేరుకోలేని మహా సత్యా లలాగే మిగిలిఉన్నాయి. వాటిని తెలుసుకోవాలని కృషిసల్పే శాస్త్రజ్ఞుడికీ, భగవంతునిలో లీనమైపోవాలని పరితపించే భక్తుడికీ అట్టే తేడా లేదు– నా దృష్టిలో."

నోరు తెరచుకుని చూస్తూ కూర్చుండిపోయింది. ఆయ నలా మాట్లాడతారని తనూహించలేదు.

"నేనూ ఒకప్పుడు నీలాగే నాస్తికుడినే కాని తిరుపతి యూనివర్సిటీలో చదువుతుండగా ప్రతిరోజూ స్నేహితులతో పాటు షికారుకని కొండమీదకు తరచుగా వెళ్తుండేవాడిని. ఆ అలవాటే చివరకు అంతులేని భక్తిగా మారింది." నవ్వాడు శేఖర్.

తను తలవంచుకుని వింటోంది.

''ప్రతి ఉదయం స్నానానంతరం వేంకటేశ్వర సుప్రభాతం చదివనిదే నేను పచ్చిమంచినీళ్ళుకూడా ముట్టను.''

ఎందుకో అప్రయత్నంగా తన కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయ్.

తన స్వభావం భగవదారాధనకి విరుద్ధమైనా విద్యాధికుడూ, తన లెక్చెరరూ అయిన ఒక యువకహృదయంలో భగవంతుని ఎడల అంతటి భక్తివిశ్వాసాలున్నా యని వినినంతనే ఆత్మవిశ్వాసంతో కరుడుగట్టిన తన హృదయంలో ఏదో కదలిక కల్గుతున్నట్లు అనుభూతి కల్గుతోంది. 'భగవంతుని అవసరాన్ని ఆశించే పిరికితనం తనలో లేదు' అని ఒకప్పుడు ధైర్యంగా చూసే తనకళ్ళే యిప్పుడు అర్ద్రమవుతున్నాయి...ఎందుచేత ?

''ఆఁ అన్నట్లు... నేను 'వేంకటేశ్వర మాహాత్మ్యం' సినిమా ఇరవైసార్లు చూసాను తెలుసా ?'' తనని నవ్వించటాని కన్నాడు శేఖర్.

కాని యీసారి తను నవ్వలేకపోయింది.

''అరె, అదేమిటి సుధా –: ఏడుస్తున్నావా ? ఎందుకు ? ''

''మాస్టారూ...''

''మిస్ సుధా...''

ఆ పైన ఏమీ విన్పించుకోకుండా ఒక్క పరుగున అతని రూమ్‌నుండి

బయటకు వచ్చింది. ఇంటికివెళ్తూ దారిలో వేగంగా కంపిస్తున్న గుండెమీద చెయ్యి వేసికొని ఆరోజే మొదటిసారిగా అను కుంది "నేను శేఖరం మాస్టార్ని ప్రేమి స్తున్నాను."

*  *  *

ఆరోజు శుక్రవారం.

'మరో ఐదునిమిషాలకి సెకండియర్ బియస్సీ స్టూడెంట్సు...సరోజ బాచ్ వాళ్లు వస్తారు' అనుకుంది, మిక్స్చర్స్ నూరు తున్న సుధారాణి.

ఐదు నిమిషాలు గడచాక బెల్లు విన్పించింది.

"అరే. అప్పడే బెల్లయిందే." గబ గబ మిక్స్చర్సు పొట్లాలు కట్టి ప్రతి పొట్లంమీద నెంబరువేసి వాటిని తీసుకుని స్టోర్ రూమ్నుండి లెబొరేటరీలోకి వచ్చింది మిస్ సుధారాణి.

అప్పుడే స్టూడెంట్సంతా వచ్చేసారు.

తనకుర్చీ దగ్గరకు వెళ్తూ సరోజవంక ఓరగా చూసింది .

అందరూ వచ్చి ఎవరినెంబరుప్రకారం వారు ఆపొట్లాలు తీసుకుని వెళ్లిపోయారు. అటెండెన్సు తీసుకుని కుర్చీకి చేరగిలబడి కళ్ళు మూసుకుంది మిస్ సుధారాణి. ఆ ఆలోచనలు...వీటి బారినుండి తను ఎన్నటికీ తప్పించుకోలేదు. ఎడారి తుల్యమయిన తన ప్రస్తుతపు ఒంటరి జీవితంలో ఆ నాటి అనుభవాల స్మృతులే ఒయాసిస్సులు. ప్రతిరోజూ, ప్రతిక్షణం. తన జీవనదృక్పథాన్నే మార్చివేసిన బి. ఎస్సీ. రోజులు — ఎలా మర్చిపో గలదు ? ఆ బాధాకరమైన స్మృతులలోనే ఏదో ఒక విచిత్రమైన రిలీఫ్ని పొందు తుంది తను. ఆ రిలీఫ్ ఎందుకు కల్గు తుందో, దాని స్వభావ మేమిటో తనకు తెలియదు. తను ప్రస్తుతం అనుభవిస్తున్న కఠోరమైన ఒంటరితనాన్ని విస్మరింప జేయటమే ఆ ఆలోచనలలోని ప్రత్యేక తేమో...

ఆ రోజు..యూరియా కాన్స్టిట్యూషన్ చెప్పించుకోవాలని అతని రూమ్ కి వెళ్ళింది.

కిలకిల నవ్వులు విన్పించి గుమ్మంవద్దే ఆగిపోయింది.

"భలేవారే మాస్టారూ, మీరు. చాలా ఫన్నీగా మాట్లాడతారు."

అది వాసంతి—తనక్లాస్ మేట్ కంఠం.

వెంటనే మళ్ళీ పకపక నవ్వులు.

ఆ నవ్వులను బట్టి మరొక అమ్మాయి కూడా ఉన్నట్లు తెలుస్తోంది.

తను లోపలికి వెళ్ళటమా మానటమా ?

హఠాత్తుగా కర్టెన్ తొలగించుకుని బయటకు రాబోతున్న శేఖర్ సుధారాణికి ఒక్క డాష్ యిచ్చి వెంటనే వెనక్కి అడుగువేసి "హల్లో...మిస్ సుధారాణీ! కమిన్, కమిన్..." అన్నాడు కర్టెన్ పక్కకి తొలగించి దారి చూపిస్తూ.

లోపలికి అడుగుపెడుతూనే మంచం

మీద కూర్చున్న వాసంతి భారతులను చూసింది. కళ్ళు జిగేల్ మన్నాయ్. గులాబీలతో, రెండు జెడలతో, ఖరీదైన దుస్తులతో వెలిగిపోతున్నా రిద్దరూ.

"ఇప్పుడే వస్తానుండండి" అని శేఖర్ బయటకు వెళ్ళిపోయాడు.

వాళ్ళ పక్కనే మంచం మీద కూర్చుంటూ కొద్దిగా మాసిన తన నేతచీర వంక చూసుకుని సిగ్గుపడింది. తన పేదరికాన్నీ, తన దుస్తులను గురించి ఆలోచించటం జీవితంలో అదే మొదటి సారి...

"హల్లో సుధారాణీ! ఏమిటి మీ చేతిలోని బుక్కు?" అన్నది భారతి.

"ఆర్గానిక్ కెమిస్ట్రీయా? అబ్బ! ఎంత శ్రద్ధండీ మీకు చదువుమీద? మీరు చూపే శ్రద్ధలో కనీసం సగం చూపినా ఫస్టుక్లాస్ వచ్చేను మాకు. కాని చదవాలంటే తగని బద్ధకం సుమా" అన్నది వాసంతి. బద్ధకం అన్నది అదో గర్వించతగ్గ విషయం అన్నట్లు. "అంతేకాదు నీలాగా నేను ఊరికే పుస్తకాల పురుగునీ; దుబ్బురోలునీ కాను సుమా'' అని ఎత్తిపొడిచినట్లు కూడా అన్పించింది తన కా సమయంలో. పైగా వారిద్దరూ తన నేతచీరను గుచ్చి గుచ్చి పరిశీలిస్తున్నట్లు ఫీలయింది సుధారాణి. లేనినవ్వు బలవంతాన పెదవులపైకి తెచ్చుకుని, "ఎంతసేపు అయింది మీరు వచ్చి?" అన్నది.

"అరగంటయింది. ఇనార్గానిక్ కెమిస్ట్రీ చ స్తే అర్థంకావటంలేదు. పరీక్షలింకా రెండునెల్లున్నాయి. ఈయేడు మోక్షం లభిస్తుందో లేదో నని హడలిపోయి యిలా పరుగెత్తుకు వచ్చాం. మొన్న నొకరోజున ఏమయినా లెస్సన్సు తెలియకపోతే రూమ్కివచ్చి చెప్పించుకో మన్నారు. ఏవో ఏస్సే లిచ్చారు కాని అవి మాలాంటి మట్టిబుఱ్ఱలకు అర్ధమయితేనా?"

భారతికి సమాధానం యివ్వకుండా ఆలోచిస్తోంది. తను, సినీ నాలెడ్జి తప్ప చదువులో 'యావరేజి స్టూడెంటు' కుండవలసిన విజ్ఞానం కంటే ఓపాలు తక్కువే ఉన్న యీ హైహీల్సుయానలకు ఎస్సే లిచ్చి, తెలియని పాఠాలు రూమ్కి వచ్చి అడగమనటంలో శేఖర్ ఉద్దేశ్యం ఏమిటి? ఇదే సహాయం - యీ మాటల తోనే తనకి ఆఫర్ చేసినప్పుడు తను సంతోషంతో పొంగిపోయింది. తన తెలివి తేటలు చూసే తనకి సహాయం చేయాలని శేఖర్ భావిస్తున్నా డనుకుంది. కాని యిప్పుడు వీళ్ళ మాటలు వింటుంటే తనలో ఉందని భ్రమించిన 'ప్రత్యేకత' లేకపోగా, తన గర్వం దెబ్బతినటమే కాక యింతకాలం తను శేఖర్లోని ఏ ప్రవర్తన చూసి భ్రమపడి తన హృదయాన్ని అతని కంకితం చేసిందో ఆ ప్రవర్తనలో తననుకున్న దేమీ లేదని తెలిసిపోయింది. అవును, శేఖర్ దృష్టిలో తన కెలాటి ప్రత్యేకమయిన స్థానం లేదు.




"నేను మీ కివ్వవలసిన డబ్బునుగురించి నా భార్యతో మాట్లాడండి,
ఫతాన్ సాహెబుగారూ !"

వాసంతి, భారతి ఎంతో తను కూడా అంతే. భగవాన్–! ఎంత భయంకరమైన సత్యం! దీనిని యింతకాలం ఎందుకు గుర్తించలేదు? ఇప్పుడు గుర్తించినందున కలిగిన ప్రయోజనం మాత్రం ఏముంది? తన అభిమానం దెబ్బతింది, తన హృదయం తూట్లు పడింది... భగవాన్ తను నిజంగా మోసపోయిందా...?

శేఖర్ తిరిగి వచ్చాడు వెంట ఒక కుర్రవాడితో. ఆ కుర్రవాడు నలుగురికీ కాఫీ లందించాడు.

భారతీ వాసంతీ వయ్యారంగా గ్లాసు లందుకున్నారు.

తను విషం తాగినట్లు తాగి గ్లాస్ కింద పెట్టేసింది.

బాయ్ వెళ్ళిపోయాడు.

"ఇవాళ ముగ్గురికీ ఇనార్గానిక్ కెమిస్ట్రీ చెప్తాను" అన్నాడు శేఖర్ సుధారాణి వైపు చూస్తూ.

"అలాగే."

శేఖర్ పాఠం చెప్తున్నంత సేపూ మధ్యలో దౌట్సు అంటూ ఆ పే వా రు

భారతీ, వాసంతీ. ఆయన నవ్వుతూ మళ్ళీ మొదలెట్టటం, మధ్యలో ఛలోక్తులతో నవ్వులతో...అలా సాగిపోయింది టీచింగ్. తనకి ముళ్ళమీద కూర్చున్నట్లనిపించింది. ఒకసారి ''ఏం సుధా? ఒంట్లో బాగుండలేదా?'' అనడిగాడు శేఖర్.

"లేదండీ. తల నొప్పిగా ఉంది"

"పోనీ, ఆపేస్తా నీ రోజుకి."

"ఉహుఁ. మీరు చెప్పండి. నేను కూర్చోలేకపోతున్నాను. ఇంటికి పోతున్నాను" అంటూ లేచింది.

"ఐ యామ్ వెరీ సారీ..."

"నో...నో...ప్లీజ్...! డోంట్ వర్రీ ఎబౌట్ మీ."

తూట్లుపడిన హృదయంతో బయటకు వచ్చింది తను.

"మిస్ సుధారాణీ!"

హఠాత్తుగ కళ్ళుతెరచింది సుధారాణి.

తన తోటి లెక్చెరర్ నారాయణరావు కుర్చీలో కూర్చుంటూ అన్నాడు నవ్వుతూ "రాత్రి సెకండ్‌షోకి వెళ్ళారేమిటి? నిద్రపోతున్నారు."

పేలవంగా నవ్వింది సుధారాణి.

"మాష్టారూ, టార్టరేట్‌కి సిల్వర్ మిర్రర్ టెస్ట్ రావటం లేదండీ" అంటూ వచ్చింది సరోజ.

"నేను చేసి చూపిస్తాను పద."

ఇద్దరూ వెళ్ళిపోయారు.

చిన్నగా నిట్టూర్పు విడిచింది సుధారాణి. అదేంగమ్మత్తో నారాయణరావుండగా సరోజ ఎన్నడూ తనని "డౌట్సు" అడగదు. ఎప్పుడూ అతనినే అడుగుతుంది. అతనూ అంతే. ప్రతిసారీ ఏదో ఒక వంకపెట్టుకుని సరోజనిని మాట్లాడిస్తూ ఉంటారు. ఈ సంగతి తను చాలాసార్లు గమనించింది. స్త్రీ పురుషులమధ్య ఉండే యీ పరస్పరాకర్షణ దీనికి సరియైన భాష్యం చెప్పగల సామర్థ్యం ఎవరికి ఉంది? తెలిసో, తెలియకో ఏదో ఒకనాడు ఒక వ్యక్తికి హృదయం అర్పితమయిపోయింది. సెన్సిటివ్‌గా ఉండే వాళ్ళు దానినే ప్రేమ అని పేరు పెట్టి, ఆ బంధాన్ని మరింత బిగువైనది, అందమైనదిగా చేయాలని తాపత్రయ పడతారు. కాని యిది కొద్దిమంది విషయాల్లో మాత్రమే; మరికొందరికి అది చాలా సర్వసామాన్యవిషయంగా గోచరిస్తుంది. తన హృదయ స్పందనానికి కారకుడైన ఆ వ్యక్తి తన జీవనపథంనుండి తప్పుకుంటే మరొక కొత్త ఆకర్షణకోసం, కొత్త ప్రేమకోసం, మరో ఆనందం కోసం అన్వేషిస్తుంది మనసు. అందులో తను మొదటిజాతికి చెందిన వ్యక్తయితే శేఖర్ రెండవ రకానికి చెందిన వ్యక్తి. తమలోని యీ వైవిధ్యమే తన ప్రస్తుత స్థితికి కారణం.

శేఖర్ తనయందు ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతుంటే తను గర్వంతో మురిసిపోయింది. తనకి తెలియకుండానే

తన సర్వస్వాన్నీ అతని పాదాలముందు ధారవోసింది.

కాని...శేఖర్‌కి కావలసింది డబ్బూ, హోదా, ఆడంబరం. ఆకర్షణీయంగా అలంకరించుకుని హైహీల్డ్ షూస్ టకటక లాడించుకుంటూ తనతో చెట్టాపట్టాలు వేసుకు తిరిగే అమ్మాయిల మీద మోజెక్కువ. తనలోని వినయం, నిరాడంబరత్వం, తెలివి తేటలూ యివన్నీ అంటే అతనికి గౌరవం, కాని తనలో అతనికి కావలసిన "గ్లామర్'' లేదు. తనలాటి స్త్రీని గౌరవించగలడు కాని, ప్రేమించలేడు శేఖర్.

ఈ విషయం గ్రహించిన దగ్గరనుండీ అతనినుండి తప్పుకుంది తను.

కాని తన అభిమానం తీవ్రంగా గాయపడింది. తను ప్రేమించిన పురుషుని నుండి ఆశించిన ప్రేమ లభించకపోవటంతో అది తిరస్కారంగానే భావించింది తను. ఆ భావం తన గుండెలో శూలంగా గుచ్చుకుంది. ఆ గాయమే తనని వివాహబంధానికి దూరంగా ఉంచింది ఇంతకాలమూను.

పరీక్ష లయినాక ఆఖరిరోజు — చివరిసారిగా శేఖర్‌ని చూడటానికి రూమ్‌కి వెళ్ళింది. వెళ్ళగానే ''కమిన్...కమిన్'' అంటూ ఎప్పటిలాగానే ఆహ్వానించాడు.

కాసేపు అవీ, యివీ మాట్లాడి "బి. యస్సీ. తరువాత ఏం చేస్తావు ?" అని అడిగాడు.

"ఎం. యస్సీ !"

"వెరీగుడ్... మరి పెళ్ళి...?"

తన ముఖం ఎర్రపడింది — సిగ్గుతో కాదు, అభిమానంతో — ఏదో తెలియని క్రోధంతో.

''ఆ సంగతి మా పేరంట్సు చూసుకుంటారు.''

"ఓ — దెన్ యు ఆర్ ఏ వొబీడియంట్ డాటర్;" నవ్వాడు శేఖర్.

తను నవ్వు తెచ్చుకుంది.

వస్తుంటే అందరు లెక్చరర్ల లాగానే "బ్రైట్ ఫ్యూచర్ " ని ఎదుర్కోవాలంటూ విష్ చేశాడు.

అదే ఆఖరిసారి శేఖర్‌ని చూడటం.

తరువాత తను ఎం. యస్సీ. చదవడం, అదే కాలేజీలో లెక్చరర్‌గా అపాయింట్ అవటం జరిగింది. ఈలోగా శేఖర్‌కి బదిలీ అయిపోయింది మరో చోటికి. కాని అతన్నిగురించి తనెవరినీ ఏమీ అడగలేదు. బహుశా యీపాటికి పెళ్ళి చేసికొని యిద్దరు ముగ్గురు పిల్లల తండ్రయికూడా ఉంటాడు. అందం, ఐశ్వర్యం, చదువు, ఉద్యోగం ఉన్న అతని కేం తక్కువ ? ఏ ఆడదాన్నయినా యిట్టే అతను పాదాక్రాంతం చేసికోగలడు.

కాని ... తనో ... యిప్పటికీ, యికఎప్పటికీకూడా మిస్. సుధారాణి !

''మేడమ్ !''

కళ్ళనీళ్ళు రుమాలుతో తుడుచు

కుంటూ ఎదురుగా ఉన్న బాయ్‌స్టూడెంటు వంక చూసింది.

"ఆదేమిటి మేడమ్? కళ్ళు అలా ఉన్నాయ్?''

''నలక పడిందోయ్ కంట్లో. ఆఁ... నీ కేం కావాలి?"

"మెగ్నిషియం టెస్టు సరీగ్గా రావటం లేదండీ; మీరు చేసిపెడ్తారేమోనని...''

''పద చూపిస్తాను" అంటూ లేచింది సుధారాణి.

* * *

ఆర్నెల్లు గడచినయ్.

మధ్యాహ్నం సెకండ్ పీరియడ్ థియరీ క్లాసు తీసుకున్న తరువాత లెబొరేటరీలోకి వెళ్ళింది సుధారాణి. నారాయణరావు పసుపు అంటించిన కవరందించాడు సిగ్గుపడుతూ.

నారాయరావు పెళ్ళి శుభలేఖ, వధువు–ఎవరో సరళట.

''కంగ్రాట్యులేషన్సు మిస్టర్ నారాయణరావ్!"

''థాంక్యూ మేడమ్.''

అతను వెళ్ళిపోయాడు, శుభలేఖలు యితర లెక్చరర్లకి పంచియివ్వటానికి.

సరోజ సీటువంక చూసింది ఆమె మామూలుగా తల వంచుకుని ఎక్స్పెరిమెంట్ చేస్తోంది.

ఆ రోజు ఎందుకో సరోజ ఆమె వద్దకు రాలేదు అంతవరకు. బహుశా టెస్ట్లన్నీ వస్తున్నాయి కాబోల్ను.

బెల్ అయింది.

పది నిమిషాలలో అందరూ వెళ్ళారు. అలవాటు ప్రకారం సరోజ ఒక్కతే మిగిలింది. మిక్శ్చర్ పూర్తి చేయనిదే యింటికి వెళ్ళదామె.

"సరోజా!"

"మేడమ్, వస్తున్నా."

చేతులు కడుక్కుని రుమాలుతో తుడుచుకుంటూ వచ్చింది సరోజ.

"ఎంతవరకు చేశావ్?"

"ఫోర్త్ రాడికల్–బేరియం టెస్ట్ చేస్తున్నాను మేడమ్. ఐదు నిమిషాల్లో ఐపోతుంది...ప్లీజ్..."

అప్రయత్నంగా సరోజ కళ్ళు టేబుల్ పైని శుభలేఖమీద వాలాయి.

"నారాయణరావుగారి పెళ్ళి."

పాలిపోయిన ఆమె ముఖం వంక జాలిగా చూస్తూ అన్నది సుధారాణి.

"మాస్టారి... పెళ్ళా... !!" హీన స్వరంతో అన్నది సరోజ. జలజల రాలే కన్నీటిని ఆపుకోబోయి విఫలురాలు అయింది. సుధారాణి కళ్ళలోకూడా నీరు తిరిగింది.

"సరోజా!"

"మ్... మ్మేడమ్..."

"ఏడుస్తున్నావా?"

"లే...దు మేడమ్...మరే రాత్రి నిద్రలేక."

"పిచ్చి సరూ... నాకంతా తెలుసు."

"మేడమ్!"

# రక్తదాహం

రాత్రి పన్నెండు గంటలు. తూర్పుకి వెళ్ళే ప్యాసెంజర్ వచ్చే వేళయింది. కాస్త ముసురుగా వుందేమో — బండికి జనం అట్టేమంది లేరు.

అసిస్టెంట్ స్టేషన్ మాస్టరు — రాఖాల్ భట్టాచార్య టికెట్ల అమ్మకం ముగించాడు. లేచాడు. నల్లకోటూ, ముఖమల్ టోపీ వేసుకుని, లాంతరు చేత పుచ్చుకుని బయటికి వచ్చాడు.

భూతంలా గర్జిస్తూ, ప్యాసెంజర్ ప్లాట్‌ఫారం మీదకు వచ్చింది. ఆగింది.

బండి ఆగిందో లేదో, గోల! ఏదో పెద్ద గోల!! — ఇంటర్ కంపార్టుమెంటు లోంచి పెద్ద గోల. "గార్డుగారూ! — గార్డుగారూ!! —" అంటూ అరుపులు. "ఏమిటి సంగతి? ఏం జరిగింది?" అంటూ రాఖాల్ లాంతరుతో సహా పరుగెత్తు కెళ్ళాడు. ప్లాట్‌ఫారం మీద నించునే, కంపార్టుమెంటులోకి తొంగి చూచాడు. ఎవరో వ్యక్తి చచ్చిపోయాడు! ఆ చచ్చినవాడు సన్యాసి దుస్తుల్లో వున్నాడు!!

"అస లెలా చచ్చిపోయాడు?" అని అడిగాడు రాఖాల్.

"ఫతూయా స్టేషన్ వచ్చేవరకూ బాగానే వున్నాడు. అక్కడనుంచి బండి బయల్దేరింది. గంజాయి గొట్టం పైకి తీస్తూ, మనిషి వణికిపోయాడు; కాళ్ళూ చేతులూ తన్నుకున్నాడు. ఒకళ్ళిద్దరం కలిసి పట్టుకోబోయాం, కాని మావల్ల కాలేదు. బల్లమీదనుంచి కిందకు పడి, నోటమ్మట నురుగులు కక్కుకున్నాడు. అంతే, దగ్గరకు వచ్చి చూస్తే, శ్వాసలేదు. ఇదంతా జరిగి పది నిమిషా లయింది."

ఇంతలో గార్డు వచ్చా డక్కడికి. కథంతా విన్నాడు. "దింపండీ శవాన్ని!" అన్నాడు.

"శవా న్నిక్కడ దింపితే, ఏముంది? డాక్టరా, పోలీసులా? —"

"అలా వీల్లేదు; రైల్లో శవా న్నుంచటానికి వీల్లేదు. డాక్టర్‌కీ పోలీసులకీ మెసేజి పంపించండి. వాళ్ళే వస్తారు." అంటూ గార్డు శవాన్ని దింపించేశాడు. శవంతో పాటు శవం తాలూకు సామాన్లు, ఒక ట్రంకు, కమండలం కూడా రాఖాల్‌కి అప్పగించాడు గార్డు.

ఈ తతంగ మంతా జరిగేటప్పటికి పావుగంట పైన పట్టింది. బండి బయల్దేరింది.

శవాన్ని ప్లాట్‌ఫారంమీద వదిలేస్తే ఏ నక్కలైనా పీక్కు తింటా యని, శవాన్నీ, సామాన్లనూ పార్శిల్ రూమ్‌లో పెట్టించి తాళం వేశాడు రాఖాల్. పనివాళ్లను ఇళ్లకు పొమ్మని, యాక్సిడెంట్ మెసేజి పంపి, రాఖాల్ పడుకున్నాడు.

పడుకోవడమైతే పడుకున్నాడు గాని, నిద్ర పట్టందే! అతని తలకాయ ఆ సన్యాసిని గురించే ఆలోచిస్తోంది. 'ఎవరీ సన్యాసి? ఏమిటితని కథ? కేవలం బికారిలా తిరిగే ఈ సన్యాసి ఇంటర్‌లో ప్రయాణం చేయడ మేమిటి? పైకి ఇలా బికారిలా కనబడేవాళ్ళ దగ్గరే బోలెడంత డబ్బుంటుం దంటారు. ఈ సన్యాసి అలాంటి వాడేనేమో! ఇతని పెట్టెలో ఏమాత్ర ముంటుందో?—'

బయట మెరపు మెరిసింది.



రాఖాల్ మనస్సులో ఏదో ఊహ మెదిలింది.

బయట మేఘ మురిమింది.

రాఖాల్ మనస్సులో ఏవో భయం కదిలింది.

మళ్ళీ ఏదో ఆశ పట్టి పీడిస్తోంది.

ఆ క్షణంలో రాఖాల్ భట్టాచార్యకి తన స్థితి అంతా – తన కథ అంతా – కళ్ళకు కట్టిన ట్టయింది.

*   *   *   *   *   *

చిన్నప్పుడే తండ్రి పోయాడు. తల్లి నానాపాట్లూ పడి, కాస్తలో కాస్త చదువు చెప్పించింది. వర్ధమాన్‌లో మేనమామల ఇంట్లో ఉంటూ, స్కూల్‌ఫైనల్ వరకు చదివాడు లీలావతి అనే పిల్లను పెళ్ళాడాడు.

దాంపత్యం, ప్రేమ అనే మాటలను రాఖాల్ నవలల్లో చదివాడు. ప్రసంగాల్లో విన్నాడు. అంతే. ఆ ఆనందం ఎటువంటిదో అతనికి లీలావతిలో ఎప్పుడూ కని పించలేదు ఎప్పుడైనా అత్తవారింటికి వెళితే, 'మరి రెండురోజు లుండండి' అనిగాని, 'మళ్ళీ ఎప్పుడు రావటం?' అనిగాని మాటవరస కైనా అని ఎరగదు. ఆమె దంతా అదొక ముభావం. రాఖాల్ ఉత్తరాలు రాసినా సరిఅయిన సమాధానం లేదు. ఒకసారి బతిమలాడి భార్యను తీసుకొచ్చాడు. పదిహేను రోజులైనా నిండకుండానే యేడ్చి రాగాలెట్టి, పుట్టింటి కెళ్ళిపోయింది.

ఈసారైనా పట్టుబట్టి భార్యను తీసుకురావాలని గట్టి ప్రయత్నం చేశాడు. వారం రోజులు సెలవుకోసం పెడితే మంజూరు కాలేదు, అందుకని ఒకనాడు సుస్తీగా వున్నట్టు నటించి, సిక్ రిపోర్టు ఇచ్చి రైలెక్కాడు.

అది మయనామతీ గ్రామం. రాఖాల్ గడపలో అడుగు పెడుతూనే ఇల్లంతా దిగాలుమని ఉండటం చూశాడు. దాసీది తప్ప మరెవరూ అతన్ని పలకరించలేదు. రాఖాల్ అన్న కూతురు మాత్రం 'బాబాయ్!' అంటూ పిలిచింది. అన్న కూతురు వల్ల కొంతవరకూ సంగతులు తెలుసుకున్నాడు.

నలువేపులా కలయజూచాడు. కావలసినవాళ్ళు కనబడలేదు. వదినగారు మాత్రం కనబడింది. అడిగిన ప్రశ్నలకు ముక్తసరిగా సమాధానాలు చెప్పింది. మంచినీ ళ్ళడిగాడు రాఖాల్.

"కాళ్ళూ చేతులూ కడుక్కో, ఫలహారం చేదువుగాని" అంటూ లోపలి కెళ్ళింది.

కాళ్ళు కడుక్కు వచ్చాడు రాఖాల్. గుమ్మం వైపు చూశాడు, ఫలహారం లీలావతి చేతి కిచ్చి పంపిస్తుందని వేయి కళ్ళతో ఎదురు చూస్తున్నాడు. కాని, చిన్న




పళ్ళెంలో రెండు రసగుల్లాలు, గ్లాసుతో మంచినీళ్లు పట్టుకుని వదినగారే వచ్చింది. అన్నను గురించి అడిగాడు. తెలియదు అందామె. సాయంత్రం లీలావతిని తీసు కెళదామనే ఉద్దేశాన్ని వెల్లడించాడు. అందుకు సమాధానం చెప్పలేదు గాని, ఆమె కళ్ళు రెండు కన్నీటిబొట్లు రాల్చాయి.

''ఏమిటి జరిగింది వదినా ? ఏమిటి జరిగింది ?" అంటూ రాఖాల్ ఆదుర్దాగా అడిగాడు.

ఆమె ఏమీ మాటాడలేదు.

"లీలావతి కేమైనా ప్రమాదం వచ్చిందా, వదినా ?'' అని మళ్ళీ అడిగాడు.

"ఏం జరిగిందని చెప్పేది, నాయనా ! — తెల్లారుజామునుంచీ దాని జాడ తెలియలేదు."

నిలువునా నీళ్ళుగారిపోయాడు, రాఖాల్.

"ఎక్కడికి వెళ్ళిందీ ?"

"ఏమో నాయనా, దేవుడికే తెలియాలి. దాన్ని వెదుకుదా మనే వెళ్ళారు మీ అన్నయ్య."

"అయితే వదినా ! — ఏమైనా దెబ్బలాడుకుని వెళ్ళిపోయిందా ? లేదా, నువుగాని ఏమైనా కేకలేశావా ?"

"అబ్బే, దెబ్బలాట కేముంది, నాయనా ! — సాయంత్రం వేళ నూనె వొలక బోస్తే... కాస్త జాగ్రత్తగా ఉండమ్మా' అన్నాను. అంతే, మూతిముడుచుక్కూర్చుంది. రాత్రి అన్నం సరిగా తినలేదు. తెల్లారేటప్పటికి మనిషే కనబడకపాయె ! — "

రాఖాల్‌కి ఆశా, నిరాశా రెండూ ఒకేసారే కలిగాయి పరిశోధన ప్రారంభించాడు. "రాత్రి ఎక్కడ పడుకుంది ? కూడా ఎవ రున్నారు ? ఎప్పుడు వెళ్ళిపోయింది ?" అంటూ అడిగాడు.

"రోజూలాగే మామూలుగా, మా అమ్మాయిని దగ్గిర పెట్టుకుని గదిలోనే పడు కుంది. అమ్మాయి తెల్లగా తెల్లారేక లేచింది. లేచి చూస్తే, పక్కన లీల లేదు. పెరటిగుమ్మం తలుపుమాత్రం తెరచివుంది." అన్నది వదిన.

"అయితే, ఏ చెర్లోనో పడివుంటుంది. సందేహంలేదు. నే పోయి పల్లెవాళ్ళని పిలుచుకువస్తా." అంటూ చెప్పులు తొడుక్కోబోయాడు.

'ఆగు నాయనా, ఆగు. నీళ్ళల్లో పడి చస్తేమాత్రం దాన్ని మనం రక్షించగలమా ? అలా గనక జరిగివుంటే, సాయంత్రానికి తేలనే తేలుతుంది. కానిపక్షంలో మనకి మనమే అల్లరి చేసుకోవడ మెందుకు ? ఒక సంగతి చెబుతున్నా, విను : నిన్న సాయంత్రం వాళ్ళ పుట్టింటినించి ఎవరో దాసీది వచ్చింది. తెల్లవారేక లీల దానితో వెళ్ళిపోయింది. ఇదీ జరిగిన సంగతి."

రాఖాల్‌కి వళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకిన ట్టయింది. వదిన అనుమానం గ్రహించాడు.

"వదినా, అలా ఎన్నటికీ జరగదు వదినా ! — నీళ్ళలోనే పడి చచ్చిపోయి వుంటుంది. లేదా, పుట్టింటికైనా చేరుకు నుంటుంది. అంతేగాని, మరొకలాగా జరగదు. అది అలాటి మనిషి కాదు. ఎందుకైనా మంచిది, పెరటివేపు నాలుగు పక్కలా చూసొస్తాను."

అన్నిచోట్లా తిరిగి చూశాడు రాఖాల్. చెరువులో నీళ్ళు మనిషి మునిగేపాటి లోతైనా లేవు. పెద్దచెరువుకి పోయి వెదకటం మంచి దనుకున్నాడు. కాని, అక్క డికి వెళ్ళటంతోనే ఊళ్ళో ఎరిగినవాళ్ళంతా రాఖాల్‌ను చుట్టేశారు.

"ఏం రాఖాల్ ! ఎప్పు డొచ్చావ్ ? ఏమిటిలా వచ్చావ్ ?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

ఈ ప్రశ్నలకు తట్టుకోలేక, అంతటితో వెదకటం పని కట్టిపెట్టి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

అన్న కూతురు స్వర్ణలత పినతండ్రి దిగులు కనిపెట్టింది అయితే, అతనితో ఏం మాటాడాలో, ఎలా పలకరించాలో తెలియలేదు. ఏమీ తోచక, "బాబాయ్! — చిలంగొట్టంలో పొగాకు వేసి తీసుకురానా?" అని అడిగింది.

నీళ్ళు నిండిన కళ్ళతో "అమ్మాయ్! — మీ పిన్ని ఏమయిం దమ్మా?" — అని అడిగాడు.

"నాకూ తెలియదు, బాబాయ్! — వాళ్ళ పుట్టింటికిగాని వెళ్ళిందేమో, ఒకవేళ?—"

"నాకూ అలాగే అనిపిస్తోంది. ఏదైనా చీటీ రాసి పక్కలో పెట్టిందేమో?"— అంటూ, ఇద్దరూ వెళ్ళి పక్కచుట్ట విప్పి: దులిపి చూశారు, దిండు గలీబుకూడా తీసి చూశారు. ఎక్కడా ఏమీ కనిపించలేదు.

అన్న వచ్చాడు. "విన్నావా కథ అంతా?" అని అడిగాడు, రాఘాల్ కేసి చూసి.

"విన్నాను. జాడేమైనా దొరికిందా?"

"లేదు; ఇంతవరకూ ఏమీ దొరకలే."

"నోరు తెరిచి ఎవరినైనా అడగటానికికూడా వీల్లేకొచ్చింది".

"ఏమిటి ఉపాయం ఇప్పుడు? ఊరు ఊరంతా గోలయిపోదూ?" అన్నది వదినగారు.

"ఏం చేస్తాం?— అక్కడికీ, వాళ్ళమ్మకి జబ్బు చేసిందనీ, వసంతపూర్ నుంచి మనిషి వచ్చి తీసుకువెళ్ళాడనీ, అడిగినవాళ్ళందరికీ చెప్పాను," అన్నాడు అన్న.

"కచ్చితంగా అక్కడికే వెళ్ళివుంటుం దన్నయ్యా!" అన్నాడు రాఘాల్. ఇదివరకు కూడా నాతో రావటం దాని కిష్టంలేదు. ఈసారి నే వస్తున్నా నని తెలిసి, ఆ భయంతోటే పుట్టింటికి పారిపోయుంటుంది."

"నువు చెప్పేది మరీ బాగా వుంది, ఆడది, అందులోనూ అర్ధరాత్రివేళ మూడు కోసులదూరం ఒక్కర్తే నడిచి వెళ్ళగల దంటావా?" అన్నది వదిన.

ఆమె మాటలకు అన్న అవుననీ కాదనీ చెప్పలేక, "ఒకవేళ వెళ్ళిందే అనుకుందాం, అలా వెళ్ళటం మంచిపనా? లోకం వింటే ఏమనుకుంటుంది? సంసారుల పిల్లకి ఏమిటీ బుద్ధి? అన్నాడు.

"నేను భోంచేసి వసంతపూర్ వెళతాను. సంగ తేమిటో కనుక్కుంటాను."

"సరే వెళితే వెళ్ళావుగాని, దాన్ని మాత్రం మరెన్నడూ ఈ ఇంటికి తీసుకు రావద్దు, మరెక్కడి కైనా తీసుకువెళ్ళు, నీ యిష్టం. అదిమాత్రం ఇహ ఈ ఇంట్లో అడుగు పెట్టటానికి వీల్లేదు. అలాంటిది నా తోడికోడ లని చెప్పుకోలేను," అంటూ ఖచ్చితంగా చెప్పేసింది వదినగారు.

రాఖాల్ స్నానానికి లేచాడు. అప్పుడు "బాబుగా రున్నారా?" అంటూ చౌకీదార్ వచ్చాడు.

అన్న వెళ్ళి ఏమిటి సంగ తని అడిగాడు.

"బాబుగారు రాత్రి చిన్నమ్మగారిని పుట్టింటికి పంపించారా?" అని ప్రశ్నించాడు చౌకీదార్.

"ఊఁ. ఏం?"—

"ఏం లేదు బాబూ, రా త్తిరి రౌండు తిరుగుతా వుంటే పొలిమేరకాడు ఇద్ద రాడోళ్ళు కనబడ్డారు. ఒకామె ఇదవ, రెండోఆమె పునిస్త్రీ. ఆళ్ళను చూసి నా కను మానం వేసింది. 'ఎవరు మీరు? ఎక్కడి కెళుతున్నారు?' అని అడిగాను. ఏవేవో అబద్దా లాడినారు. చివరకి — అమ్మగోరు మన చిన్నమ్మగా రని చెప్పింది ముసి లామె. అవునో కాదో తెల్సుకుందామని తమకాడికి వచ్చినాను."

"అవును, నిజమే," అన్నాడు అన్న.

చౌకీదార్ వెళ్ళిపోయాడు.

ఇప్ప డా కుటుంబంలో అందరకూ పుట్టెడు బరువు దించిన ట్టయింది.

రాఖాల్ మనస్సులో దిగులంతా మాయమయ్యింది. అన్నగారు మాత్రం కొరకొర లాడుతూనే వున్నాడు. "ఛీ ఛీ! ఏమి టీ పని? ఏమి టీ అప్రతిష్ఠ? పుట్టింటికి వెళ్ళా లనుంటే ఇదా పద్ధతి? చెబితే వెళ్లొద్దంటామా? అర్థరాత్రిపూట ఇలా వెళితే, ఎవ రేమనుకుంటారో అనే ఇంగితజ్ఞానమైనా లేకపోయెకదా! ఛి ఛీ!"—

స్నానానికి వెళ్ళిన రాఖాల్ రెండు గంటలయినా తిరిగి రాలేదు. అంత సేపూ ఏదో ఆలోచిస్తూనే వున్నాడు.

"బతికినంత కాలమూ అవమానంతో కుళ్ళి చావక తీర దనుకున్నాను. కాని, ఆ అవమానంనుంచి బయట పడ్డాను. అయినా, ఇలాంటి భార్యవల్ల ప్రయోజనం ఏమిటి? బలవంతం మీద దగ్గర అట్టేపెట్టుకుంటే, ఒరిగే లాభ మేముంది? దాని వల్ల నాకు సుఖం కలుగుతుందన్నమాట వట్టిది. భ్రాంతి; నాతో రాకపోతే పోయె, నే వచ్చేదాకా అయినా ఆగలేకపోయిందే? ఒక్కసారి నా కంటబడితే తనకు వచ్చే నష్ట మేమిటో? పోతే పోనీ. నే నిక అత్తవారింటి కెళ్ళను. దానితో ఎలాంటి సంబం




ధమూ పెట్టుకోను. మళ్ళీ పెళ్ళి చేసుకుంటా. అంతే."... ఈ విధంగా, స్నానం చేస్తూ నీళ్ళలో వున్న రాఖాల్ ఉడికిపోయాడు.

భోజన మయ్యాక అట్టే పడుకుని, మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. నేను మళ్ళీ పెళ్ళి చేసుకోవడ మనే సంగతి ఏలాగూ ఖాయమే. అయితే, మరొక్కసారి లీలావతితో ఈ విషయం తేల్చేసుకుంటాను. వస్తుందా నా వెంటబడి రానే వస్తుంది. లేదా హాయిగా మరోపెళ్ళి చేసేసుకుంటా."

గడియారం చిన్నముల్లు రెండు గంటలు చూపిస్తోంది. ఉత్తరీయం పైన వేసు కుని, గొడుగూ సంచీ చేత పట్టుకుని బయల్దేరాడు రాఖాల్.

వసంతపూర్‌లో రాఖాల్ మామగారు కృష్ణదాసు ఘోషాల్ సంపన్న గృహస్థు. మధ్యాహ్నం నిద్రనుంచి లేచి, సావిట్లో బల్లమీద కూచుని టపా చూసుకుంటు న్నాడు. ఇరుగింటి పొరుగింటి పెద్దమనుషులతో బాతాఖానీ కొడుతున్నాడు.

అటువంటి సమయంలో — పీక్కుపోయిన ముఖంతో, చెమటలు కక్కుకుంటూ రాఖాల్ వచ్చి చేరాడు.

"రావోయ్ రాఖాల్ ! — ఒరేయ్ అల్లు డొచ్చా డని ఇంటో చెప్పండ్రా ! ! — ఏం నాయనా, ఇంటిదగ్గర అంతా ఖులాసా ? అవునుగానీ, వచ్చినవాడివి లీలను

కూడా తీసుకరాలేకపోయావా? వాళ్ళమ్మ ఇవాళ కంటతడి పెట్టుకుంది—'పిల్ల పడమటికి వెళుతూంది, మళ్ళీ ఎప్పుడొస్తుందో, యేమో. వెళ్ళేముందైనా ఒక్కసారి చూడలేకపోయాను, పాపిష్టిదాన్ని...' అంటూ, పరిపరివిధాల అనుకుంది." అని మామగారు ఏకరువు పెట్టాడు.

లీలావతి ఇక్కడకూడా లేదని వినేసరికి రాఖాల్ బుర్ర గిర్రున తిరిగింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. బల్లమీద కూచున్నవాడు కూచున్నట్టుగానే కింద పడ్డాడు. స్పృహ లేదు.

"ఏమిటి, ఏమిటీ? ఏమిటయింది?—అల్లుడు!—అల్లుడూ...!—నాయనా, రాఖాల్!" అంటూ కంగారుతో గంతులువేశాడు మామ. ఇంట్లోవాళ్ళంతా ఇవతలికి వచ్చారు. రాఖాల్‌కు ఉపచారాలు చేశారు, నీళ్ళు చల్లారు; విసనకర్రతో విసిరారు. అంతలో డాక్టరుకూడా వచ్చాడు, చూశాడు.

కాస్సేపటికల్లా రాఖాల్ తేరుకున్నాడు కాని, నీరసంచేత కూచోలేక పోయాడు. ఇద్దరు మనుషులు చెరోపక్కనా పట్టుకుని, అతన్ని లోపలికి తీసుకెళ్ళి పడుకోబెట్టారు.

కృష్ణదాస్ ఇవతలకి రావటంతోనే మరొక వింతవార్త!—జమీందారుగారి చిన్న తమ్ముడు నవీన్ రాత్రినుంచీ కనిపించటంలేదు. నలువైపులా గాలించినా లాభం లేకపోయింది. మరొక పుకారు ఏమిటంటే—అతను సైరిభి అనే దాసీదాంతో సంత దారివి వెళుతూండగా ఎవరో చూశారట! కానీ, సైరిభి నడిగితే 'ఆ గొడవే నాకు తెలియదు' అంది.

ఆ పట్టు పట్టు రాఖాల్, ఐదు రోజులదాకా తేరుకోలేకపోయాడు.

అతడు మళ్ళీ ఖుస్రూపూర్ చేరుకోగానే, పిడుగులాంటి మరొకవార్త చెవిని బడింది—ఒక్కనెల నోటీసుతో అతన్ని పనినుంచి తొలిగించారు.

*   *   *   *   *   *

రాఖాల్ మళ్ళీ మళ్ళీ తన స్థితిని గురించి ఆలోచించాడు. ఏ కాశీకో పోయి, శేష జీవితం గడిపివేద్దా మనుకున్నాడు. అయితే, చేతిలో కాసు లేక, ఉపవాసాలతో చిక్కి చావాల్సి వస్తుందేమోనని ఒక పంక భయం కలిగింది. కానీ—'ఫరవా లేదు. లోకంలో ఎంతమంది బతకటంలేదు? నా ఒక్క ప్రాణి కింత తిండే దొరక్కపోతుందా?' అని మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నాడు.

ఈ ఆలోచన ఇలా వుండగా, సన్యాసిని గురించిన సమస్య రాఖాల్ మనసును పట్టి వదలనేలేదు:




"ఈ సన్యాసి పెట్టెలో కొద్దో గొప్పో, డబ్బో దసగమో ఉండేవుంటుంది. అది నేనే ఎందుకు తీసుకోగూడదూ? అంతా పోలీసులే మింగాలా? అంతా సర్కార్కే దక్కాలా? ఆ డబ్బు నేనే తీసుకోవటంలో తప్పేమిటి? దోవలో ఎక్కడైనా ఏదైనా వస్తువు దొరుకుతుంది; చూస్తూ అలా దాన్ని వదలేసిపోతామా?"

రాఖాల్ మెల్లిగా లేచాడు. రెండుసార్లు అటూ యిటూ పచార్లు చేశాడు. కటిక చీకటి; హోరున వర్షం. ఎవరూ లేరు. నెమ్మదిగా పార్సిల్ గదిముందుకు వచ్చాడు. దీపం తగ్గించి, తాళం తీయబోయాడు. చెయి వణికింది. తాళంచెవుల గుత్తి కిందకు జారింది. చచ్చిన సన్యాసి మళ్ళీ బతకలేదుకదా? వాడు చచ్చి భూతం కాలేదుకదా. కొంపతీసి? రాఖాల్కు భయంవేసింది. ఆఫీసు రూమ్కు వెళ్ళిపోయాడు.

రూమ్లో కుర్చీలో కూచుని మళ్ళీ ఆలోచించాడు. "నే నేం చిన్న కుర్రవాడినా, లేక ఆడదాన్నా?— దెయ్యం, దెయ్యం! అంటూ పారిపోయివచ్చాను. చచ్చినవాడు మళ్ళీ బతకడ మనేది ఎక్కడైనా వుందా? నా వూహ అంతా అజ్ఞానం, వట్టి అజ్ఞానం; వదులుకోను, ఈ అవకాశం వదులుకోను. పోయి, నా అదృష్టం ఎలావుందో చూసుకుంటా..."

రెండు గంటలకి సరిగా ఇరవై నిమిషా లుంది. రాఖాల్ ధైర్యంగా పార్సిల్ రూమ్లోకి వెళ్ళి గడివేసుకున్నాడు. రకరకాల పార్సిల్సు మధ్య కాషాయ వస్త్రాలు

ధరించిన ఆ సన్యాసి కరువు వాచే నిద్రపోతున్నట్టున్నాడు. శవంమీది గుడ్డ తప్పించాడు, రాఖాల్. మొలని ఒక పట్టుగుడ్డ సంచి. ఆ సంచిలో రెండు తాళంచెవులు, ఒక టికెట్టు, కొంత డబ్బూ ఉన్నాయి.

తాళంచెవితో పెట్టె తెరిచాడు రాఖాల్. అందులో రెండు సిల్కు కాషాయ వస్త్రాలు, ఒక దోమతెర, అద్దం, గ్లాసు, ఇంకా ఏవేవో వస్తువులు, హిందీ భాగవతం, రామాయణం కనిపించాయి. ఇంకా – ఒక పెద్ద సంచీ, కావిరంగు గుడతో చుట్ట బెట్టిన దస్త్రరంకూడా వున్నాయి.

సంచీ, దస్త్రరం బయటకు తీసి, తక్కినవి మళ్ళీ పెట్టెలో పెట్టేశాడు. పెట్టెకు తాళం వేసి, తాళంచెవి సన్యాసి మొలసంచిలో పెట్టేశాడు. టికెట్టుకేసి పరీక్షగా చూశాడు. ఆ సన్యాసి సిరాధునించి హౌరా వెళ్ళుతున్నట్టు తేలింది. శవంమీద గుడ్డ కప్పి, సంచీ దస్త్రరం చేతబట్టుకుని రాఖాల్ లేచాడు. లాంతరు శవం ముఖంవేపు తిప్పి ఒక్కసారి చూశాడు. గతుక్కుమన్నాడు !–

ఇంతసేపూ చచ్చిపడివున్న సన్యాసి ఇప్పుడు నవ్వుతున్నాడు ! !– అతని పళ్ళుకూడా స్పష్టంగా కనిపిస్తున్నాయి ! ! ! రాఖాల్‌కి వళ్ళు చల్లబడింది. ధైర్యంచేసి ఒక్క అంగలో గుమ్మం దగ్గరకి పోయాడు. ఇవతలికి వచ్చి తలుపులు వేసేశాడు. గబగబా ఆఫీసు గదిలోకి వచ్చిపడ్డాడు. డ్రాయర్ లాగి దస్త్రరం, సంచీ దాచేసి, కూజాలో నీళ్ళు రెండు గ్లాసులు గడగడమని తాగేశాడు.

రాఖాల్ ఆఫీసు గదిలో ఉన్నాడేగాని; అతని మనస్సంతా నవ్వుతున్న ఆ సన్యాసిమీదనే ఉంది. తలుపు తాళం వేసినప్పటికీ గుండెధైర్యం చిక్కబట్టలేక పోతున్నాడు.

ఉన్నట్టుండి బయట ఏదో చప్పుడు. హడిలిపోయాడు రాఖాల్ వెల వెల బోయాడు. పాలిపోయాడు. కళ్ళు రెండూ పెద్దవిచేసి, గుమ్మంవేపు చూస్తూండి పోయాడు; చప్పుడు చేరువ కొచ్చింది. రాఖాల్‌కు భయం ఎక్కువయింది. చివరికి– ఒకవ్యక్తి గదిలో అడుగుపెట్టాడు. అతను చచ్చిపోయిన సన్యాసికాదు. అతని దెయ్యమూకాదు, సిగ్నల్‌మాన్ మహావీరసింగ్ !–

నోరు తెరచి రాఖాల్ "ఇంత ఆలస్యంగా వచ్చావేం ? కాస్త పెందలాడే రాకూడదూ ? ఆఫీసులో శవం వుంది; ఇక్కడ నేనొక్కణ్నే ఉన్నాను......" అంటూవుంటే, మహావీర్‌సింగ్ పకపక నవ్వుతూ, "ఇప్పుడేగా బాబా రెండు కొట్టింది. మీరేగా నన్ను రెండింటికి రమ్మన్నారు. అయినా, భయమెందుకు బాబా ! బతికున్నవాళ్ళు చచ్చినవాళ్ళకి భయపడతారా ఎక్కడైనా ?" అని అన్నాడు.

ఆ రాత్రి సిగ్నల్‌మాన్ అక్కడే పడుకున్నాడు.

'డ్రాయర్ లాగితే, సిగ్నల్‌మాన్ లేస్తాడేమో!— సంచీ తీస్తే ఆ గలగల ధ్వనికి అతని కనుమానం కలుగుతుందేమో!— ఈ వస్తువులు ఇంటికి చేర్చటం ఎలాగ?' ఇదే రాఖాల్ సమస్య

ఇంతలో ఫోన్ మోగింది. సిగ్నల్‌మాన్‌ను లేపాడు రాఖాల్. "ఇరవైనాలుగో నంబరు గూడ్సుబండి ఫతూయా స్టేషన్ వదిలింది. లే, లే!" అంటూ తొందర పెట్టాడు.

"సీతారాం, సీతారాం!" అనుకుంటూ సిగ్నల్‌మాన్ లేచి, తలపాగా చుట్టుకుని, సిగ్నలివ్వడానికి వెళ్ళాడు. ఇదే సమయమని రాఖాల్ డ్రాయరు తెరచి, సంచీ దస్తరం బయటికి తీసి, గబగబా ఇంటికి వెళ్ళాడు.

సంచిలో కొంత డబ్బుంది గాని, దస్తరంలో మాత్రం డబ్బూ దస్కం ఏమీ లేదు. రాఖాల్ అంచనా తప్పిపోయింది. దస్తరం నిండా ఏవేవో కాగితాలు, ఉత్తరాలు, పేపరు కటింగులూ ఉన్నాయి. ఉత్తరాలమీద 'శ్రీ శ్రీ శ్రీ మోహాంత భజనానందగిరి, తిన్‌తారియామర్ ఛాయా సిరాధూ' అని చిరునామా ఉంది పుస్తకాలు చూసి స్వామీజీ బెంగాలీ అయివుంటా డని అనుకున్నాడు రాఖాల్.

ఇంతలో ఇరవైనాలుగో నెంబరుబండి తాలూకు రెండోగంట వినిపించింది. సిగ్నల్‌మాన్ మళ్ళీ వస్తాడు. రాఖాల్ రూపాయలూ, దస్తరం పెట్టెలో పెట్టి, తాళం వేసి, గబగబా స్టేషన్‌కి వచ్చిపడ్డాడు.

తెల్లవారింది.

పంచాయతీ పెద్దలూ, అధికారులూ, డాక్టరూ వచ్చారు. శవాన్ని బయటికి తీశారు. పరీక్షచేసి, సర్టిఫికెట్ ఇచ్చాడు డాక్టరు. సన్యాసి సామాన్లన్నీ వెతికారు. పది రూపాయిలూ, కొంత చిల్లరా దొరికింది. ఆ డబ్బు ఖర్చుపెట్టి దహన క్రియలు జరపడానికి నిశ్చయించారు.

ఈ సన్యాసి ఏ దేశపువాడై ఉంటా డని అధికార్లకు అనుమానం వచ్చింది.

"బెంగాలీ" అని రాఖాల్ నోరుజారాడు. చటుక్కున నాలిక కరుచుకుని, ఎందుకన్నానా ఈ మాట అనుకున్నాడు.

రాఖాల్ ఈ మాట అనగానే, "బెంగాలీ అని నీ కెలా తెలుసు?" అని అడిగాడు ఇన్‌స్పెక్టరు.

"నా కేం తెలియదండీ. అతని మొహం చూస్తే అలా అనిపించింది" అని చెప్పి సద్దుకున్నాడు.

"ఈ సన్యాసి మన అసిస్టెంట్ స్టేషన్‌మాస్టర్‌లాగే ఉన్నాడు. ఇద్దరి పోలికలూ ఒకలాగే ఉన్నాయి. ఒకవేళ అతని తమ్ముడు కాదుకదా? ఆ గడ్డమూ, జడలూ లేకపోతే అచ్చం మన రాఖాల్ బాబే! సన్యాసి పెదిమలకంటె రాఖాల్ బాబు పెదిమలు కాస్త పలచన, అంతే. ఇద్దరూ ఒక్క అచ్చున పోసినట్టున్నారు" అంటూ నలుగురూ నాలుగు విధాల అనుకోసాగారు.

"మీ తమ్ముడే అయితే, వేరే ఎవరికోసమో వెదకట మెందుకూ? దహన క్రియలు మీరే జరపండి" అన్నాడు, ఇన్‌స్పెక్టరు, నవ్వుతూ.

అంతా గొల్లున నవ్వారు.

రాఖాల్‌కూడా సిగ్గుతో ముసిముసి నవ్వులు నవ్వాడు. దహనక్రియలు జరపడం రాఖాల్‌మీదే పడింది.

* * *

చాలా రోజుల తరవాత —

రాఖాల్ మనస్సు ఇవాళ కాస్తంత ఆనందంగా వుంది. హాయిగా వుంది. ఏదో ఆలోచిస్తోంది.

'సన్యాసి తాలూకు సొత్తు అయిదువంద లుంది. దీనికితోడు ప్రావిడెంట్ ఫండు, పోస్టాఫీసులో డబ్బు, అన్నీ కలుపుకుని రెండుమూడేళ్ళు గడపవచ్చు. ఈ లోగా ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోతుందా? లేదా, ఏదయినా వ్యాపారం చేస్తా. చిన్న దుకాణం పెట్టుకుంటా......' ఈ విధంగా రాఖాల్ ఆ రాత్రంతా ఆలోచిస్తూ గడిపాడు.

ఏదేనా పుస్తకం చదువుదా మనిపించింది. దగ్గరున్న డిటెక్టివ్ నవల తీశాడు. నడవలేదు. అయినా అది ఇదివర కోసారి చదివిందే. సన్యాసి దస్త్రంలో ఏముందో చూదా మని పైకి తీశాడు. అందులో ఉత్తరా లన్నీ హిందీలో ఉన్నాయి.

పేపర్ కటింగులు తీసి చూశాడు.

"బాకులీపాడా, ఈ నెల 12 వ తేదీని జమీందారు నగేంద్రనాధ్ చటర్జీ శ్రాద్ధ క్రియలు నిర్విఘ్నంగా ముగిశాయి. చటర్జీగారి జ్యేష్ఠ పుత్రులు చాలాకాలంగా ఎక్కడున్నదీ తెలియకపోవటంవల్ల కనిష్ఠపుత్రులు శ్రీ దేవేంద్రనాథ్ చటర్జీ కర్మకాండ నిర్వర్తించారు." అనే వార్త ఎర్రసిరాతో చుట్టూతా గియ్యబడివుంది.

మరొక కటింగు:

"నూరురూపాయలు బహుమతి!

గత లక్ష్మివారంనాడు నా పెద్దకుమారుడు చి॥ భవేంద్రనాధ్ చట్టోపాధ్యాయ్ ఇల్లు విడిచి ఎక్కడికో వెళ్ళిపోయాడు. వయసు 14 సంవత్సరములు. ఎవరయినా




కుర్రవాని ఆచూకీ తెలియజేసినా, తీసుకువచ్చి అప్పగించినా రూ. 100/– లు బహుమతి ఇవ్వబడును.

నగేంద్రనాథ్ చట్టోపాధ్యాయ్."

రాఖాల్ ఆలోచించాడు : 'ఈ సన్యాసి కేవలం సన్యాసికాదు. గొప్పఇంటి బిడ్డ. ఇంటినుంచి పారిపోయి, మళ్ళీ ఇన్నాళ్ళకు ఇంటికి వెళుతున్నాడులా వుంది. తండ్రి ఆస్తిపాస్తులు స్వాధీనం చేసుకుందుకి వెళుతున్నాడులా వుంది. ఇదేదో కొత్త కథలా కనిపిస్తూంది. ఈయన చరిత్ర తప్పక చదివి తెలుసుకోవలసిందే.'

సన్యాసి జీవితం మొదటిభాగ మంతా ఒక కథలాగా వుంది. రెండోభాగం డైరీ లాగా రాసివుంది. యాదాలాపంగా పేజీలు తిరగేస్తూవుంటే— —

"...ఈ వ్యర్థసన్యాసాన్ని వదిలేసి, మళ్ళీ గృహస్థాశ్రమంలోకి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను..." అనే మాటలు అతన్ని ఆకర్షించాయి.

రాఖాల్ పుస్తకం మూసేసి, పక్కమీదినుంచి లేచాడు. అటూ ఇటూ పచార్లు ప్రారంభించాడు. ఉండి వుండి కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు. అతని ముఖంలో భయం, విషాదం, అంతలోనే రవంత సంతోషం——ఇలా రకరకాల భావాలు కన

బడుతున్నాయి. తనలో తనే ఏమిటో నవ్వుకుంటాడు. అలా పచార్లు చేస్తూ చేస్తూ, ఆలోచిస్తూ ఆలోచిస్తూ, ఉన్నట్టుండి ఇలా అన్నాడు:

"రాఖాల్ !_ చచ్చిపో; నువు చచ్చిపో. చచ్చిపోయి ఖగేంద్రంగా జన్మించు..."

* * * * *

"ఇదుగో కనకం ! — ఈ ప్రకటన చూశావా ? నే చెప్పినట్టు విను. ఈ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టు. బాసులీపాడా రాణీగారికి నువు తప్పక నచ్చుతావు. నీ కీ ఉద్యోగం తప్పక దొరుకుతుంది. కొన్నాళ్ళపాటు నువ్వు ఆమె సహచరిగా నటించాలి. ఇదే ఈ నాటకంలో నీ పాత్ర. చిన్నరాణీకి భర్త పోయాడు. ఆమె ఇంకా ముక్కు_పచ్చలారని ముద్దుగుమ్మ. నువ్వామెను నాకు భార్యగా చేయాలి. ఆమెను నువ్వు వప్పించాలి. ' నా పని సఫలం చేశావంటే, నీకు గొప్ప బహుమతి ఇస్తాను. అంత వరకూ నెలకు రెండువందలు జీత మిస్తాను." అంటూ ఖగేంద్రనాథ్ కనకలతను ఆశ పెడుతున్నాడు.

కనకలత పకపక నవ్వి, "బాగానేవుంది నీ నాటకం. ఒకవేళ ఆమె కురూపి అయితే ? "

"ఏం ? — కురూపి అయితే ఎవరూ పెళ్ళి చేసుకోరా ? "

"ఓహో — ఆమె డబ్బుకోసం ఎత్తు వేస్తున్నావా ? "

"నేను అలాంటివాణ్ని కాను. వితంతు వివాహం చేసుకుని, బంగాళా దేశానికి ఆదర్శపురుషుడి నవుతాను."

"అయ్యో ! — ఈ దేశాన్ని గురించి చింతతో నీకు నిద్ర ఎక్కడ పడుతుందీ, పాపం ! — అవునుగాని, ఆ ఎస్టేటంతా ఆమె చేతిలోనే వుందా ? "

"ఉండడ మేమిటి ? ఆమెదే పెత్తనమంతా. లక్షకు పైన రాబడి. అందుకనే ఈ హంగామా."

"ఆమె సనాతన కుటుంబానికి చెందినది. నిన్ను పెళ్ళాడటానికి చటుక్కున వప్పుకుంటుం దనుకున్నావా ? "

"అంత చప్పున వప్పుకునే దయితే నేను నీ గుమ్మంలో కెందుకు వస్తానూ ? — నువ్వక్కడికి వెళ్ళి ఆమెను వశపరచుకోవాలి. వితంతు వివాహాన్ని గురించి ఆమెకు నూరిపోయాలి. ఆమెకు ఎనిమిదో ఏట పెళ్ళయింది. రెండు నెలలకే భర్త పరారీ అయ్యాడు మామగారూ, మరిదీ పోయారు. ఆమెకు ఒక ముసలి అత్తగారు మాత్రం మిగిలుంది. ఒంటరిగా ఉండలేక ఈ ప్రకటన వేయించింది_నువు చదువుకున్న దానివి. సంగీతజ్ఞానం వుంది. దరఖాస్తు పెడితే చాలు, నీ కీ ఉద్యోగం దొరికితీరుతుంది."

* * * * *

ఆమెకు ఇరవై యేళ్ళుంటాయి. చూస్తే పునిస్త్రీలాగానే కనబడుతూంది. ముఖంలో విషాదం, కళ్ళమ్మట నీళ్ళు నిండివున్నాయి. బాఖలీపాడా జమీందార్ల భవనం దగ్గిర — గంగలో కొట్టుకువచ్చి — మెడమీద గాయాలతో, కొనప్రాణా లతో గట్టు చేరుకుం దామె. చినరాణి ఇందుమతీదేవి స్నానానికి వెళ్ళినప్పుడు గట్టుకి చేరి, కొనప్రాణంతో ఆమెను చూసింది. బయట పడేసి బతికించింది. ఆమెకు స్పృహవచ్చి కోలుకున్నాక చినరాణి అడిగింది: "అమ్మా!— నీ పే రేమిటి?"

"సురబాల"

"మీ పుట్టిల్లు ఏ వూరు? అత్తా రేవూరమ్మా?"

ఈ ప్రశ్నలకు ఆమె సమాధానం చెప్పలేదు. ఏడుపు మొదలెట్టింది. ఇక రాణి ఆమెనుగురించి అట్టే తెలుసుకుందికి ప్రయత్నించలేదు. దాసీలను కూడా ఏమీ అడగ వద్దని కట్టడి చేసింది. రోజూ తనే వచ్చి చూసివెళుతూంది.

వారం రోజుల తరవాత —

"అమ్మాయీ! — నువ్విక్కడికి వచ్చి వారం దాటింది. నీవా ళ్ళెక్కడున్నారో ఏమీ చెప్పావుకాదు. నీకోసం వా ళ్ళేం బెంగ పెట్టుకున్నారో? ఏం బెంగిలిపోతు న్నారో! — వాళ్ళకి కాస్త కబురు చెయ్యటం మంచిదికాదూ? — వచ్చి నిన్ను తీసుకు వెళతారు," అన్నది చినరాణి.

"రాణీగారూ! — నా కోసం బెంగ పెట్టుకునేవాళ్ళు గాని, నే నిక్కడున్నా నని తెలిసి సంతోషించేవాళ్ళు గాని నా కెవరూ లేరు. మీరు నాకు జీవనాధారం కల్పిస్తా నంటే నా దొక మనవి:"

"ఏమి టది చెప్పు తల్లీ! —"

"తమది జమీందారీ. దేవుడి దయవల్ల మీకు దేనికీ లోపంలేదు. నే బతికివున్నంత కాలమూ నాకు మీ యింట్లో ఆశ్రయం ఇప్పించండి. నన్నూ ఒక దాసీగా భావించండి. నన్ను వదిలెయ్యకండి" అంటూ జాలిగా ప్రార్థించింది సురబాల, కళ్ళనీళ్లు రాలుస్తూ.

రాణి ఇందుమతి సురబాల కళ్లు తుడిచింది. ఓదార్చింది. "ఈ భాగ్యానికే ఇంత భయ మెందుకు తల్లీ! — నిన్ను పంపించేస్తానని నే నెప్పుడూ అనలేదే? లేదమ్మా, లేదు. నిన్నెక్కడికీ వెళ్ళనివ్వను. నా దగ్గరే ఉంచుకుంటా. ఊరుకో. ఏడవకమ్మా, ఏడవకు..."

ఇందుమతి దుఃఖం కాస్సేపటికి ఆగింది.

"చూడమ్మా చెల్లాయ్! – నేనూ ఒంటరిగా వున్నాను. నాకూ తోడు కావాలని మా దివానుగారు పత్రికలో వేయించారు. వేరే ఎవరినో పిలవటం దేనికీ, నిన్నే నాకు తోడుగా వుంచుకుంటా, ఏం? – "

* * *

"అమ్మా! – మనం పత్రికలో వేయించిన ప్రకటనకి వచ్చిన దరఖాస్తు లివిగో. ఇందులో నాలుగు మన కేమీ పనికిరావు. ఈ అయిదో దరఖాస్తు పంపిన మనిషి మనకి పనికివచ్చేలా కనిపిస్తుంది. రామాయణం, భారత భాగవతాలు శ్రావ్యంగా చదివి విని పించ గలదట. మనకి కావలసినదీ అలాంటి మనిషే, కనుక మీ మనస్సుకి కాస్త సంతోషం కలిగించగలదై వుండాలి. అంతేకదమ్మా?" అని అడిగాడు దివాను.

సురబాలను సహచరిగా పెట్టుకుంటా నని చెబుదా మనుకుంది చినరాణి. కాని సందేహించింది. ఇప్పుడు దివాన్ మాటలు విన్నమీదట అసలే వీల్లేకపోయింది. దివానుకి నచ్చిన దరఖాస్తు చూసింది.

"ఈ అమ్మాయినే నియమించా లని నా ఉద్దేశం. ఏమంటా రమ్మా?" తన వుద్దేశం వెల్లడించాడు దివాన్.

"అలాగే కానియ్యండి. సురబాలా వుంటుంది; ఆమెనూ రానియ్యండి. మీ కెలా మంచిదని తోస్తే అలాగే చేదాం బాబయ్యగారూ!" అంది చినరాణి.

"అయితే, అలా గని ఉత్తరం రాయనా? – "

"రాయండి. రాస్తూ, ప్రయాణపు ఖర్చులకూ, బట్టలకూ వాటికీ కూడా డబ్బు పంపండి."

* * *

ఆర్డరు ప్రకారం కనకలత ఖగేంద్రనాథ్‌తో బాళులీపాడా జమీన్‌లో అడుగు పెట్టింది ఆమెను అంతఃపురంలోకి పంపించి ఖగేంద్రుణ్ని కచేరీహాల్లో కూచో పెట్టారు ఉద్యోగులు.

ఖగేన్ ఫలహారం ముగించి కూచున్నాడు. దివాను వచ్చాడు. "ప్రయాణం సుఖంగా జరిగిందా?" అంటూ దివాన్‌జీ, దిక్కులు చూస్తున్న ఖగేంద్రుడ్ని కుశల ప్రశ్నలు వేశాడు.

ఖగేంద్రు డేదో సమాధానం చెప్పాడు.

ఎస్టేటులో కేసు లేమైనా దొరకుతాయేమో నని కదిపిచూడాడు. కాని, అదేం లాభం లేకపోయింది. కోర్టువ్యవహారాల్లోనూ, లిటిగేషన్ లలోనూ ఆరముగ్గిన దివాన్జీ వేసిన రెండు మూడు ప్రశ్నలకే ప్లీడర్ ఖగేంద్రుడు బోల్తాకొట్టాడు. తన తెలివి




తక్కువను సరిదిద్దుకుందుకు ప్రయత్నించాడు. కాని, లాభం లేకపోయింది. దీనితో ఖగేంద్రుడికి దివాన్జీ ముఖం చూడటానికికూడా సిగ్గుగావుంది.

ఏ దెలావున్నా, అతనికి జమీందారీలో అతిథి మర్యాదలు సవ్యంగానే జరుగుతున్నాయి. అందు కేం లోటులేదు. కనకలత ద్వారా ఇందుమతీదేవితో పరిచయం చేసుకోవాలని ఎన్నో విధాల తాపత్రయపడ్డాడు ఖగేంద్రుడు.

"ఒకసారి రాణి నీ ముఖం చూసిందంటే, మన పని తేలికవుతుంది" అని కనకలత మాట.

రోజు గడిచింది, రెండు రోజు లయింది, మూడవ రోజునకూడా చిన్నరాణి ముఖం చూస్తే — తన అంద చందాలను ఆమెకు ప్రదర్శించే అవకాశం మాత్రం అతనికి దొరకలేదు.

నాల్గో రోజున "మా చెల్లెల్ని ఒకసారి కలుసుకోవాలి" అని గుమాస్తా నడిగాడు ఖగేంద్రుడు.

"సరే, రాణీగారి కీ సంగతి తెలియజేస్తాం. వా రనుమతిస్తే, వెళ్ళి మీ చెల్లెల్ని కలుసుకోవచ్చు" అన్నాడు గుమాస్తా.

దివాణంలో ఈ నిర్బంధాలు చూస్తూవుంటే ఖగేంద్రుడికి తన పథకమంతా తలకిందు లయేట్టు కనిపించింది.

ఎలా అయితేనేం, రాణిగారి అనుమతి దొరికింది. నిర్ణీతసమయానికి నౌకరు వచ్చి ఖగేంద్రుడ్ని అంతఃపురం వరకూ తీసికెళ్ళాడు. అక్కడ ఒక పరిచారికకు అప్పగించాడు. పరిచారిక అతన్ని ఒక గదిలో కూచోబెట్టి, "మీ రిక్కడే ఉండండి" అని చెప్పి వెళ్ళిపోయింది.

కాస్సేపటికి కనకలత వచ్చింది.

ఇద్దరూ ఏమిటేమిటో మాట్లాడుకున్నారు చివరికి విడిపోయారు. దాసీది వచ్చి, ఖకేంద్రుణ్ని మళ్ళీ వచ్చినచోటికి తీసుకుపోయింది.

* * * *

అందచందాలతో తీర్చిదిద్దిన చినరాణీగారి గదిలో చిత్రాలమధ్య ఖగేంద్రుడి చిత్రాన్ని కూడా ఉంచబోయింది కనకలత. కానీ, రాణీ "మీ అన్నఫోటో నీ గది లోనే వేసుకో" అన్నది.

అందుకు కనకలత కల్లబొల్లిగా ఏడుస్తూ, "అమ్మా, నాకు తల్లి లేదు. తండ్రి లేడు. నాకు 'నా' అన్నవాడల్లా ఒక్కఅన్న. వాడుతప్ప నాకీ ప్రపంచంలో మరెవ్వరూ లేరు. వాడినే చూస్తూ ఉండాలని నే కోరుకుంటా. పగలల్లా నేను మీ గదిలోనేకదా వుండేది? ఇక ఈ ఫొటో నా గదిలో వున్నా ఒకటే, లేకపోయినా ఒకటే." అంటూ కంటతడి పెట్టుకుంది. అమాయకురాలు ఇందుమతీదేవి అనుమతించింది.

చినరాణి గది అంతా అధునాతన విధానంలో అలంకరింపబడింది. ఆ అలంకారాల మధ్య ఇందుమతిని వలలో వేసుకుందుకు ఉపాయాలు పన్నుతూవుంది కనకలత. కానయితే, ఆమె అందరిలాంటి ఆడమనిషికాదు. చాలా స్థయిర్యం కలది. బాగా ఆలోచించిగాని ఏ నిర్ణయానికీ రాదు. ఆమె నిర్ణయాన్ని మార్చటం ఎవరికీ తరం కాదు ఇదే కనకలతకు కొరకరాని సమస్య అయికూచుంది.

* * * *

ప్రియమయిన సోదరి కనకలతకి —

చినరాణీగారు నీ మీద ఇంత ఆదరం, స్నేహం చూపుతున్నందుకు ఆమెకు నే నెంతో కృతజ్ఞుణ్ని.

అమ్మా నాన్నా నిన్ను నా చేతుల్లో పెట్టిపోయారు. పెళ్ళయిన మూడేళ్ళకే నీకు వైధవ్యం ప్రాప్తించింది. నీ ఈ దుఃఖం నన్ను దహించివేస్తూంది.

సుశీలబాబు నీమీద చాలాకాలంగా ఆశలు పెట్టుకుని వున్నాడు. ఆ సంగతి నీకూ తెలుసు. నువ్వు అంగీకరిస్తే నిన్ను పెళ్ళి చేసుకుంటాడట. లేకపోతే ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోతాడుట.

కనుక, నా మాట విను. వివాహానికి సమ్మతించు. ఇందులో తప్పేమీ లేదు నా మాట మీద నీకు నమ్మకం లేకపోతే రాణిగారి నడుగు నువ్వంటే ఆమెకు అపేక్ష కదా? — జీవితాన్ని ఇలా అంధకారంలో వుంచుకోమని ఆమె ఎన్నటూ సలహా ఇవ్వరని నా దృఢవిశ్వాసం. ఆమె బుద్ధిమంతురాలు. పెళ్ళి చేసుకోమనే ఆమె నీకు సలహా ఇస్తారు.

* * * * *

——ఇదీ కనకలతకు ఖగేంద్రుడు రాసిన ఉత్తరం. ఉత్తరంతో పాటు, వితంతు వివాహాన్ని గురించి రెండు పుస్తకాలు కూడా పంపాడు.

కనకలత ఈ ఉత్తరమూ, పుస్తకాలూ దేవికి చూపించింది. వాటిని చూస్తూన్న రాణి ముఖకవళికలు గమనిస్తూనేవుంది.

ఇందుమతి ఉత్తరాన్ని కింద పారేసింది. పుస్తకాలను కిటికీలోంచి తోటలోకి విసిరేసింది. గుమ్మంవేపు పోబోయింది.

''ఎక్కడికీ వెళుతున్నారు?'' — అని అడిగింది కనకలత.

''అపవిత్రమయిన నా చేతులు గంగలో కడుక్కు రావటానికి'' అంటూ రాణి వెళ్ళిపోయింది.

గతుక్కుమంది కనకలత.

* * * * *

ఠంగుమని గడియారం గంట కొట్టింది. అంతా నిశ్శబ్దం. చిన్నరాణి ఇందుమతీదేవి ఏదేదో ఆలోచిస్తూంది. కనకలత — ఆమె కథ, ఆమె ప్రవర్తన, వీటిని గురించే ఆలోచన. ఆ ఆలోచన కనకలత మీదినుంచి తన మీదికే మళ్ళింది. పెళ్ళిఅయి ఈ ఇంటో అడుగుపెట్టేసరికి ఆమెకు ఎనిమిదేళ్ళు. భర్తకు పధ్నాలుగేళ్ళు. అప్పుడు వారంరోజులు మాత్రమే తా నిక్కడ ఉంది. ఆ వారంరోజుల్లోను సిగ్గు మూలంగా భర్తతో సరిగా మాటయినా మాటాడ లేకపోయింది. ఆతరువాత తను పుట్టింటికి వచ్చిన రెండు నెలలకే భర్త పరారీ అయ్యాడు. భర్త ముఖమైనా ఆమెకు లీలగా మాత్రమే జ్ఞాపక ముంది...

అతన్ని గురించిన మరికొన్ని వూహలు ఆమెలో ఇంకా అలా శాశ్వతంగా ఉండిపోయాయి. అతను ఈ గదిలోనే భోంచేసేవాడు. ఈ గదిలోనే చదువుకునే వాడు. ఈ గదిలోనే నిద్రపోయేవాడు. ఇదుగో — ఇక్కడే అతని పెంపుడు పావురా ఉండేవి. ఈ తోటలోనే పెంపుడు కుక్కతో పరుగులెత్తుతూ ఆడేవాడు. ఉదయాన్నే గంగాస్నానం చేసి, ఇటునుంచే తిరిగి వచ్చేవాడు. ఆ వ్యక్తి — ఆమె నాథుడు —

ఆమె దేవుడు ఏడీ?— ఎక్కడ వున్నాడు? ఏళ్ల మీద ఏళ్లు గడిచినా, అతని జాడ మాత్రం తెలియటం లేదు. అత డింక బతికి వుండడని అత్తమామలు నిరాశ చేసుకున్నారు. తలచుకుంటే ఆమె మనస్సు మరింత అంధకార మయింది...

అప్పటినుంచి ఆమె తన భర్తను మామూలు మానవుడుగా భావించుకోవటం మానివేసింది. పుణ్యాత్ముడుగా, దైవంగా, అమరుడుగా, స్వర్గంలో ఒక దివ్య జ్యోతిగా వెలుగుతున్నా డనుకునేది తన భర్త తనకోసం ఆ అమరలోకంలో నిరీక్షిస్తూ ఉంటాడు. ఇహంనుంచి ముక్తి లభించగానే తను తన భర్తదగ్గరకు వెళ్ళిపోతుంది. అప్పుడు ఆమే, అతనూ కలుసుకోగల్గుతారు...

ఠంగున గంట కొట్టింది ఏదేదో ఆలోచిస్తూ అప్పుడే నిద్రపోతున్న ఇందుమతీదేవి గతుక్కుమని లేచింది. కళ్లు తెరిచి చూసింది. సూర్యోదయం కావస్తూంది గబగబా లేచి గంగాస్నానానికి బయల్దేరింది.

దోవలో సురబాల ఎదురయింది.

"నీకు రాత్రిళ్ళ కలలు వస్తాయా ? —" అడిగింది చినరాణి.

"ఆఁ: అప్పుడప్పుడు వస్తూవుంటాయి."

"అయితే, నీ కల లెప్పుడైనా నిజమయినాయా ? —"

"తెల్లారగట్ట వచ్చిన కలలు నిజమవుతా యంటారు. నే నొకసారి పుట్టింటి దగ్గరుండగా నాకొక ఉత్తరం వచ్చినట్టు కల వచ్చింది. మర్నాడు నిజంగానే నా భర్త దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. మీకూ కలలు వస్తాయా ? —" అని అడిగింది సురబాల.

"అప్పుడప్పుడు — ఇవాళ తెల్లారగట్ల నా కో కల వచ్చింది."

"అయితే — తప్పకుండా ఫలిస్తుంది. ఇంతకీ ఏమిటా కల ? —"

"ఇప్పుడు కాదు, మధ్యాహ్నం చెబుతా."

"భగవంతుడు మీ మ్మల్ని అన్యాయం చేశాడు ఇన్ని సుగుణాలు, ఇన్ని తెలివితేటలు, ఇంత ఐశ్వర్యం ఇచ్చిన ఆ దేవుడు మీ కింత కష్టం ఎందుకు తెచ్చిపెట్టాడో నా కేం తెలియటంలేదు. నాకు కష్టాలు వచ్చాయంటే అందుకు తగినన్ని కారణాలున్నాయి. కాని, మీ కేమిటి; ఈ కష్టా లేమిటి ? —"

"లేదు చెల్లీ ! — దేవుడు ఆలోచించకుండా ఏ పనీ చెయ్యడు ఏ దెలా వున్నా ఈ కష్టాలకూ, దుఃఖాలకూ ఫలితం చివరికి మంచిగానే పరిణమిస్తుంది ఇది మాత్రం నిశ్చయం" అన్నది చినరాణి.




"నేనూ మీలాగే ఇలా అనుకుని నమ్మగలిగినట్టయితే — నాకూ మనశ్శాంతి లభించివుండేది" అన్నది సురబాల, తెల్లబోయి.

*　　　*　　　*

మధ్యాహ్నం :

"ఏం అమ్మా, ఏం కల వచ్చిందీ, నాకు చెబుతా మన్నారు, చెప్పనేలేదే ! — ఏమి టా కల ? ఎవర్ని గురించి వచ్చింది ? —"

"చెబుతా విను, చెల్లీ ! — రాత్రి ఎందుకో మనసు బాగుండక, చాలా సేపటిదాకా నిద్ర పట్టింది కాదు. ఏమిటేమిటో ఆలోచిస్తూ పడుకున్నా ఎప్పుడు నాకు నిద్ర పట్టిందో తెలియదు. కానీ, నా కో కల వచ్చిన సంగతి బాగా జ్ఞాపక ముంది—

"వంటినిండా నగలు పెట్టుకున్నానుట నేను. పట్టుబట్టలు కట్టుకున్నానుట. నుదుట కల్యాణపు బొట్టు వుందిట. నా చుట్టూ పేరంటాళ్లు గుమికూడి వున్నారట. నన్ను వేళాకోళా లాడతారట ఇంతలో చీకటిపడింది. దీపాలు వెలిగాయి. 'పెళ్ళికొడుకు వచ్చాడు, పెళ్ళికొడుకు వచ్చాడు !!' అంటూ కోలాహలం. శంఖారావం..."

"తర్వాత ? —" అడిగింది సురబాల, ఎంతో ఉత్సాహంగా.

"ఇంకేముంది — మెళకువ వచ్చేసింది. కళ్ళు తెరచి చూస్తే, అప్పుడే తెల్లతెల వారుతూంది."

"చాలా మధుర స్వప్నం కదూ. అయితే ఈ కల నిజ మెలా అవుతుంది ? —" నిట్టూర్చింది సురబాల.

చినరాణి కళ్ళలో నీళ్ళు మిలమిల మెరిశాయి. "ఎందుక్కాదు చెల్లీ ! — తప్ప కుండా నా కల ఫలిస్తుంది. అయితే ఈ జన్మలో కాదు. పరలోకంలో — నా భర్త విహరించే స్వర్గంలో — అయితే, స్వర్గానికి వెళ్ళేంత సుకృతం నా కుందో లేదో. అయినా, వారు నన్ను స్వర్గానికి తప్పకుండా తీసుకు వెళతారు. అక్కడ మళ్ళీ మాకు వివాహం జరుగుతుంది. నే పెళ్ళికూతు ర్నవుతాను..." చినరాణి అశ్రువు లలో ఆశా, ఆనందమూ మిలమిలా మెరిశాయి.

"తప్పకుండా అలాగే జరగాలి. దేవు డలాగే చెయ్యాలి. మీలాంటి సౌభాగ్యం నాక్కూడా కలగా లని నన్నూ దీవించండి" అంటూ, చినరాణి పాదధూళి తీసుకుంది సురబాల.

"అదేఁటి ? — నా కాళ్ళమీద చేతులు వేస్తా వెందుకు ? — "

"నేను పవిత్రమైన మీ పాదధూళికి కూడా తగను. నా జీవితగాథ కూడా మీకు చెబుతాను, ఎప్పుడో..."

ఉన్నట్టుండి, బిగ్గరగా శంఖారావాలు వినవచ్చాయి. చినరాణీ, సురబాలా చెవులు రిక్కించి విన్నారు. ఆశ్చర్యపోయారు. ఒకరిముఖా లొకరు చూసుకున్నారు.

ఇంతలో ఒక పండు ముత్తయిదువ కుంకుమబరిణెతో ఆయాసపడుతూ వచ్చింది. "అమ్మా !— మన బాబుగారు బతికేవున్నారు. ఉత్తరం వచ్చింది..." అంటూ, వణుకుతున్న చేతులతో ఇందుమతీదేవి పాపిట్లో కుంకుమబొట్టు పెట్టింది.

ఈ ఆనంద ప్రవాహానికి ఇందుమతి తట్టుకోలేకపోయింది. లతలాగా అల్లల వణికిపోయింది; పడిపోయింది. కాని, సురబాల పట్టుకుంది. మూర్ఛపోయిన చిన రాణిని లోపలికి తీసుకువెళ్ళారు

*　　　　*　　　　*

ఖుస్రుపూర్ వదిలిన రాఖాల్ భట్టాచార్య, భవిష్యత్తునుగురించి రకరకాలుగా ఊహించుకోసాగాడు. కాశీకి వెళుతున్నా నని చెప్పి బయల్దేరినవాడు అలహాబాద్‌లో దిగాడు. అక్కడ కర్మకాండ చేయించుకున్నాడు. ఏవేవో గుడ్డలు కొన్నాడు. కావి రంగు కొని, వాటికి పట్టించాడు. అలహాబాదులో రెండురోజు లుండి, కాశీకి ప్రయాణం కట్టాడు.

అక్కడ ఒక యిల్లు అద్దెకు తీసుకున్నాడు. వాళ్ళ సంప్రదాయానికి సంబంధించిన పుస్తకాలు సంపాదించి చదివాడు. ఖుస్రుపూర్ వదిలినప్పటినించీ ఎవడేనా నీ పేరేమిటి అని అడిగితే భవేంద్రనాథ ఛటోపాధ్యాయ్ అని చెప్పేవాడు. రోజూ భోజనానంతరం భవేంద్రుడి ఆత్మకథ చదివేవాడు. అందులోని సంగతు లన్నీ బాగా చదివి జీర్ణం చేసుకున్నాడు.

పదిహేనురోజులు గడిచాయి.

ఒకసారి బాళులీపాడా వెళ్ళి అక్కడి పరిస్థితులూ పరిసరాలూ చూసుకురావటం ఎంతయినా అవసర మనిపించింది.

ముసల్మాను దుస్తులు కుట్టించాడు. పల్లెటూరు చెప్పులు కొన్నాడు. ఒక ఫకీరుకి డబ్బు లిచ్చి భిక్షాపాత్రా ఇంకా ఏవేవో కొన్నాడు.

ఫకీరువేషంలో బాళులీపాడాలో అడుగు పెట్టాడు రాఖాల్. ఆ చుట్టుపక్కల గ్రామా లన్నీ తిరిగాడు. భవేంద్రుడి జీవితానికి సంబంధించిన స్థలా లన్నీ తిరిగి చూచాడు. అతని చరిత్రలో తారసపడిన దివాను, ఎస్టేటు ఉద్యోగులు — వీళ్ళని గుర్తుపెట్టుకున్నాడు. ఇలా ఒక వారంరోజులు అక్కడ గడిపి, మళ్ళీ కాశీకి తిరిగి వచ్చేశాడు.

* * *

కాశీక్షేత్రం

పరమ పూజ్యులయిన శ్రీ నాన్నగారి
పాదసన్నిధికి : నమస్కారములు —

చాలా కాలానికి ఇప్పుడు అధముడు, అయోగ్యుడు అయిన మీ కుమారుడు పశ్చాత్తాపం పొంది రాయునది : పదహారేళ్ళక్రితం నేను ఇల్లు విడిచిపోయాను. నా వార్తలు మీకు తెలియవు. నేను బతికివున్నా ననే ఆశకూడా మీరు వదులుకుని వుంటారు. ఇల్లు వదిలాక కొంతకాలం అలహాబాదులో వున్నాను. నాకోసం మీరు 'వంగవాసి' పత్రికలో వేసిన ప్రకటన చూశాను. నన్ను పట్టుకుంటా రని మన దేశస్థులు లేని ప్రదేశాలకు పారిపోయాను తిన్‌తారియా మఠాధిపతి గిరిమహారాజు అనుగ్రహాన్ని సంపాదించాను; వారి శిష్యుడ నయ్యాను. వారు చనిపోయాక వారి స్థానాన్ని పొందాను.

కాని; ఇప్పుడీ సన్యాసి జీవితమంటే రోతగావుంది. రెండేళ్ళనుంచీ ఇంటికి రావాలని అనుకుంటున్నాను. అయితే మనస్సు స్థిరపరుచుకోలేకపోయాను.

రెండు నెలల క్రితం మీరు కలలోకి వచ్చారు. కళ్ళజబ్బుతో షేడ్సు తగిలించుకుని పసుపుపచ్చ చేతిగుడ్డ పుచ్చుకుని మీరు నన్ను ఇంటికి రమ్మన్నట్టు కనిపించారు. ఆవేళ నా కెంత ఏడుపు వచ్చిందో చెప్పలేను. మర్నాడే మఠాన్ని వదిలిపెట్టాను. పుణ్యక్షేత్రాలు చూసుకుంటూ కాశీ చేరుకున్నాను.

పూరీ, రామేశ్వరం కూడా దర్శించుకుని, జ్యేష్ఠమాసం ఆఖరికి ఇంటికి వద్దామని అనుకుంటున్నాను. కానీ, నా మనస్సు నన్ను నిలవనియ్యటంలేదు. కనుక, వచ్చే ద్వాదశినాడు బయల్దేరి త్రయోదశినాటికి బాబులీపాడా చేరుకుంటాను.

అమ్మకు నా నమస్కారములు. తమ్ముడు దేవేన్‌కి నా దీవనలు. తక్కిన పెద్దలకు నా నమస్కారములు. పిన్నలకు ఆశీస్సులు.

విధేయుడు
భవేంద్ర

తా. క :— ఇక్కడ మన పండా కాశీనాథ్ మిశ్రా గురించి వాకబు చేశాను. వారు రెండేళ్ళ క్రితమే కాలం చేశారట.

*    *    *    *    *    *

కచేరీలో లెక్కలూ అవీ తనిఖీ చేస్తూ పెద్దమనుషులతో బాతాఖానీ వేస్తూ టేబిల్ ముందు కూచున్నాడు దివాన్ రఘునాథ ముజుందార్.

తపాల బంట్రోతు వచ్చాడు. "నమస్కారం బాబూ !— చనిపోయిన పెదబాబు గారి పేర రిజిస్టరీ ఒకటుంది" అంటూ, కవరు తీసి టేబిల్‌మీద పెట్టాడు.

"బాబుగారు పోయి రెండేళ్ళయిందే. ఇన్నాళ్ళకి వారిపేర ఎవరు రాసివుంటారు ఈ కవరు. ఎక్కణ్నించి వచ్చిం దసలూ ?— బెనారస్ సిటీ — ఓ . . . కాశీలో మన పండా వున్నాడు......" అనుకుంటూ కవరు తీసుకున్నాడు దివాను.

ఉత్తరా లన్నీ చూశాక ఆఖర్న రిజిష్టరు కవరు చింపాడు దివాన్. ఉత్తరం బయటికి తీశాడు, చూశాడు. చూస్తూనే అతని ముఖం వెలవెలబోయింది. కాళ్ళూ చేతులూ వణకసాగాయి.

"ఏమిటి సంగతి, ఏమిటి సంగతి ? — దుర్వార్త కాదుకదా," అంటూ పెద్దమనుషులు ప్రశ్నించారు.

ఉత్తరం చదువుతున్న దివాన్ ముఖకవళికలు రకరకాలుగా మారాయి ఒకసారి సంతోషంతో ముఖం విప్పారింది. ఒకసారి కనుబొమలు ముడిపడ్డాయి. మరొకసారి కోపంతో పెదవులు కంపించాయి. మళ్ళీ ముఖం వికసించింది. ప్రసన్నమయింది.




ఒకసారి చదివి పూర్తిచేశాక మళ్ళీ రెండోసారి చదివాడు. చదివి ఆ ఉత్తరం సొరుగులో పెట్టి తాళంవేశాడు. దీర్ఘంగా నిట్టూర్చి, చూస్తూ వూరుకున్నాడు.

"ఏంటా వుత్తరమేనా ?–" ప్రశ్నించారు పెద్దలు.

"ఊహూఁ" అంటూ లేచాడు దివాను.

"ఏం, అప్పుడే లేచారు?"

"పనివుంది. ఇవాళ ఏకాదశి కదూ ?"

"ఆఁ – అయితే మేమూ లేస్తామహ" అంటూ లేచారు పెద్దలు.

లేచిన పెద్దలు అక్కడినించి వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళారు. వెళుతూ వెళుతూ, వచ్చిన ఆ వుత్తరాన్ని గురించి రకరకాలుగా తర్కించుకోసాగారు.

* * * * *

అంతఃపురానికి వెళదామని దివాన్‌జీ లేచాడు; కానీ, ఆలోచిస్తూ కాసేపు అలా నించుని, మళ్ళీ కూచున్నాడు. ఉత్తరం తీసి మళ్ళీ ఒకసారి పట్టి పట్టి చదివాడు. తల పట్టుకుని దీర్ఘాలోచనలో పడ్డాడు:

'ఇప్పుడేమిటి గత్యంతరం :– ఈ వార్త ఇంట్లో చెప్పడమా, మానడమా ?– ఈ ఉత్తరం రాసింది నిజంగా భవేంద్రుడో, మరెవరేనా మోసకాడో !– ఇప్పుడీ వార్త

చెప్పగానే సంతోషంతో అందరూ ఉక్కిరి బిక్కి రవుతారు. ఒకవేళ మోసగాడే అయితే పరిస్థితి దారుణంగా పరిణమిస్తుంది. కానీ– ఇప్పుడే ఈ సంగతి బయట పెట్టను. రానీ– అతను వచ్చాక చూద్దాం. అయినా పదహారేళ్ళయింది చూసి. గుర్తు పట్టడంకూడా కష్టమే. ఏదెలా వున్నా, మోసగాడయితే మాటల్లో పట్టుబడకపోడు. అప్పుడా మోసగాడ్ని గట్టిగా నాలుగు తగిలించి పోలీసులకు అప్పగిస్తే సరి...

'ఒకవేళ అతను నిజంగా భవేంద్రుడే అయితే?– అయితే – ఆహా – అందరికీ ఎంత ఆనందం! ఎంత ఆనందం!!— ఈ ఉత్తరం మోస మవుతుందా?– ప్రతీ చిన్న విషయమూ ఇంత వివరంగా రాసివుందే. ఇన్ని విషయాలు పైవాళ్ళ కెలా తెలుస్తాయి?— అవును. ఇతను నిజంగా భవేంద్రుడే అయివుంటాడు. అవును, భవేంద్రుడే...

'ఇప్పుడీ వార్తా కప్పిపుచ్చానంటే, రేపు అతను వచ్చాక — అతను నిజంగా భవేంద్రుడే అయితే, నామీద అందరకూ అనుమానం కలగవచ్చు: భవేంద్రుడి రాక నాకు ఇష్టం లేదనీ, జమీందారీకి నేనే సర్వాధికారి నవుదా మని చూస్తున్నా ననీ అంటారు. తప్పదు ఈ వాదు తప్పదు. ఈ విషయం మేలుకోరే దాచానని నే నంటే, అప్పు డెవరేనా నమ్ముతారా? ఉహుఁ — నమ్మరు. వచ్చి వచ్చి పెద్ద చిక్కులో పడ్డానే? ... ఎంత విషమసమస్య వచ్చిపడిందీ?—

'ఇవాళ ఏకాదశి. పెద్దరాణి, చినరాణి — ఇద్దరూ ఉపవాసమే. వాళ్ళు నీరసంగా వున్న సమయంలో ఇంత ఆనందాన్ని తట్టుకోగలరా?—ఏదేనా దుర్ఘటన జరిగితే?— పోనీ, ఇవాళ్టికి ఆగి, రేపు ఫలహారం చేశాక చెబితే......?

'అహఁ — అదేమీ పిల్లేదు — ఇంతటి శుభవార్తను ఒక రాత్రల్లా దాచివుంచే అధికారం నాకు లేదు. వెళతాను, ఇప్పుడే వెళతాను. వెళ్ళి, పెద్ద రాణిగారికి చెబుతాను. చెప్పి, కాస్త హెచ్చరికకూడా చేసి వుంచుతాను...'

* * * *

ఈ వార్త విన్ని పెద్దరాణి సంతోషంతో, దుఃఖంతో ఉక్కిరిబిక్కి రయిపోయింది. ఆ ఆనందంలో దివాన్‌జీ హెచ్చరిక ఆమెకు వినబడనేలేదు.

అంతఃపుర మంతా ఆనందంలో మునిగిపోయింది. పూజామందిరంలో శంఖాలు పూరించారు. కుంకుమబరిణతో ముత్తయిదువ రొప్పుతూ తోటలోకి పరుగెత్తింది.

చినరాణి మూర్ఛపోయింది.

* * * *

"నీకేకాదు నాయనా ! — నాకూ కలిగిం దా సందేహం. నాకు రాత్రల్లా నిద్ర పట్టలే. కాని, కోడలు చెప్పిన సంగతినిబట్టి కాస్త మనసు కుదుటపడేలా వుంది. దానికి రాత్రి ఒక కల వచ్చిందట..." అంది పెదరాణి.

"ఈ కలలమీదా, కథలమీదా ఆధారపడి ధైర్యంగా వుండడానికి వీల్లేదమ్మా. ఏ పశ్చిమ కోస్తాకో వెళ్ళి వాకబు చేస్తే బాగుండును."

"దానికైనా వ్యవధి ఏదీ ? — రేపు లేదు ఎల్లుండి కుర్రవాడు రానే వస్తున్నాడు. వాడు వచ్చాక, 'నువ్వు, నువ్వు అవునో కాదో మాకు సందేహంగా వుంది. మేము వాకబు చేసేవరకు బయటివేపు గదిలో ఉండు' అని ఎలా చెప్పగలం ? — వాడు నిజంగా నాబిడ్డ భవేనే అయితే ఇక్కడ ఒక్క నిమిషం ఉంటాడా ? వెంటనే మళ్ళీ వెళ్ళిపోడూ ? — వాడి కెంత అభిమానమో నీకుమాత్రం తెలీదూ ? — పోనీ, ఇవాళే నువు బయల్దేరి కలకత్తా వెళ్ళు. వాడ్ని గుర్తుపట్టటానికి గాని, కూడా రావటానికి గాని వీలుంటుంది. వాడి మాటల ధోరణినిబట్టి కొంత నిజం బయటపడక మానదు."

"ఎంతోమంది జనం వుంటారు. అంతమందిలోనూ నేనతన్ని గుర్తుపట్ట గలనా ? — ఉత్తరాన్నిబట్టి చూస్తే అచ్చుమచ్చు మన భవేంద్రబాబే అనిపిస్తుంది. లేకపోతే ఇన్ని పాతసంగతులు ఎలా జ్ఞాపకం వుంటాయి ? వాళ్ళ నాన్నగారు పచ్చ జేబురుమాలు ఉపయోగించేవారని ఎలా చెప్పుకో గలుగుతాడు ? పాపం, పెదబాబు గారు భవేన్‌కోసం ఎంతెలా పరితపించిపోయారో తలుచుకుంటే గుండె చెరువయి పోతుంది. కళ్ళ జబ్బుతో బాధపడుతూ, 'నా కళ్ళ వెలుగే పోయాక నాకీ కళ్ళుండి ఏం ప్రయోజనం ? — అంటూ వాపోయారు" అనిచెప్పి కంటతడి పెట్టుకున్నాడు దివాన్.

రాణి కళ్ళమ్మట జలజల నీళ్ళు రాలాయి.

"ఏమయితే అయింది, దేవుడిమీద భారం వేసి నువ్వు వెళ్ళిరా. దేవు డెప్పుడూ అన్యాయం జరగనివ్వడు. లే — ఇంక ఆలస్యం చెయ్యకు. పెందరాళే భోజనం ముగించుకుని బయల్దేరు" అన్నది రాణి, కళ్ళు తుడుచుకుంటూ.

* * * *

కలకత్తానించి దివాన్ ఇచ్చిన టెలిగ్రాం చూసుకున్న రాణికి ఆనందాశ్రువులు పొంగుకు వచ్చాయి.

ఆవేళ కచేరీకి సెలవు ప్రకటించారు.

ఊళ్ళో జనమంతా పిల్లా జెల్లాతోసహా స్టేషన్‌కి పరుగెత్తారు.

అంతఃపురంలో అంతా ఎంతో ఆనందంగా ఉన్నా రివేళ.

సూర్యాస్తమయ సమయానికి ఊరి పొలిమేరన బాజా భజంత్రీలు వినిపించాయి. మరి కాస్సేపటికల్లా పల్లకీలో దివాన్ వచ్చి దిగాడు. ఆయాసపడుతూ హడావిడిగా అంతఃపురంలోకి వెళ్ళాడు "అమ్మా! — మరేం భయంలేదు. మన భవేన్ వచ్చేస్తున్నాడు. అమ్మవారి గుడిదగ్గర పూజ చేయిస్తున్నాడు. కబురు అందజేద్దామని నేను ముందుగా వచ్చాను."

"కుర్రవాణ్ని ఎలా కలుసుకున్నావసలు?— మన మనుకున్నట్టు మరేం భయపడ నక్కర్లేదుకదా?—"

"ఏం భయంలేదు. మన భవేనే. కాశీరైలు వచ్చేవేళకి నేను హౌరా స్టేషన్‌లో నించుని, అటూ ఇటూ చూస్తున్నాను. వేలకొద్దీ జనం రైల్లోంచి దిగారు. నేను వాళ్ళ ముఖాలకేసి చూస్తూ నించున్నాను. అంతలో — కాషాయవస్త్రాలు ధరించిన ఒక కుర్రవాడు నా పక్కనించి వెళుతూ నా ముఖంకేసి చూశాడు. చూసి, 'మీ దేవూరు?—' అని అడిగాడు. 'జాళులీపాడా' అన్నా. ఆ మాట వింటూనే నా ముఖంకేసి పరీక్షగా చూసి, 'దివాన్ బాబయ్యగారా!—' అన్నాడు. 'ఆఁ!— నువ్వు భవేన్‌వా?—' అంటూ, ఇద్దరం ఒకళ్ళ నొకళ్ళు కౌగిలించుకున్నాం. అతనికీ నాకూ కూడా ఏడుపు అగలేదు పొర్లి పొర్లి వచ్చింది."

రాణి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

మేళ తాళాలు, జనం చేసే కోలాహలం దగ్గిరికి వచ్చేశాయి. దివాన్ బయటికి వచ్చాడు.

పల్లకీ ద్వారందగ్గర ఆగింది. రాఖాల్ దిగాడు.

రాణి అతన్ని అమాంతం హృదయానికి హత్తుకుంది.

అంతఃపురంలో శంఖధ్వనులు మారుమోగాయి.

* * *

"ఈ వచ్చినవాడు నిజంగా భవేంద్రుడే నంటారా?— అహఁ— కాదు; ఎవడో మోసగాడు."

"దివాను ఆవులిస్తే పేగులు లెక్కపెడతాడు. ఆయన కళ్ళలో దుమ్ముకొట్టడం ఎవడితరం?— వచ్చినవ్యక్తి నిజంగా భవేంద్ర బాబే అతను భవేంద్రుడు కాకపోతే హౌరాస్టేషన్లో దివానుని ఎలా గుర్తుపట్ట గలిగా డంటావు?"

"లక్ష మోసాలలో ఇదీ ఒక మోసం. ఆ స్త్రీ, అధికారమూ చేజిక్కించుకోవా లని దొంగఎత్తుతో వచ్చినవాడు ఆమాత్రం ఆనుపానులు తెలుసుకోకుండా వస్తాడటండీ?—"




"మరయితే – పదహారేళ్ళ క్రితం పెదబాబుగారు. పచ్చ జేబురుమా లుపయోగించటం ఎలా తెలుసుకుని వుంటా డంటారూ ?"

"ఎలా గేమిటి ?– ఎక్కడో దివాను మాటల సందర్భంలో ఎవరితోనైనా అని వుంటారు. ఆ మాటలు ఈ మోసగాడికి సమయోచితంగా ఉపయోగపడివుంటాయి. లేకపోతే, పని గట్టుకుని ఉత్తరంలో ఈ మాటలు రాయవలసిన అగత్యం ఏమిటి, చెప్పండి ?" ఇలాంటివి నాలుగు సంగతులు రాస్తే, జనం సులభంగా నమ్మేస్తారు కదా అని ఆలోచన......"

"వచ్చినవ్యక్తి అసలువాడు కానీ నకలువాడుగానీ, అతను ఈ వూరి జమీందారు; లక్షాధికారి అతన్ని నువ్వు వంచకుడు వంచకుడని ప్రచారం చేస్తున్నావే: ఈ మాట గనక ఆ వ్యక్తి చెవిని పడితే నిన్ని వూళ్ళో ఉండనిస్తాడా ?– నువ్వన్నమాట ఆ నోట, ఆనోట పాకి, చివరికి ఎలాగూ జమీందారుకి చేరుతుంది ఒకవేళ అతను నిజంగా వంచకుడే అయితే, పరిస్థితి మరీ విషమిస్తుంది, ఏమనుకున్నావో."

"అలాగా ?–"

మరొకసంగతి –

"పల్లకీలోంచి దిగి, భవేన్‌బాబు కాళ్ళు కడుక్కుంటూ వుండగా – నవుకరు రామా అతనికి దణ్ణంపెట్టి తువాలుపట్టుకు నించున్నాడు. 'రామా' అని భవేన్ పలకరించేసరికి వాడికి కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి. 'చూశావా, రామా !– బాబుగారు గుర్తుపట్టగలరా ?– అని అడిగావు. నువ్వు ఎత్తుకు పెంచినవాడివికదా, నిన్నెలా మరిచిపోతాడు మా బాబు ?–' అన్నదిట పెద్దరాణి. 'రామాకి ఆ గాయపుమచ్చ నా వల్లనే కదమ్మా వచ్చింది' అంటూ చిన్నప్పటి సంఘటన లేవో గుర్తు చేశాట్ట భవేన్."

ఇంకో సంగతి –

"భవేన్‌బాబు ఏదో వ్రతం పట్టాడట. ఆ వ్రతం ఏడేళ్ళు పట్టాలిట. ఇంకా ఆరునెలలుంది. వ్రతం పూర్తి అయ్యేవరకు ఆయన సన్యాసిగానే వుంటాడట. కాషాయ వస్త్రాలే ధరిస్తాడట. చినరాణిని ముట్టనయినా ముట్టడట......

ఇలా, నకలు భవేంద్రుణ్ని గురించి రకరకాలుగా, కథలు కథలుగా చెప్పుకో సాగారు లోకులు.

* * *

"నాయనా !– నా దొక్కమాట వింటావా ?– ఒకసారి కోడల్ని కలుసుకో. అది సాక్షాత్తు లక్ష్మి. దాన్నిచూస్తుంటే నా గుండె చెరువై పోతోంది" అంది పెదరాణి.

"వ్రతం పూర్తయ్యేవరకూ కలుసుకోవడం మంచిదికాదమ్మా."

"పోనీ నాయనా, ఎడంగానే వుంటుంది. ఊరికే మాటాడడంలో దోషం ఏముంది ?– ఏం ?– ఉండు. అమ్మాయిని ఇక్కడికే పిలుచుకువస్తా."

* * * * *

పట్టుచీర గరగర !–

గాజుల గలగల !–

గుమ్మంకేసి చూశాడు రాఖాల్.

సగం మేలిముసుగు ధరించి లోపలికి అడుగుపెట్టింది, ఆ ముద్దుగుమ్మ–అందాల బరిణె – చినరాణి ఇందుమతి ! !–

"రా, రా !" అన్నాడు రాఖాల్.

ముందుకి వచ్చింది ఇందుమతి. మోకరిల్లి నమస్కరించబోయింది.

"ఉహుం, హుం – నమస్కారం చెయ్యకు, నా కింకా అశౌచం వుంది."

"ఉంటే వుందిలెండి" అంటూ నమస్కరించిం దామె.

ఆమె కంఠం విన్నాడు. చెమ్మగిలిన ఆమె కళ్ళకేసి చూశాడు. శరీర మంతటా ఒక్కసారి ఏదో విద్యుత్ ప్రవహించిన ట్లయిం దతనికి.

''కూచో...''అంటూ సోఫా చూపించాడు.

ఆమె కూచుంది.

"ఎలా ఉన్నావు?-"

''బాగానే వున్నా."

కాస్సేపు నిశ్శబ్దం.

"నేను జ్ఞాపకమున్నానా?"

''ఉన్నారు.''

మళ్ళీ నిశ్శబ్దం.

''అంతా విన్నావుగా?-"

"ఆఁ-విన్నాను."

''ఇంకా ఆరు నెలలు నే నిలాగే వుండాలి."

ఆమె మాటాడలేదు

''నువ్వేమీ బాధపడవుకదా?''

"ఎందుకు?"

"..................''

"మిమ్మల్ని రోజూ ఒక్కసారి చూడగలిగితే, అంతే చాలు నాకు.''

మరింక మాటాడ్డాని కేమీ తోచిందికాదు.

గ్రహించిం దామె.

"చాలా అలసిపోయిన ట్లున్నారు. పొద్దుపోయింది. పడుకోండి," అంటూ ఆమె లేచింది.

మెత్తటి పక్కమీద పడుకున్న రాఖాల్‌కు నిద్ర రాలేదు. ఇందుమతి ముఖమే అతనిముందు కళ్ళకు కట్టినట్టుంది!-

* * *

కృత్యాలు ముగించుకుని, రాఖాల్ పూజామందిరానికి వెళ్ళాడు. పీటమీద కూచున్నాడు. పెదరాణీగారు గంధం తీస్తూ అక్కడే కూచుంది. రాఖాల్ ఇరుకున పడ్డాడు. ఉపనయనం అయ్యాక ఏడాదిపాటు నియమంగా సంధ్యావందనంచేసినా, ఇప్పుడు ఒక్క ముక్కయినా జ్ఞాపకంలేదు. ఎప్పుడు నెత్తిన నీళ్ళు చల్లుకోవాలో, ఎప్పుడు ముక్కు మూసుకోవాలోకూడా గుర్తులేదు. రాణీగారి ఎదుట కపట సంధ్యావందనం చేస్తే,

వెంటనే పట్టుబడిపోవచ్చు. అందుకని, వేలికి యజ్ఞోపవీతం చుట్టుకుని నూట ఎనిమిది సార్లు గాయత్రి మాత్రం చేసి, పీటమీదినించి లేచాడు.

"అప్పుడే అయిపోయిందా నాయనా ?–" అని అడిగింది రాణి.

"అయిందమ్మా; మాకు శివగాయత్రి ఒక్కటే ముఖ్యం" అని చెప్పి తప్పించుకున్నాడు.

"అయితే రా. ఫలహారం చేద్దువుగాని. రా నాయనా !"

ఇంతలో నౌకరు వచ్చాడు.

"హుజూర్, తమ దర్శనంకోసం చాలామంది వచ్చారు. దివాన్‌గారు చెప్పి రమ్మన్నారు" అంటూ వార్త అందించాడు.

* * *

నుదురు ఒక్కసారి కొట్టుకుని, తనకోసం వచ్చివున్నవాళ్ళ మధ్యకి వెళ్ళి కూచున్నాడు రాఘాల్. సంభాషణ మెలకువగానే ప్రారంభమయింది. దివాన్ ఒకర్నిద్దరిని పరిచయం చేశాడు. 'భవేన్ జీవిత చరిత్ర'ను మనస్సులో వుంచుకుని జాగ్రత్తగానే మసులుకున్నాడు రాఘాల్. ఊళ్ళో గ్రాంటుస్కూలు హెడ్మాస్టరుకూడా వచ్చాడు. అతనితో కాస్సేపు సంభాషణ సాగించాడు. అరగంటతరవాత వచ్చిన పెద్ద లంతా జారుకున్నాక, రాఘాల్‌కు ప్రాణం కాస్తంత కుదుటపడింది.

* * *

"బాబూ, నేను ముసలివాడి నయిపోయాను. నాన్నగారు పోయాక ఈ రెండేళ్ళ నించీ అన్నీ నేనే చూస్తూవచ్చాను. నావల్ల ఏవేనా పొరపాట్లు జరిగిఉండవచ్చు. కనుక, ఈ రెండేళ్ళ కాయితాలూ నువ్వొకసారి చూసుకుంటే మంచిది" అన్నాడు దివాను.

"మీ కాయితాలు నే చూసేదేమిటి బాబయ్యగారూ ! – అయినా, నా కేం తెలుస్తుంది ? – ఇన్నాళ్ళనుంచీ ఎలా చూస్తూవచ్చారో, అలాగే ఇకముందుకూడా మీరు చూడాల్సిందే" అన్నాడు రాఘాల్.

"బాబూ : – ఒంటిబలం ఎప్పుడూ ఒక్కలా వుంటుందా ? నాకూ అరవై యేళ్ళు దాటాయి; నావల్ల పొరపాట్లు ఏమైనా జరిగిఉండవచ్చు. డబ్బుదగ్గర చిన్నా పెద్దా యేమిటి నాయనా ! డబ్బు పాపిష్టిది. ఒక్కసారి లెక్కలన్నీ నువ్వు స్వయంగా చూసుకున్నావంటే నా మనస్సు నిశ్చింతగా వుంటుంది."

"బాబయ్యగారూ ! – ఈ కాగితాలు, వ్యవహారాల విషయంలో నేను మీ రను కున్నంత పండితుణ్ని కాను. పొరపాట్లు ప్రతివాళ్ళకీ వస్తాయి. మీకు తెలియకుండా




ఏవయినా పొరపాట్లు జరిగాయే అనుకోండి; ఎప్పటికైనా అవి మీ కంటబడక మానవు. మీరన్నట్టు, డబ్బు మంచి దికాదు. కాని, మిమ్మల్నందర్నీ వదిలిపెట్టి ఉండలేకపోయాను. మళ్ళీ ఈ బంగారుసంకెళ్ళు వేసుకొనక తప్పటంలేదు."

"ఇప్పుడు కాకపోతే పోనీ నాయనా: – నాన్నగారి సంవత్సరీకం వెళ్ళాకయినా సరే, నీ యిష్టం. మనం మొట్టమొదట కలెక్టరుకు రాసి పేరు మార్పించాలి. జడ్జిగారి దగ్గరనుంచి సర్టిఫికెట్టు తెప్పించితేగాని బ్యాంకులో ఉన్నమొత్తం నీపేర ట్రాన్సఫరుకాదు. కంపెనీ బాండులమీద నాన్నగారి సంతకాలున్నాయి కాబట్టి ఫరవాలేదు."

"బెంగాల్ బ్యాంకులో ఎంత వుంది, బాబయ్యగారూ ?"

"ఏభైవేల పైచిలుకు."

"కంపెనీ బాండులూ ?"

"సుమారు ఆరులక్షలు."

లోపల్లోపల లొట్టలువేస్తున్న రాఘాల్ పైకిమాత్రం ఇలా అన్నాడు: "బాబయ్యగారూ: – నేను మళ్ళీ గృహస్థాశ్రమంలోకి వచ్చినా, ఆస్తిపాస్తులూ, వ్యవహారాలూ అంటే నా కేమంత ఆసక్తిలేదు. నా కాలాన్ని తీర్థయాత్రలు, పూజాపునస్కారాలు, శాస్త్రపఠనంలో గడపాలని నా వుద్దేశం."

"అదేమిటి నాయనా! – నువ్వు అలా అంటే ఎలా? నేను ముసలితొక్కునయ్యాను. నాన్నగారున్నట్టయితే, ఇవన్నీ నీకు అప్పజెప్పి, ఈపాటికే మే మిద్దరం కాశీయాత్రకు పోయేవాళ్ళం. నీకూ నా వయస్సు వచ్చాక నువ్వూ అలాగే చేద్దువుగాని. ప్రస్తుతం సంసారధర్మం నిర్వహించు. దేవుడి దయవల్ల నలుగురు పిల్లలు పుట్టాక, వాళ్ళు చేతికందివచ్చాక, నువ్వు పారమార్థిక చింతలో పడుదువుగాని"

దివాన్ ఈ మాట అనేసరికి రాఖాల్‌కు ఇందుమతి గుర్తుకువచ్చింది. గతరాత్రి సంఘటన మనస్సులో మెదిలింది. మళ్ళీ మరొకసారి ఆ దివ్యసుందరమూర్తిని దర్శించాలని ఆసక్తి కలిగింది.

* * *

భోజన మయ్యాక తాంబూలం వేసుకుంటూ రాఖాల్ దివాన్‌తో తన గదిలోకి వెళ్ళాడు. దివాన్ జమీందారీ వ్యవహారాలు ముచ్చటిస్తున్నాడు.

"ట్రాన్స్‌ఫర్ దరఖాస్తు పెట్టాక, ఒకసారి కృష్ణనగర్ వెళ్ళి కలెక్టర్ను కలుసుకోవటం ముఖ్యం."

"ఏ బట్టలతో వెళ్ళను?–"

"కాషాయిగుడ్డలతో వెళితే ఎలాగో వుంటుంది."

"మఠంలో వుండగా ఓ సారి గవర్నర్ని ఈ దుస్తులతోనే కలుసుకున్నాను."

"అయితే కలకత్తాలో పురమాయించు."

"అలాగే – నే నెలాగూ ఒకసారి కలకత్తా వెళదామనుకుంటున్నా. ఒక మోటారు కారుకూడా కొనుక్కోవాలి. చేతిలో నగదు ఏమాత్రం వుంది?–"

"మోటారా! – చాలా ఖరీదు వుంటుందే?–"

"అహఁ – పెద్దఖరీదు ఏమీ పెట్టను. ఏ డెనిమిది వేలకంటె ఎక్కువ కానివ్వను."

"అయితే కాషియర్ దగ్గర వుంటుంది. నువ్వెప్పుడు బయల్దేరుతావో చెప్పు. అప్పటికి చేతిలో పనులు పూర్తిచేసుకుంటా."

"ఎప్పుడు వెళతానో ఇంకా నిర్ణయించుకోలే. వెళితే రేపే వెళతానేమో!"

"రేపే అయితే నా కేంటే ఇబ్బందివుండదు. నా పనులు తిరిగివచ్చాక చూసుకుంటా; ఓ వారంరోజుల్లో తిరిగిరావచ్చుగా?"

"ఏమో – పది పదిహేను రోజులు కావచ్చు. అయినా, నాయనగారి అబ్దీకం వస్తూంది; కావలిసినవి సమకూర్చుకోవాలి గదా. మీ రిక్కడ లేకపోతే ఎలా?–"

కూడా తను వెళ్ళడం అతనికి ఇష్టంలేదని గ్రహించాడు దివాన్. అయితే, 'బాబుని కొన్నాళ్ళవరకూ ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళనీయవద్దు. కూడా నువు వెళ్ళు' అని చెప్పిన రాణిగారి మాటలు దివాన్‌ను హెచ్చరించాయి.

"అవును. అన్నట్టు నాన్నగారి ఆబ్దీకం కదూ ? బాగా జ్ఞాపకం చేశావు. ఆబ్దీకం నాటికి సరకూ సప్పరా సమకూర్చుకుని, వంట బ్రాహ్మణ్ణి పురమాయించుకో వద్దూ ? —"

"ఏం ? మనవూళ్ళో వంటబ్రాహ్మ లెవరూ దొరకరూ ?"

"అవి పూర్వకాలపు రోజులు నాయనా. ఈనాడు ఆమాత్రం సాయంచేసేవా రెవ రున్నారు ? — 'నా చేతిమీదుగా నలుగురికీ వండి వడ్డించటం నా అదృష్టం' అని ఒకప్పుడు నడుం బిగించిన ధర్మాత్ములు ఈనాడు 'ఏం ? — నే నేం వంటబ్రాహ్మ ణ్ణనుకున్నావా ?' అంటూ జారుకుంటున్నారు."

ఈ దివాను తనవెంట రాకుండా వదిలిపెట్టడని గ్రహించాడు రాఖాల్. 'ఈ పాటికి ఇందుమతి భోజనం చేసి వుంటుంది. ఈ దివాను ఇక్కడినించి విరగ డయితే బాగుండును,' అనుకుని, ఆవలించి ఒక్క చిటిక వేశాడు.

దివాను ఇది గ్రహించి, "మరి నే వస్తా" అంటూ లేచాడు. రామాన్ని పిలిచి, బాబుకి పక్క వేయమని పురమాయించాడు.

*   *   *   *   *

జరీఅంచు తెల్లచీర :

పొట్టిచేతుల జాకెట్టు :

కాళ్ళని పాంజేబుగొలుసులు :

చేతుల్ని నాలుగుజతల గాజులు :

ఇందుమతీదేవి ప్రత్యక్షమయింది.

"ఎక్కడికి వెళ్ళావ్ ?" అడిగాడు రాఖాల్.

"ఎక్కడికీ వెళ్ళలేదే ?"

"అహా( — ఇంత సేపూ ఎక్క డున్నావు ?"

"పూజామందిరంలో."

"నిలబడ్డావేం, కూచో."

ఆమె సిగ్గుపడుతూ, తెరచివున్న గుమ్మంకేసి చూసింది.

పరదా లాగి వచ్చాడు రాఖాల్. ఇద్దరూ కూచున్నారు.

కలకత్తా వెళుతున్నారటగా ?"

"అవును. వెళదా మనుకుంటున్నా."

"ఇప్పుడేం తొందర ?"

"పను లున్నాయిగా ?"

"అత్తగారు ఏడుస్తున్నారు" అంటూ, ఇందుమతి నీళ్ళు నిండిన కళ్లతో తలెత్తి చూసింది.

"ఏం, ఎందుకూ ?"

"మీ రెందు కిప్పుడు వెళ్ళటం, చెప్పండి. దివాన్‌గా రున్నారుగా ? మీ కేం కావాలో రాసిస్తే, ఆయన కొనుక్కొస్తారుగా ?"

"గుడ్డలూ అవీ కుట్టించుకోవాలి. స్వయంగా వెళ్ళకపోతే ఎలా ?"

"గుడ్డలు కుట్టించుకుందికి మీరు వెళ్ళాలా ? — గుడ్డల నమూనాలు తీసుకువస్తారు పెద్ద షాపులోంచి. టైలరును పిలుచుకు వస్తారు. మీకు నచ్చిన గుడ్డలు తీసుకోండి; కొలత లివ్వండి. ఏమంటారు ?"

"సరే. అమ్మా, నువ్వా ఏడుస్తూంటే ఎందుకు ? నే వెళ్ళను. నువ్వా, అమ్మా భోంచేశారా ? ఇంద — తాంబూలం వేసుకో." అంటూ తమలపాకుల పొందాను ఇందుమతివైపు జరిపాడు.

"లేదు, ఇంకా భోజనం కాలేదు. మీరు కలకత్తా వెళుతున్నా రని దివాన్‌గారు చెప్పారు. ఆమాట విని ఆవిడ ఏడుస్తూకూచున్నారు."

"నిన్ను అమ్మే పంపించిం దనుకుంటా ! లేకపోతే ఇప్పుడు వచ్చేదానివా ?" అంటూ రాఖాల్ పరిహాసమాడాడు.

సిగ్గుతో, చిరునవ్వుతో ఇందుమతి అవునన్నట్లు తల ఆడించింది.

"అమ్మగారూ ! — బాబుగారి పక్క ఏ గదిలో వెయ్యమంటారూ ? —" అని అడుగుతున్న రామా గొంతు వినిపించింది.

ఇందుమతి రాఖాల్ పక్క ఏర్పాటు చూసింది.

"మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావ్ ? —" అడిగాడు రాఖాల్.

"ఎందుకూ ! — మీరు నన్ను వదిలిపెట్టి కలకత్తా వెళుతున్నారుగా ?"

"రెండు రోజులపాటు వెళ్ళివద్దా మనుకున్నా, అంతేగా ? — నువ్వెళ్ళి భోంచెయ్యి. ఎండ కాస్త తగ్గాక ఇద్దరం అలా తోటలోకి వెళ్ళి తిరుగుదాం."

"ఇద్దరం కలిశా ? ఛీ ! —" ఇందుమతి ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

"నువ్వు రాకపోతే నే నొక్కణ్ణీ వెళ్ళి ఏం చెయ్యనూ ? —"

"నే ముందుగా అక్కడికి వెళ్ళి వుంటా, మీరు రండి."

"తప్పకుండా."

"ఆఁ — తప్పకుండా ?"

''మరిచిపోవుకదా ?''

"మీరూ మరిచిపోకండి," అంటూ నవ్వుతూ వెళ్ళిపోయింది ఇందు.

* * * *

ఇందుమతీదేవి తోటలోకి వచ్చింది కాని, మరీ సిగ్గుపడసాగింది. ఎవరేనా చూస్తారేమో, అటువేపు వస్తారేమో నని ఊరికే కంగారుపడిపోయింది. ఆ కంగారుతో, భయంతో ఆమె తోటలో రాఖాల్ దగ్గర ఎక్కువసేపు ఉండలేకపోయింది.

ఇందుమతి వెళ్లిపోయాక రాఖాల్ ఉద్యానంలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

* * * *

గంగ ఒడున స్నానం చేస్తూ సురబాల, కనకలత మాటాడుకుంటున్నారు:

"చినరాణీగారికి చాలా సంతోషంగా ఉందికదూ?" అడిగింది సురబాల

"ఏం సంతోషం లెద్దూ. ఇలాంటి సంతోషం ఓ సంతోషమా యేమిటి? అయినా, బాబుగారి కిదేంబుద్ధి? ఇంకా ఆర్నెల్లు వ్రత మున్నప్పుడు, ఆర్నెల్లూ పోయాకనే రాకూడదూ? ఇది చాలా అన్యాయం."

"అన్యాయం ఏమిటీ? ఇంకా ఆర్నెల్లయితే, ఆ ముసలావిడకూడా ఉంటుందో, ఉండదో. కొడుకును చూసుకునే యోగం ఆమెకి దక్కకపోయేది."

"ముసలావిడ సంగతికాదు నే నన్నది చినరాణి సంగతి."

"చినరాణికి మాత్రం ఏం?—ఈ ఆర్నెల్లూ భర్తని చూడగలగటం, భర్తసేవ చేయగలగటం అదృష్టంకాదూ?"

"సర్లెద్దూ, పెద్ద ముత్తయిదువలా మాటాడకు. ఇంతకీ, ఆ వచ్చినవాడు భవేంద్రుడు కాక మరెవరైనా అయితే?"— అన్నది కనకలత.

"ఛా ఛా, అలాంటి మాట లనకు. ఆయన భవేంద్రబాబు కాకపోతే, ఇంట్లోవాళ్ళకి తెలియదా? తెలిస్తే ఊరుకుంటారా?''

''అబ్బో!—ఇలాంటి నాటకాలు ఎన్నో చూశాం మేము. ఒకసారి కమలా థియేటర్‌లో అచ్చుమచ్చు ఇలాంటిదే ఒక నాటకం చూశాను. అయితే నాటకంలోని ఆ మోసగాడికంటే వాస్తవంగా కనబడుతున్న ఈ మోసగాడే ఎక్కువ తెలివయిన వాడు."

"ఛీ, అలాంటి మాట లనకు. మన చినరాణి మహాపతివ్రత. ఆమెను భగవంతు డెపుడూ అన్యాయం చేయడు."

ఒళ్ళు తుడుచుకున్నారు; పొడిబట్టలు కట్టుకున్నారు. ముందు సురబాల, వెనకాల కనకలత మెల్లిగా మాటాడుకుంటూ, అంతఃపురంవేపు నడిచివెళుతున్నారు. కొంత

దూరం వచ్చాక చెట్లగుబురు దాటగానే సురబాల అట్టె నిలబడిపోయింది. ఆశ్చర్యపోయింది. ఏమిటా అని కనకలత ముందుకు వచ్చి చూసింది.

రాఖాల్ :—

సురబాల ముఖం వెలవెలబోయింది. ఆమె కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి.

సురబాల పరిస్థితి చూచి కనకలత "బాబుగారు—!" అంది.

"బాబుగారా : — ఏ బాబుగారు ?"

"భవేంద్రబాబుగారు : — కాదు. కాదు. భవేంద్రబాబు రూపంలో వచ్చిన బాబుగారు," అంటూ, సురబాల ముఖంలోకి తీక్షణంగా చూసింది కనకలత.

"భవేంద్రబాబు రూపంలో వచ్చినవారా ? అదేమిటీ !"

"ఏమో : — నా కేం తెలుస్తుంది ? నీకు తెలియాలి. ఆయనకు తెలియాలి. ఇంకా ఎన్నో శ్శిక్కడ నించుండిపోతావ్ ? పద, పద."

"ఏమిటి నువ్వంటున్నది నా కేం బోధపడటంలేదు" అంటూ కలలోనించి తేరుకున్నట్టు సురబాల తెలివిలోపడ్డది. కనకలత వెంట అంతఃపురానికి దారితీసింది.

*　　*　　*　　*

తోటలో సంఘటన కనకలతలో ఎన్నెన్నో ఆలోచనలు కలిగించింది. ఈ సురబాల ఎవరు ? ఈ మాయాభవేంద్రు డెవరు ? వీళ్ళిద్దరికీ ఏమిటి సంబంధం ? ఇద్దరి మధ్యనీ ఏదో పూర్వపరిచయం ఉన్నమాట మాత్రం నిశ్చయం. అందు కేమీ సందేహం లేదు — ఇలా సతమత మవుతూవుంది కనకలత.

రాత్రి తొమ్మిది.

రాఖాల్ భోజనానికి కూచున్నాడు. ఎదురుగా పెద్దలైటు వెలుగుతోంది. పక్క నున్న చీకటిగదిలోంచి అతన్నే కన్నార్పకుండా చూస్తూవుంది.

ఎవరు ? —

సురబాల !

ఇది కనకలత కళ్ళ బడింది. గబగబా వచ్చి, వెనకనించి సురబాల కళ్ళు మూసింది.

"కనకలత అక్క :"

"ఎవరే అక్క ? నీకంటె నే పెద్దదాన్నా యేం ? — అక్కా అని పిలుస్తావేం ?

"తియ్, తియ్. కళ్ళమీద చేతులు తియ్ : :—"

"పోవే ! — కళ్ళమీద చేతులు తియ్యాలేం ? పెద్దమనిషి భోంచేస్తూవుంటే, ఎందుకే అలా చూస్తావ్ ? ఆయనకి తిన్న దేమయినా ఒంటబట్టాలా ?"




''ముందు చేతులు తియ్యవే.''

"చూడవే, చూడు, కరువుతీరా చూడు; అయినా, ఎక్కడయిందే ఈ పరిచయం ?"

"పరిచయమా !"

"ఆఁ — ఆఁ — అదే — స్నేహం..."

"ఎవరు చెప్పారే నీకు ?"

"ఎవ రేమిటి, ఆయనే చెప్పారు."

"ఎవరితో ?"

"చినరాణిగారితో,"

"ఏమని చెప్పారు ?''

"నిన్ను ఒకప్పుడు వా రెరుగుదు రని."

"ఎన్నడూ అలా చెప్పిఉండరు."

"అయితే అసలు సంగతేమిటో నువ్వే చెప్పు."

సురబాల గబగబా తన గదిలోకి పోయింది. తలగడలో తల దూర్చి, ఏడుస్తూ పడుకుంది.

కనకలతగదిలో దీపంమాత్రం రాత్రి ఒంటిగంటదాకా అలా వెలుగుతూనేవుంది.

ఉత్తరం చదివి ముగిస్తూనే ఖగేంద్రుడు గడియారంకేసి చూశాడు. మూడు గంటలయింది. వెంటనే లేచాడు. అలమర తెరిచాడు. చిరిగిపోయిన చొక్కా, అంచులేని పాతధోవతీ, మాసిపోయిన సిల్కు ఉత్తరీయం ధరించి, మెట్లు దిగాడు. చేతిలో ఒకటోరకం సిల్కు గొడుగు, వెండిపిడి వేసింది ఉంది. నౌకరు ఖుదీరామ్‌ని పిలిచాడు. "నీ గొడుగు తీసుకురా" అన్నాడు

ఖుదీరామ్ తన పాతగొడుగు తెచ్చి ఇచ్చాడు. ఆ గొడుగు తీసుకుని, కొత్త గొడుగు ఖుదీరామ్ కిచ్చి, "నీ గొడుగు నే వేసుకు వెళుతున్నాను. దీన్ని తీసుకువెళ్ళి పైన పెట్టు" అని ఖగేంద్రుడు గబగబ వెళ్ళిపోయాడు

"ఆఁ—!" అంటూ ఆశ్చర్యపోయాడు ఖుదీరామ్, ఖగేంద్రుడి ఈ వేషం, తీరూ చూసి. 'ఖగేన్‌బాబు ఇవాళ ఇన్కమ్‌టాక్సు ఆఫీసుకి వెళుతున్నారులా వుంది' అని, తనలో తనే నవ్వుకున్నాడు.

ఖగేంద్రుడు మెయిన్‌రోడ్డులోకి వచ్చాడు. ధరమ్‌తలా పోయే ట్రాం వచ్చింది. జేబులో డబ్బుంది. అయినా ట్రామ్ ఎక్కలేదు. ఎండలో గొడుగు వేసుకుని, నడిచే వెళ్ళాడు.

అది అరవై అయిదు నంబరు మానిక్‌తలా వీధి. అక్కడ ఒక ఒరియా నౌకరు కనబడ్డాడు. ఆ నౌకరుని మంచి చేసుకుని లోపలికి ప్రవేశించాడు ఖగేన్. అయితే దివాన్ నిద్రలో వున్నాడు

ఖగేన్ తొందరపడలేదు తీరికగా కూచుని, దీక్షగా ఆలోచించసాగాడు :

"ఎవ రీ మాయాభవేంద్రుడు ? —

ఎవరీ సురబాల ? —

ఈ చిక్కుసమస్య నెలా భేదించటం ? —

ఇందుమతిని పెళ్ళిచేసుకోవటం ఎలాగూ పడలేదు,

పోనీ —

ఈ మాయాభవేంద్రు డెవరో, వీడి అంతు కనుక్కుంటాను. కనుక్కునితీరతా..."

ఇంతలో దివాను తన స్థూలకాయాన్ని మోయలేక మోయలేక మోసుకుంటూ వచ్చాడు.

ఖగేంద్రుడు లేచి నమస్కారం చేసి, "నేను జ్ఞాపకం వున్నానా ? —" అన్నాడు.

"ఎవరూ, ఖగేంద్రబాబా ! — కూచో, కూచో" అని కూచోబెట్టాడు దివాన్.

కుశల ప్రశ్నలతో కాస్సేపు గడిచింది. ఖగేంద్రుడు తన పేదరికాన్ని రకరకాల వర్ణించి చెప్పాడు :

"ఇంతకాలమూ , నా చెల్లెలు మీ ఆశ్రయంలో ఉండటంవల్ల నిశ్చింతగా వున్నాను. బాబుగారు తిరిగి వచ్చారాయె. ఇప్పుడు చినరాణిగారికి మా చెల్లెలి అవసరం ఏముంటుంది ? — చెల్లెలు ఇక్కడికి వచ్చేసిం దంటే నేను మెస్ వదిలి, ఇల్లు అద్దెకు తీసుకోవాలి. నాకు వచ్చే యాభై రూపాయల్లో ఇల్లు గడపటం కష్ట మవుతుంది..."

"సరే, ఆ విషయమై నువ్వు బెంగ పెట్టుకోకు. నేను చినరాణిని అడుగుతాను. మరో ఏడాదో రెండేళ్ళో కనకలత అక్కడ వుండేలా ఏర్పాటు చేస్తాను. నువు ప్రాక్టీసు పెట్టి, కాస్త సాగటం మొదలెట్టాక, వచ్చి నీ చెల్లెల్ని తీసుకువెళ్ళు."

"బాబుగారు ఇన్నాళ్ళూ కాశీలోనే వున్నారా ? —" అంటూ ధోరణి మార్చాడు ఖగేన్.

"ఊహుఁ — ఇంటికి వచ్చేముందు కొద్దిరోజులుమాత్రం వున్నా రక్కడ."

"అలాగా ! — ఆహా ! — కాశీ చాలా సుందరమైన క్షేత్రం సుమండీ. మా నాన్నగా రుండగా మే మక్కడ ఆర్నెల్లున్నాం. దశాశ్వమేధఘట్టంలోనే మా బస. సాయంత్రం అక్కడ కూచుంటే, మరి లేచిరాబుద్ధి కాదు. బాబుగారు ఎక్కడుండేవా రేమిటి ? —"

"దశాశ్వమేధఘట్టం దగ్గరలోనే, ఒక యాత్రికు లింట్లో."

"ఏ యాత్రికు లింట్లో ? —"

ఈ ప్రశ్న వినగానే ఖగేంద్రుడ్ని శంకాదృష్టితో చూశాడు దివాన్.

"అహఁ — నే నెరిగిన యాత్రికుడు ఒక డున్నాడు రామదాస్ అని..." అంటూ నపిగాడు ఖగేన్.

"ఏమో. నే నా సంగతి బాబుగారి నడగలేదు. ఎందుకు ? — నీ కవసర మేమిటి ? —" అని అడిగాడు, అలా తీక్ష్ణంగా చూస్తూనే.

పరిస్థితి గ్రహించి, ప్రసంగం మార్చాడు ఖగేంద్రుడు.

"మీ రింకా వుంటారుగా ? —"

"ఆఁ — ఇంకా నాలుగైదురోజు లుంటా."

"మీరు ఇక్కడ ఉన్నన్నాళ్ళూ హడావిడిగా వుంటా రనుకుంటా. ఈ పేదవాడి మాటమాత్రం మరిచిపోకండి" అని సెలవు తీసుకు వెళ్ళిపోయాడు.

* * * * *

ఖగేంద్రుడు ఇంటికి వెళ్ళి, రాత్రీ పగలూ తెగ ఆలోచిస్తున్నాడు. ఆలోచన తెగక, బుర్ర బదలుగొట్టుకుంటున్నాడు. ఎలా అయితే నేం, పన్నాడు ఒక వ్యూహం. దొరికింది ఒకదోవ ! —

కాగితం కలం తీసుకున్నాడు. గబగబ ఏదో రాశాడు.

మర్నాడు ఆ ముషాయిద్దా అచ్చుకిచ్చాడు.

ఫొటోగ్రాఫర్ భువన్‌ను కలుసుకున్నాడు.

"భువన్!— నీతో ముఖ్యమైన పనివుండి వచ్చాను. నువ్వొక పల్లెటూరు వెళ్ళి రావాలి. ఒక జమీందారుకి ఫొటో తీసి తీసుకురావాలి. అతని జీవిత విశేషాలుకూడా రాసుకురావాలి.

"ఏమి టిదంతా?— అసలు సంగ తేమిటి?—"

"ఏమిటీ అని నెమ్మదిగా అడుగుతా వేమిటి; దేశం దేశ మంతటా సంచలనం వుడితే. నేను వంగ జమీందారుల చరిత్ర అచ్చువేస్తున్నాను. నీ కింకా తెలియదా?—"

"ఏమేనా అమ్ముడుపోతుందా?"—

"అమ్ముడుపోవటమా! అప్పుడే ఏడెనమిదివందల పుస్తకాలకి ఆర్డర్లు వచ్చాయి."

"ఎలా అయినా— మీ తెలివితేటలే వేరు. ఆఁ— ఇంతకీ, నే నేవూరు వెళ్ళాలి?"

"బాళులీపాడా. ఇవాళరాత్రి రైలుకే బయల్దేరి వెళ్ళాలి. తగిన ప్రతిఫలం ముడుతుంది. మరొకసంగతి — నువు సాధ్యమైనంత త్వరలో ఈ పని ముగించుకురావాలి. మూడునాలుగు రోజులకంటె ఎక్కువ పట్టకూడదు."

"ఏం, ఎందుకని ?—"

"ఆ జమీందారుకి ఓ ముసలి దివానున్నాడు. ఆ దివాను వున్నాడంటే మన పని చెడుతుంది. అతను లేనప్పుడు వెళితే, పాతిక కాపీలకు ఆర్డరు సంపాదించవచ్చు, దీనికి సంబంధించిన నోటీసులు ఒంటిగంటకి తీసుకువచ్చి ఇస్తా.

"మరొక ముఖ్యమైనసంగతి —

పొరబాటు నాయినాసరే, నా పేరుమాత్రం అక్కడ తీసుకురాకేం. జాగర్త. ఇదంతా ఎవరు చేస్తున్నా రని అడిగితే, నీ నోటికివచ్చిన ఏదేనా పేరు చెప్పు.

"ఈ పని పూర్తి చేసుకువస్తే, నీకు రావలసిన ప్రతిఫలం గాక, పైని నిన్ను సంతోషపెడతా. ఇదుగో, ఇది నీ ఖర్చులకు తీసుకో."

* * *

నాలుగోనాటికి భువన్ ఉత్తచేతు లూపుకుంటూ తిరిగివచ్చాడు.

"ఏం జరిగిం దేమిటి ?" అడిగాడు ఖగేన్.

"ఏముంది జరగటానికి ?— మొదటి రెండురోజులూ జమీందారు దర్శనమే కాలేదు. ఎప్పుడు వెళ్ళినా, ఎప్పు డడిగినా అంతఃపురంలో ఉన్నా రనేవాళ్ళు. నిన్న




ఉదయం దర్శనం దొరికింది. నోటీసులు ముందే పంపించాను. కానీ – ఏం లాభం ?– నానామాటలూ అన్నారు.

'ఇదంతా దొంగఎత్తు. దేశంలో పెద్దపెద్ద జమీందా ర్లుండగా నా దగ్గిరికే ఎందుకు వచ్చావ్ ? – వర్ధమాన్‌వారు, కూచ్‌బిహార్‌వారు, నాటోర్, కాశిమ్‌బాజార్, దీఘా పతియా జమీందా ర్లెంద రున్నారు. వాళ్ళదగ్గిరికి వెళ్ళక, మాదగ్గిర కెందుకు వచ్చావ్–" నేను ఫోటో తీయించుకోను, నా జీవితగాథా చెప్పను' అన్నారు."

అంతా విన్నాడు ఖగేంద్రుడు.

"ఆఁ ! –" అన్నాడు, ఏదో నిశ్చయానికి వచ్చినట్టు.

ఆవేళ సాయంత్రమే మళ్ళీ దివాన్‌దగ్గిరికి వెళ్ళాడు. "మా చెల్లెల్ని చూసి చాలా కాల మయింది. నాకూ సెలవు లిచ్చారు. మీరు అనుమతిస్తే, మీ వెంట బాళులీపాడా వస్తాను" అన్నాడు.

"సరే. అయితే; నేను ఎల్లుండి వెళుతున్నాను, వస్తే రా."

* * *

కనకలతని కలుసుకోవాలని ఖగేన్ ఎంతో ఆరాటపడ్డాడు. కాని, ఏర్పాటు చేసే దెవరు ?– జమీందారుని కలుసుకుని దివాను వెంటనే వెళ్ళిపోయాడు. మళ్ళీ పొద్దుటికి గాని రాడు.

రాత్రి పదింటికి అక్కడి సిబ్బందితోపాటు భోజనం చేశాడు. మళ్ళీ డ్రాయింగ్ రూముకి వచ్చి కూచున్నాడు.

ఇంతలో ఒక నవుకరు లాంతరు పుచ్చుకు వచ్చాడు "దొరగా రొస్తున్నారు॥" అంటూ. అక్కడివాళ్ళు గుసగుస లాడుకున్నారు.

రాఖాల్ వరండాలోకి రాగానే ఖగేంద్రుడు లేచినించుని వంగి తలవంచి నమస్కారం చేశాడు.

"ఎవరు మీరు ?–" అడిగాడు రాఖాల్. నౌకరు దీపం కొంచె ఎత్తిపట్టుకున్నాడు.

"నన్ను ఖగేంద్రు డంటారండి."

"ఓఁ ! – దివాన్‌జీతో కలకత్తానించి వచ్చినవారా ?–"

"చిత్తం – మా చెల్లెలు......"

"ఆఁ – నాకు తెలుసు. మీ భోజన మయిందా ?"

"చిత్తం."

"వీరికి పక్కా అదీ వేశారా ?–" రాఖాల్ నౌకర్లను అడిగాడు.

"చిత్తం. దీపాలగది పక్కన మూలగదిలో ఏర్పాటు చేశామండీ. ఇదివరకుకూడా వా రక్కడే పడుకునేవారు.

"ఆఁ – తెలుసు, తెలుసు. మీ కేమీ ఇబ్బందిగా లేదుగా –" అంటూ, సమాధానంకోసమయినా ఎదురు చూడకుండా, పడకగదిలోకి వెళ్ళాడు భవేన్.

ఖగేన్ ఆశ్చర్యపోయాడు :–

"దోమతెర పాతది వేశారేం, ఇంకొకటి లేదూ ? – "

"చిత్తం – రేపు మార్చేస్తాం."

"చెంబుతో మంచినీళ్ళు పెట్టలేదేం ? – వేసవికాలం, రాత్రిపూట దాహం వేస్తే ?– వెళ్ళు – మంచినీళ్ళు పట్టుకొచ్చి పెట్టు – మంచం కాస్త ఇటు జరిపితే, రెండు కిటికీల్లోంచీ గాలి బాగా వేస్తుంది. ఉక్కగా లేదూ ?–"

రాఖాల్ చెప్పినట్టు నవుకర్లు మంచం మార్చారు. మంచినీళ్ళు తెచ్చిపెట్టారు.

"మీ రింక విశ్రమించండి, పొద్దుపోయింది" అంటూ రాఖాల్ అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

రాఖాల్ ప్రవర్తన ఖగేంద్రుడి కెంతో ఆశ్చర్యం కలిగించింది. ఎన్నెన్నో సమస్యలను రేకెత్తించింది.

"నేను పూర్తిగా చెప్పకముందే 'నాకు తెలుసు' అన్నాడు. ఇంతపెద్ద లోగిలిలో నిత్యమూ ఎంతోమంది వస్తూ పోతూ వుంటారు. ఎవ రేగదిలో బసచేసిందీ గుర్తు

పెట్టుకోవటం వింతగానే వుంది. నన్నేం అనుమానించలేదుగద ?— నా ప్రాణాల కేం ముప్పు లేదుకదా ?—

తెరిచివున్న రెండు కిటికీలకేసి చూశాడు ఖగేన్. అతని కేదో భయం పట్టుకుంది.

"..........నిద్దట్లో వుండగా, నన్ను ఎవరిచేత నయినా హత్య చేయించరు కదా ! ఆ ఫొటోగ్రాఫర్ నన్ను గురించి ఇక్కడేమీ ఊదలేదుకదా ! — జమీందారుని గురించి గుచ్చి గుచ్చి అడిగానని దివాన్‌గాని ఏమీ హెచ్చరించలేదు కద. ఏమో ? నన్ను హత్యచేయట్టాని కేమేనా చాటుమాటున ఏర్పాట్లు చేశారేమో ! — లేకపోతే, నా గదిలోకి వచ్చి ఎందుకు చూస్తాడు?— నామంచం అదీ ఎందుకు జరిపిస్తాడు?— నేను తెలుసునని కూడా అన్నాడే ! — కిటికీ పక్కగా వుంటే, కర్రతో ఓపెట్టు పెట్టడానికి వీలుంటుందనే, మంచం ఇలా ఏర్పాటు చేయించివుంటాడు..."

"...ఇప్పు దేం చెయ్యను ?— తలుపులు తెరుచుకు బయటికి పారిపోనా ?— నాచుట్టూ పహరా పెట్టించాడేమో !—"

ఈ భయంతో ఖగేంద్రుడు వెంటనే లేచి, కిటికీతలుపులు వేసేశాడు. తలుపులు గట్టిగా పడ్డాయో లేదో అని మరోసారి చూసి, మళ్ళీ వచ్చి పడుకున్నాడు. కాని నిద్రపట్టలే.

ఒకటి — రెండు — మూడయింది ! —

కాస్సేపు కునుకు పట్టిం దప్పుడు,

ఏదో కల ! — పీడకల ! —

ఉలిక్కిపడి లేచి కూచున్నాడు ! —

* * * *

"ఎలా అయినా నువ్వు ఆ సురబాల సంగతి కూపీ లాగావంటే...?"

"మీ పని నెరవేరుతుంది. అంతేనా ?" అంటూ, ఖగేన్ మాట పూర్తిచేసింది కనకలత.

"అవును, కుట్రదార్లు ఇద్దరిలో ఒకళ్ళసంగతి కనుక్కుంటే చాలు, రెండోవాళ్ళ సంగతి ఇట్టె బయటపడుతుంది."

"అయితే మీకు నేను సహాయపడగలను. సురబాల పుట్టి ల్లెక్కడో నాకు తెలుసు."

"ఏవూ రేవూరు ? — ఎక్కడ ? —"

"వసంతపూరు"

"ఎలా తెలుసుకున్నావ్ ?"

"ఒకనాడు మాటమీద మాట వచ్చి, 'మా వసంతపూర్‌లో...నా చిన్నప్పుడు...' అంటూ చెప్పబోయి, నాలి క్కొరుచుకుంది."

"వసంతపూరు ఆమె పుట్టిల్లో అత్తిల్లో ఎలా చెప్పగలవ్ ?"

"చిన్నప్పుడు – అందిగా !–"

"ఆఁ – అవును. పుట్టిల్లే అయివుండవచ్చు. ఒకవేళ అత్తవారి ల్లయినా ఫరవా లేదు. వసంతపూర్ అంటే – ఎక్కడి వసంతపూరో చెప్పగలవ్ ?–"

"దాని మాటా తీరూ చూస్తే వర్ధమాన్ జిల్లా మనిషిలా వుంది. మాట సాగదీసి మాటాడుతుంది."

"సరే, నే నివాళే వెళ్తాను."

"ఒకసంగతి – దాని అసలుపేరు సురబాల అయివుండదేమో...?"

"ఆసంగతి నాకు చెప్పాలా ? – అవునుగాని. ఆమె గంగలో కొట్టుకు వచ్చినప్పుడు కట్టుకున్నచీర ఎక్కడుంది ?–"

"ఉంది. ఏం ? – ఎందుకూ ?"

"ఒకసారి చూపించు."

చీర జాగర్తగా చూశాడు ఖగేంద్రుడు. జేబులోంచి కత్తెర తీశాడు. దానిమీద వున్న చాకలిగుర్తు కత్తిరించి జేబులో వేసుకున్నాడు.

"ఇక నే వెళతాను. ఈ మాయాభవేంద్రుడి గుట్టుమట్లు బయటికి లాగకపోతే నా పేరు ఖగేంద్రుడేకాదు; వస్తా."

* * * *

బాళులీపాడానుంచి కలకత్తా చేరుకున్న ఖగేంద్రుడు అవసరమైన దర్యాప్తులు చేశాడు. వర్ధమాన్ జిల్లాలో వసంతపూరులో వాలాడు. టపాబండిలో ఊళ్ళోకి చేరుకున్నాడు.' బండి దిగుతూనే, తన పుస్తకప్రచారం ప్రారంభించాడు. బండి పోస్టాఫీసు ముందు ఆగింది. ఖగేంద్రుడు పోష్టుమాష్టరికీ, ఆయన పక్కనున్న ముఖర్జీకీ వెరొక కరపత్రం ఇచ్చాడు. ఎవరిచేతా చెప్పించుకోకుండానే అక్కడున్న స్టూల్ బల్లమీద కూచున్నాడు.

ముఖర్జీ కరపత్రం చదివి, "మీ పుస్తకం పాడ్యమినాడా వెలువడుతుంది?–మీరేమీ అనుకోకండి, ఒకమాట చెబుతాను ! నెలలో మొదటిరోజు మంచిదికాదు. అగస్త్యుడు వెళ్ళిపోయినరోజు......"

"చిత్తం. అందుకనే, ఆ రోజున వెలువరిచటం," అన్నాడు ఖగేంద్రుడు నవ్వుతూ.




"అదేమిటి ?" అన్నాడు ముఖర్జీ ఆశ్చర్యంగా.

"వెళ్ళిపోయిన అగస్త్యుడు మళ్ళీ తిరిగిరాలేదు, అవునా ?— అలాగే, నా పుస్తకాలు కూడా దేశంలోకి నలుమూలలా వెళ్ళాలనీ, బాగా అమ్ముడు పోవాలనీ, ఆరోజున వెలుపరిస్తున్నా." అన్నాడు ఖగేంద్రుడు వినయంగా.

చిత్రమైన అతనిధోరణి చూసి, ముఖర్జీ ముచ్చటపడ్డాడు. "అయితే, మీ రిక్కడ ఏమిటి సేకరిస్తారు ?"

"ఈ పూరి రాయ్ జమీందార్ల వంశచరిత్ర సేకరించాలి. ఎప్పుడు వెళ్ళితే వారి దర్శనం లభిస్తుంది ?"

"పొద్దున్న ఎనిమిది, తొమ్మిదింటికి వెళ్ళితే, వారిని కచేరీలో చూడవచ్చు. మీ రీవూళ్ళో ఎన్నాళ్ళుంటారు ?"

"ఆ — నాలుగు రోజులైనా ఉండాలి. ఇక్కడ ఇల్లేదైనా అద్దెకి దొరుకుతుందా?"

"అద్దెకు ఇళ్ళు దొరకటానికి ఇది కలకత్తా కాదుగా ?—" పోస్టులో 'వంగవాసి' పత్రిక రాకపోవటంతో, ముఖర్జీ ముఖం ఇంతైపోయింది.

ఖగేంద్రుడు తను కూడా తెచ్చుకున్న పత్రిక లన్నీ బయటపెట్టాడు. ఆ పత్రికలు చూచేసరికి ముఖర్జీకి ఎక్కడలేని సంతోషమూ వచ్చింది. "వీటిని ఇంటికి తీసుకెళ్ళి చదివి, మీ కిచ్చేస్తాను. మీ రెక్కడుంటారు?"

"అదె ఇంకా తేలలే. అద్దెకు ఇల్లుకూడా దొరక దన్నారుగా? ఎక్కడ ఉండటమూ అని ఆలోచిస్తున్నా."

ముఖర్జీ లేచి, "చాలు, చాలు నీవంటివాణ్ని మా ఇంటికే తీసుకెళ్ళివుందును. కాని, ఇంటికి చుట్టా లొచ్చారు. నీకూ ఇబ్బందిగా వుంటుంది. మరొక ఏర్పాటు ఏదైనా చేస్తాను రా. ఆ చెట్లచాటున కనబడేదే మా బడి స్కూల్లో ఒకగది ఇప్పిస్తాను. మాతో పాటే నాలుగు మెతుకులు తిందువుగాని," అంటూ ఖగేంద్రుణ్ని కూడా తీసుకుపోయాడు ముఖర్జీ.

'మీవల్ల మరొక ఉపకారం కావాలి. నా గుడ్డలు బొత్తిగా మాసిపోయాయి. ఇక్కడెవరైనా చాకలి దొరుకుతాడా?"

"ఆఁ, ఆఁ - మీ కలకత్తా చాకళ్ళలా ఉతకలేకపోయినా, ఏదో, బాగానే ఉతుకుతాడు మా చాకలి వాడిపేరు నీలమణి. ఇంటికి వెళ్ళి వాడికి కబురెడతాను" అంటూ ముఖర్జీ వెళ్ళిపోయాడు.

ఖగేంద్రుడు టీ పెట్టుకునే ప్రయత్నంలో వున్నాడు.

*   *   *   *   *

జమీందారుగారి తమ్ముడు నవీనచంద్రుడు గత మాఘంనించీ కనబడటంలేదు.

కృష్ణదాసుఘోషాల్ కూతురు లీలావతి పత్తా తెలియటంలేదు

వీళ్ళిద్దరూ మాయమైన రోజుకి క్రితంరాత్రి సైరభి అనే దాసి నవీనబాబుతో కలిసి గాజన్ తలా సంతవీధిదగ్గర కనిపించింది.

—ఇవీ, ఖగేంద్రుడు కొత్తగా వసంతపూర్ లో తెలుసుకున్న విషయాలు.

'అఁ!- దొరికింది కిటుకు. గంగలో కొట్టుకువచ్చిన సురబాల లీలావతి తప్ప మరెవరూ కాదు ఇదిమాత్రం నిశ్చయం అయితే - నవీనచంద్రుడే భవేంద్రుడా?- అన్న విషయంమటుకు ఇంకా నిశ్చయంగా చెప్పలేం.

'చాకలి నీలమణిని ఆరా తీయాలి. సైరభిని కలుసుకుని కూపీ లాగాలి...' అనుకున్నాడు ఖగేంద్రుడు.

నాలుగోరోజున మధ్యాహ్నం పోస్టాఫీసుకి వెళ్ళాడు.

అక్కడ గాజన్‌తలా ఠాణా సబిన్స్పెక్టరు తారసపడ్డాడు.

ఖగేన్ కి ఇన్ స్పెక్టరుతో పరిచయమై, స్నేహం కలిసింది.

ఖగేంద్రుడు కరపత్ర మొకటి ఇన్‌స్పెక్టరు కిచ్చాడు. అది చూచి ఇన్‌స్పెక్టరు ఏవేవో ప్రశ్న లడిగాడు

"మీకు అభ్యంతరం లేకపోతే, నాకు కాసిని నోటీసు లివ్వండి. గాజన్‌తలాలో జనం ఎక్కువగా వచ్చే చోటలో వేలాడగట్టిస్తాను," అంటూ, ఇన్‌స్పెక్టరు లేచాడు.

ఖగేంద్రుడు ధన్యవాదాలు తెల్పి, కొన్ని కరపత్రా లతని కిచ్చాడు.

*　　*　　*　　*　　*

"మీ పేరేనా ఖగేంద్రబాబు?—" అడిగాడు జమీందారు శారదాబాబు.

"చిత్తం."

"మీ కరపత్రం చదివాను. మీరు వంగ జమీందారుల చరితమాల ప్రకటిస్తున్నారు టమా?"

"చిత్తం."

"చరితమాల—మాల—మాల—మాల వేటితో తయారు చేస్తారు ఖగేంద్ర బాబూ?"

"పూలతోను, ముత్యాలతోను......"

"అంటే, మాల మంచిమంచి పూలతోనే తయారు చేస్తారన్నమాట లేదా, అంద మయిన వస్తువులతో తయారుచేస్తారు. అంతేకాని పిడకలు, పాతచెప్పులు దండ గుచ్చితే మాల అవుతుందా?— ఈ వంగ జమీందారుల చరిత్రలు మాల గుచ్చవలసినంత గొప్పవని మీ రనుకుంటున్నారా?—"

"ప్రభువులు సరిగ్గా సెలవిచ్చారు సుందరమైనవి పవిత్రమైనవి మాత్రమే మాల గుచ్చుతారు అయితే చేతికి అందిన వన్నీ మాల గుచ్చరు మంచివాటిని ఏరి మరీటే గుచ్చుతారు పూలలో ఎన్నెన్నో రకా లున్నా — మల్లి, మొల్ల, గులాబి — పువ్వులు మాత్రమే దండ గుచ్చుతారు అలాగే — నేను మంచివాటితో మాత్రమే ఈ మాల తయారు చేద్దామనుకుంటున్నాను తమరు ఎక్కడో ఈ మూల పల్లెటూళ్ళో ఉన్నా, తమ పేరుప్రఖ్యాతులు కలకత్తాలోనే విన్నా పువ్వులు సువాసనలను దాచుకో లేనట్టు, ప్రభువులు ఔదార్య మనే పరిమళాన్ని ఎలా దాచుకోగలరు?—"

ఖగేంద్రుడి వాక్చాతుర్యని శారదాబాబు మెచ్చుకున్నాడు. ఖగేంద్రుడి పుస్తకాన్ని గురించి మరికొన్ని ప్రశ్నలు వేశాడు. అయిదు పుస్తకాలకు చందా కట్టేందుకు అంగీకరించాడు. ఖగేంద్రుడు జమీందారు జీవితాన్ని గురించి వివరాలు రాసుకుని, "తమ తమ్ములు నవీన్‌బాబుగారిని గురించి ఏమీ రాయనేలేము. వారిని ఒకసారి కలుసుకోవచ్చా?—"

"సమీనా ? — వా డిక్కడ లేడుగా ! —"

"మరి ఎక్కడున్నారు ?"

"కలకత్తాలో "

"కలకత్తాలో అయితే. నే స్వయంగా వెళ్ళి కలుసుకుంటా. వారి అడ్రసు ఇవ్వండి "

శారదాబాబు తమ్ముడి అడ్రెసు రాయించి ఇచ్చాడు. ఖగేంద్రుడు సెలవు తీసుకున్నాడు.

*   *   *   *   *

ఇన్‌స్పెక్టరు దగ్గర్నుంచి ఖగేంద్రుడికి ఉత్తరం వచ్చింది — "ఎల్లుండి ఉదయం ఇద్దరు పెద్ద జమీందార్లు వస్తున్నారు. చాలా పుస్తకాలకు చందా రావచ్చు. కనుక, రేపు తొమ్మిది పది మధ్య ఒకసారి రండి" అని. ఉత్తరం తెచ్చిన కానిస్టేబిల్‌ను కాస్సేపు బయట కూచోమన్నాడు.

ఈలోగా నీలమణి గుడ్డలు తీసుకువచ్చాడు

ఖగేంద్రుడు తన గుడ్డలు తీసుకున్నాడు. సుదబాల చీరె తాలూకు ముక్క వాడికి చూపిస్తూ. "ఇదుగో, ఈ గుడ్డముక్క చూడు. దీని మీద ఈ గుర్తు నువ్వు వేసిందేనా ?—

ఇంటిముందు కానిస్టేబిలు, ఖగేంద్రుడిలా అడగటం చూసి, నీలమణి గాబరా పడ్డాడు. అనుమానంతో గుటకలు మింగుతూ, "చిత్తం — నాకు సరిగా గుర్తులేదు బాబూ ! — ఇది మీ కెలా వచ్చిందీ ?—"

"నా కెలా వచ్చిందో నీ కెందుకు ? అడిగినదానికి సమాధానం చెప్పు — ఊఁ —"

"చిత్తం, చిత్తం — నేను పేదవాణ్ని బాబూ, కనికరించండి" అంటూ నీలమణి చేతులు జోడించాడు.

"నువు పేదవాడి వైతే ఎవరిక్కావాలి, ధనవంతుడివయితే ఎవరిక్కావాలి ? — ఇది నువ్వు వేసిన మార్కు అవునా, కాదా ?—"

"ఏం జరిగింది బాబుగారు ?—"

"ఖూనీ !—"

"ఆఁ — ఆఁ — అమ్మాయిగారు ఖూనీ అయిందా ?—"

"ఆఁ, ఖూనీ చేశారు మీ అమ్మాయిగారి పే రేంటో చెప్పు — ఊఁ —"

"లీలావతి, బాబూ !— ఘోషాల్‌గారి కూతురు పాపం ! ఖూనీ చేసిం దెవరు బాబూ ?—




"ఇంకెవరు ?_మీ జమీందారుగారి తమ్ముడు."

"చినబాబుగారా ! అయ్యో...నాకు అప్పుడే తెలుసు. అయితే _ మీరు పోలీసులా బాబూ ?_"

"ఆ _ అవును. నేను డిటెక్టివ్‌ని." అంటూ. మీసంమీద చేయి వేసి తిప్పుకున్నాడు ఖగేన్.

"మీ కెన్నయినా దణ్ణాలు బాబయ్యా !_ నేను బీదవాణ్ని. నా కేం తెలియదు. నన్ను మాత్రం సాక్షుల్లో వేసుకోకండి. కావాలంటే మీ బట్టలు ఊరికే ఉతికిస్తాను. దయవుంచండి. టిక్‌టిక్ బాబూ !_"

"సరే. వెళ్ళు వెళ్ళు _ ఈ సంగతి ఎక్కడా చెప్పక. జాగర్త !_"

"చిత్తం బాబూ ! _ నా నాలిక తెగ్గోసినా చెప్పను."

* * * * *

శారధాబాబూ దొడ్డివేపు వసారాలో సంధ్య వార్చుకుంటున్నాడు.

నీలమణి ఆయాసపడుతూ వచ్చాడు. "కొంప మునిగింది. హుజూర్ !_ కొంప మునిగింది!!_ మీ చేతికింద నీళ్లు తాగుతున్నవాణ్ని గనక ఒక్క మాట చెప్పి పోదామని వచ్చా. ఖూనీ కేసు. హుజూర్ !_ ఖూనీ కేసు!! ఊళ్ళోకి పోలీసువా

శ్లాచ్ఛేశారు. డిక్కీ డిక్కీ బాబు వచ్చాడు. ఈ సంగతి నే చెప్పానని మాత్రం చెప్పకండి హుజూర్!— బీదవాణ్ని. చచ్చిపోతాను చినబాబు ప్రాణాలు రక్షించండి. బాబయ్యా. రక్షించండి. నే పోతున్నా బాబయ్యా!— దండాలు." అంటూ. ఇంటి దోవ పట్టాడు

జమీందారుకి సంధ్య సాగలేదు పోష్టాఫీసులో ఇన్స్పెక్టరూ, ఖగేంద్రుడూ కలుసుకోవటం, ఖగేంద్రుడికోసం అడపా దడపా కానిస్టేబిల్ రావటం. కలకత్తాలో ఉన్న నవీన్ అడ్రెసుకోసం ఖగేంద్రుడు ఆరా తీయటం.— ఇవన్నీ జమీందారుకి ఇదివరకే తెలుసు. ఇప్పుడా సంగతులన్నీ మళ్ళీ మళ్ళీ జ్ఞాపక మొచ్చాయి. నీలమణి ఇప్పుడు చెప్పింది నిజమే ననిపించింది.

శారదాబాబు గబగబ రెండో అంతస్థులోకి వెళ్ళి, ఆడవాళ్లతో ఏదో ఆలోచించాడు.

రాత్రి తొమ్మిదింటికి నమ్మకమైన ఒక ఉద్యోగిని ఖగేంద్రుడి మకాంకు పంపాడు జమీందారు.

*　　*　　*　　*　　*

"హుజూర్!— ఐదు వేలకి కానీకూడా తగ్గడట. ఖూనీ ఆధారాలు కావలసినన్ని ఉన్నాయిట. అయితే, ఖూనీ చేయబడిన స్త్రీ ఎవరో తెలియలేదట. అది కూడ ఇక్కడికి వచ్చాక తెలిసిందట ఇప్పుడు సగం—అంటే, రెండు వేల ఐదువందలూ ఇవ్వాలిట తగిన ఆధారాలు దొరకలేదని రిపోర్టు రాశాక తక్కిన మొత్తం ఇవ్వాలిట" అని చెప్పాడు, ఖగేంద్రుడి దగ్గరనుంచి తిరిగివచ్చిన ఉద్యోగి.

శారదాబాబు మళ్ళీ అంతఃపురంలోకి వెళ్ళి ఆలోచించాడు.

*　　*　　*　　*　　*

ఖగేంద్రుడి ఎత్తు ఫలించింది. రెండు వేల ఐదువందల కరుకులూ చేతిలో పడ్డాయి. "వాహ్!— తల యెత్తిందో లేదో, గెలు వేసిం దీ ఎత్తు!" అని ఎగిరి గంతేశాడు.

మళ్లీ తన ఆలోచనలో పడ్డాడు

"మాయాభవేంద్రు డెవరయిందీ కనిపెట్టి తీరాలి. నే ననుకున్నట్టు అతను నవీన్ కాదేమో?— ఏమో!— అయితే కానూవచ్చు. బాఘుసిపాడాలో భవేంద్రుడుగా నటిస్తూ, ఉత్తరాలు మాత్రం కలకత్తానించి పోస్టు చేయిస్తున్నాడేమో! ఇదేం పెద్ద ఆధారమేం కాదు.

"ఆc— ముందు కలకత్తా వెళ్లి, అక్కడ నవీన్ నిజంగా వుంటున్నాడో లేదో ఆరా తీయ్యాలి. ఒకవేళ నవీన్ కలకత్తాలోనే వుంటే?— ఇంకేమిటి చెయ్యడం?......

"ఆఁ–లీలావతి ఎక్కడెక్కడ తిరిగిందో, ఏమేం చేసిందో ఆచూకీ తియ్యాలి. అప్పుడే ఈ మాయాభవేంద్రు డెవడో బయట పడతాడు. ఇవన్నీ తెలుసుకుని, సైరిక్ని అడిగి తక్కిన విషయాలు లాగాలి. అదిమాత్రం ఓ పట్టాన చెబుతుందా?– నేను డిటెక్టివ్ నన్న సంగతి రేపు ఈ పాటికి ఎలాగూ ఊరు ఊరంతా పాకిపోతుంది. అప్పుడిహ ఏ సంగతి తెలుసుకోవాలన్నా కష్టమే...

"నేనే గనక పోలీసు డిపార్టుమెంటువాడి నయితే–ఎంత బాగుండును?– ఇద్దరు ముగ్గురు కాన్ స్టేబిల్స్ని తీసుకువెళ్ళి సంకెళ్లు చూపించి భయపెట్టి, బెదిరించి, ఉబ్బించి ఏదేనా చెయ్యటానికి వీలుండేది..."

మళ్ళీ కాస్సేపు ఆలోచిస్తూ, గదిలో అటూ ఇటూ పచార్లు చేశాడు.

"ఆఁ– అన్నట్టు– ఈ ఇన్ స్పెక్ట రొకడున్నాడుగా? ఇతనేం డబ్బు కతికే బాపతుగా కనబడటంలే

"ఆ – ఇతనికి కవిత్వంపిచ్చి ఒకటుంది. ఏదేనా కథగాని కథ– కట్టుకథ ఒకటి కల్పించి, ఇన్ స్పెక్టరుచేత నా పని చేయించుకోవాలి......

రేపే – రేపు పొద్దున్నే వెళతాను......"

*   *   *   *   *

"కాస్త టీ పుచ్చుకుంటారా?–" ఇన్ స్పెక్టరు ఖగేంద్రుణ్ని అడిగాడు.

"థాంక్స్ – ఇప్పుడే తీసుకున్నా."

"ఇత దూరమూ నడిచివచ్చారుగా, మరొకసారి తీసుంకోడి" అంటూ, టీ తెప్పించి ఇచ్చాడు.

తరవాత —ఇద్దరూ కాస్సేపు ఖులాసాగా కబుర్లు చెప్పుకున్నారు.

"మీ రింత పొద్దున్నే వచ్చారు కాని, మీకు కావలసిన చందాదారులు, వాళ్ళ పనులూ అవీ పూర్తి అయితేగాని రారు."

పోసీలెండి జమీందారుల చరిత్ర వేస్తున్నా నని నే నిలా రావటం ఒక వటనే" "అన్నాడు ఖగేంద్రుడు, ముసిముసిగా నవ్వుతూ.

ఇన్ స్పెక్టరు ఖగేంద్రుడి ముఖంకేసి అసక్తిగా చూస్తూ "అవువవును, నాకూ తెలుసు" అన్నాడు

ఖగేంద్రుడు ఆశ్చర్యపోయాడు "ఎలా తెలుసుకున్నారు?"...

"ఆవేళ మిమ్మల్ని పోస్టాఫీసులో కలుసుకున్నప్పుడే మీమీద నాకు కాస్త అనుమానం కలిగింది. మీ కరపత్రం కలకత్తా కమీషనర్కి పంపాను."

"ఆఁ — ?" ఖగేంద్రుడి గుండె దడదడలాడింది. ముఖం పాలిపోయింది. "ఇంకా ఏం తెలుసుకున్నారు?"

"మీరు పరారీలో ఉన్నావారు కారనీ, మీరు అనుమానితుల పట్టీలో లేరనీ కూడా తెలుసుకున్నాను."

"ఇంకా ?—"

"మరేం లేదు. ఇప్పటివరకూ ఇంతే తెలుసుకున్నాను."

నా మీద అనుమానం కలిగినప్పుడు నా పుస్తకానికి చందాదారుల్ని ఎందుకు ప్రయత్నించారూ ?— నన్ను ఎందుకు కబురు చేశారూ ?"—

"మీకు కబురు చేసేటప్పటి కింకా కమీషనర్ దగ్గరనించి టెలిగ్రాం రాలేదు. మరొక విధంగా గనక టెలిగ్రాం వచ్చి వున్నట్టయితే, అరెష్టు చెయ్యటానికి మిమ్మల్ని వెదకవలసి వస్తుందేమో నని, ముందుగానే మీకు కబురంపాను. మీ భాషలో చెప్పాలంటే, నేను చందాదారుల్ని చూడట మంతా వట్టి నటనే" అంటూ, ఇన్‌స్పెక్టర్ పకపక నవ్వాడు.

ఖగేంద్రుడి ముఖం చిన్నబోయింది. తల దించేసుకున్నాడు.

"ఏమిటి ఖగేన్‌బాబూ!— ఈ పాటిదానికే కోపం తెచ్చుకున్నారా ?— చూడండి నేను పోలీసువాణ్ణి. ప్రతీదాన్ని అనుమానించటమే నా వృత్తి నా డ్యూటీ నేను చేశాను అందుకు మీరు విచారించటం దేనికి ?— ముఖం చిన్నబుచ్చుకున్నా రెందుకని ?—"

మీరు నన్ను దొంగగా, నీతి లనివానిగా అనుమానించారు. కాని, అందుకు నేను విచారించటంలేదు మీ మీద నే నొక ఆశపెట్టుకు వచ్చాను నా ఆశ నిరాశ అవుతున్నదే అని నా విచారం"

"మా మీద ఆశపెట్టుకు వచ్చారా ?— ఏ విషయంలో ?—"

"కొన్ని సంగతులు దర్యాప్తు చేసి తెలుసుకుందా మని నే నీప్రాంతానికి వచ్చాను. నా జీవితం ఈ సంగతులమీద ఆధారపడివుంది. మీరు పోలీసు అధికారులు గనుక, ఆ సంగతులు నాకు దర్యాప్తు చేసిపెట్టగలరు."

"అస లింతకీ — విషయ మేమిటో చెప్పటంలేదు మీ పేరు ఖగేన్‌బాబే అయి వుంటే, మీకు ఆశాభంగం కలగటానికి కారణ మేమిటో స్పష్టంగా విశదపర్చి చెబితే, అప్పుడు నేను మీ కేదైనా సహాయం చేయగలిగిందీ చేయలేందీ చెబుతా."

"మీకు నా పేరుమీదనే నమ్మకం లేనప్పుడు, మీరు నాకు సహాయం చేస్తారని ఎలా ఆశించగలను ?— ఈ ప్రాంతానికి నేను పూర్తిగా కొత్తవాణ్ణి నా పేరు నిజంగా ఖగేంద్రనాధ వంద్యోపాధ్యాయే అని ఎవరిచేత రుజువు చేయించగలను ?—"




ఇన్స్పెక్టరు అరక్షణం ఆలోచించాడు. "న్యాయ విరుద్ధం కాని ఉపకారం ఏదేనా వీలుంటే తప్పకుండా చేస్తాను."

"న్యాయాన్ని వదలకుండానే, మీరు నా కా ఉపకారం చెయ్యగలరు. ఈ ఉపకారం నా ఒక్కడికే కాదు – వంగదేశంలోని ఒక గౌరవ కుటుంబానికి మీరు చేసినవా రవుతారు."

"అయితే ఏమిటో వివరంగా చెప్పండి."

"ఒక యువతి, ఒక యువకుడు ఒక చోటికి వెళ్ళి, ఒక పెద్ద మోసం చేసే ప్రయత్నంలో వున్నారు. నేను వాళ్ళ మోసాన్ని అడ్డగించ దలుచుకున్నా. ఆ స్త్రీ ఎవరయిందీ ఇక్కడికి వచ్చాక తెలుసుకో గలిగాను; కా వింకా, ఆ పురుషు డెవరయిందీ ఖచ్చితంగా తేలలేదు"

ఎక్కడ జరుగుతున్న దీ మోసం ?–"

"ఆ సంగతి ఇప్పుడే అడక్కండి, చెప్పను. ఈ జిల్లాలోదీ, ఈ డివిజన్లోదీ మాత్రం కాదు."

"ఆ స్త్రీ ఎవరు ?–"

"వసంతపూర్‌లో కృష్ణదాస్ ఘోషాల్‌గారి కూతురు; పేరు లీలావతి. ఈ సంగతి ఎలా తెలుసుకున్నా నంటారేమో - వినండి ......" అంటూ, ఇప్పటి వరకూ జరిగిన తన పరిశోధన గురించి చెప్పాడు.

"మీరు చూడగా, అపర షెర్లాక్ హోం లా వున్నారే. ఎవరిమీదయినా మీకు అనూమాన ముందా___"

"ఉంది. ఆవాళ రాత్రి లీలావతి తన అత్తగారి వూరినించి పారిపోయింది. పారిపోయిన రాత్రి ఆమె ఈ గాజన్‌తలా దగ్గర సైరంధ్రి అనే స్త్రీతోను, నవీన్ చంద్రుడితోనూ కలిసి వెళ్ళింది. ఆ రాత్రే లీలావతి పత్తా తెలియలేదు అంచేత, నవీన్‌తో ఆమె లేచిపోయిందేమో ననీ, వాళ్ళిద్దరూ కలిసి ఈ మోసం చేస్తున్నా రేమో ననీ, నా అనుమానం......"

ఇన్‌స్పెక్టరు ఆనాటి పాత డైరీలు తెప్పించి చూశాడు. చౌకీదారు రాయించిన డైరీలో ఖగేంద్రుడు చెప్పిన వివరా లన్నీ వున్నాయి.

"ఈ మోసానికి మీరు అడ్డుపడటం, ఈ దర్యాప్తు చేయటం అదీ అంతా, ధర్మ బుద్ధితోనూ పరోపకారబుద్ధితోనే చేస్తున్నారా?___" అడిగాడు ఇన్‌స్పెక్టరు.

"అదేం కాదు. ఇందులో నా స్వార్థమూ వుంది..." అంటూ, అల్లిబిల్లి కథ ఒకటి అల్లి చెప్పాడు.

చివరికి___ "లా ప్రకారం నే చెయ్యగల సహాయం వుంటే పూర్తిగా చేస్తాను" అని ఖగేంద్రుడికి మాట ఇచ్చాడు ఇన్‌స్పెక్టరు.

* * * * *

ఖగేంద్రుడు కనకలతకు ఇలా రాశాడు:

.........మరికొన్ని కొత్త సంగతులు తెలుసుకోగలిగాను. ఇక్కడ సబ్ ఇన్‌స్పెక్టరు సహాయంతో సైరంధ్రిని క్రాసుపరీక్ష చేశాను. చాలా సంగతులు తేలాయి

నవీనచంద్రుడు డబ్బు ఆశ చూపి దానిని మయనావతికి పంపాడట. అక్కడ లీలావతిని కలుసుకుని, "మీ అమ్మని చూపించి, మళ్ళీ తీసుకువచ్చి దిగబెడతాను" అని చెప్పిందిట. లీలావతి సైరంధ్రితో వచ్చేసింది. ఊరిబయట చెట్లచాటున దాక్కొని వున్న నవీనచంద్రుడు లీలావతిని పట్టుకుని, నోట్లో గుడ్డలు కుక్కి, బండిలో ఎక్కించుకుపోయాడు. బండివాణ్ణికూడా పరీక్షచేశారు ఇన్‌స్పెక్టరుగారు. వాళ్ళు నయన పూర్ దగ్గర్లో ఒక మేడలో దిగారట. ఎల్లుండి ఇన్స్పెక్టరుగారితో నయనపూరు వెళ్ళుతున్నాను.

* * * * *

వయసపూరు దర్యాప్తుకు ఇన్ స్పెక్టరు ఒక్కడే వెళ్ళాడు......

నెల్లాళ్ళకి పైగా లీలావతి అక్కడ బంధించబడి వున్నదిట. నవీనుడు ఆమెను ఎన్నో విధాల బతిమాలాడేవాడట ? లీలావతి ఎప్పుడూ ఏడుస్తూ, 'దగ్గరికి వచ్చావంటే ఈ మేడమీదినించి దూకి చస్తా' నంటూ బెదిరించేదిట.

అక్కడ్డించి లీలావతిని కాల్ నాకి తీసుకువెళ్ళాడట. ఇన్ స్పెక్టరుగారు నన్ను కాల్ నా పంపిస్తున్నారు......

సురబాల - అంటే లీలావతి నవీనుడ్ని విడిపించుకుపోయిందేమో ననిపిస్తుంది.

... ... ... ... ... ...

కనకలత ఖగేంద్రుడికి ఇలా రాసింది !

...మీ ఉత్తరాలు రెండూ అందాయి. నేను ఒక్క సంగతి మాత్రం తెలుసుకో గలిగాను, ఇక్కడికి భవేంద్రుడుగా వచ్చినతడు ఇక్కడికి రావటానికి పూర్వం తిన్ తారియా మఠాధిపతిగా ఉండేవాడుట. ఈ సంగతి ఒకసారి అతను దివాన్ తో చెబుతూఉండగా నే విన్నాను......

భవేంద్రుడు ఎవరేనా కానీండి – చినరాణి ప్రేమలో పడ్డాడు. ఈ మధ్య చిన రాణికి జ్వరం వచ్చింది. ఒక రోజు కాస్త ఎక్కువగా వుంటే ఆనాడు ఆమె పక్క దగ్గరే కుర్చీ వేసుక్కూర్చున్నాడు అతను అతని కళ్ళమ్మట నీళ్ళు నేను స్పష్టంగా చూశాను ఇలా మనస్ఫూర్తిగా ప్రేమించుకున్న వీళ్ళని చూస్తే నా కెంతో ముచ్చటగా వుంది......

... ... ... ...

కాల్నానుంచి ఖగేంద్రుడు కనకలత కిలా రాశాడు :

నీ ఉత్తరం అందింది. నువు చెప్పిన తిన్ తారియా మఠం ఎక్కడ వుందో అంతు పట్టటంలేదు. తెలుసుకోవాలి.

ఇక్కడ వున్న ఇన్ స్పెక్టర్ గారి సాయంతో పల్లెవాళ్ళను వాకబు చేశాను. వారిలో దరిబుల్లా అనేవాడు ఒక సంగతి చెప్పాడు...ఒక పెద్దమనిషి జబ్బుగా వున్న స్త్రీతో అతని పడవ ఎక్కాడట ఆమెకి అతనంటే ఇషం లేదట. ఎప్పుడూ ఏడుస్తూ వుండేదిట. తిండి సరిగా తినేదికాదట. ఆ పెద్దమనిషిని మాత్రం దగ్గరకు రానిచ్చేది కాదుట.

ఒకరోజు ఆమె ఉరిపోసుకుందట. కానీ, ఆ పెద్దమనిషి వెంటనే ఉరితాడు కోశేశాడట చాలా సేపటికిగాని ఆమెకు తెలివి రాలేదు

పడవలో ఆమె ఒంటరిగా పడుకునేది. ఒకనాడు పొద్దున్నే చూస్తే ఆమె కనబడ లేదట. దేరాన్‌గంజ్ దగ్గరలో రాత్రి ఎదో నీళ్ళలో దూకిన ట్టయిందట.

ఆరోజు ఫాల్గుణ బహుళ చతుర్దశి.

సురబాల అక్కడికి ఏరోజున వచ్చి చేరుకుందో రాయి ...

... ... ... ... ... ...

ఖగేంద్రుడికి కనకలత రాసింది :

డోలోత్సవంనాటి పర్నాడు ఉదయమే సురబాల ఇక్కడ రేవుదగ్గిర దొరికింది.

... ... ... ... ... ...

కనకలతకు ఖగేంద్రు డిలా రాశాడు :

నా దర్యాప్తు అంతా వ్యర్థ మయింది. ఈ మాయాభవేంద్రు డెవరయిందీ నా కేమీ అంతుపట్టటంలేదు.

నవీన్‌చంద్రుడి జాడ తెలుసుకుందామని నేను కలకత్తా వచ్చాను. అతని అడ్రెసు కనుక్కొని వెళ్ళాను. వెళితే, మెడికల్‌కాలేజి ఆస్పత్రిలో ఉన్నా డని తెలిసింది.

ఆస్పత్రికి వెళ్ళాను, గుర్రపుబగ్గీ బోల్తా పడటంవల్ల బలంగా గాయాలు తగిలి, కొన్నాళ్ళనించీ ఆస్పత్రిలో వుంటున్నాడు. నాలుగయిదుసార్లు కలుసుకున్నాను.

మొన్ననే నవీన్ చచ్చిపోయాడు. చచ్చిపోయేముందు వకీలుచేత వీలునామా రాయించాడు. దైవానుగ్రహంవల్ల తన ప్రయత్నం నెరవేరలేదనీ, లీలావతికి శీల భంగం కాలేదనీ రాశాడు. తన పాపానికి ప్రాశ్చిత్తంగా తన ఆస్తిలో సగం లీలావతికి చెందేలా రాశాడు. ఆ వీలునామామీద నేనూ సాక్షిసంతకం చేశాను.

ఎల్లుండి నేను కాశీ వెళుతున్నాను. తిన్‌తారియా మఠం ఎక్కడ వున్నదీ తెలుసు కుని, మాయాభవేంద్రు డెవరయిందీ తేలుస్తాను.

... ... ... ... ... ...

తిన్‌తారియా మఠానికి వెళ్ళాను. బాళులీపాడా భవేంద్రుడు అక్కడ కొంతకాలం మఠాధిపతిగా వున్నాడుట. కొద్దిరోజుల్లో మళ్ళీ వస్తా నని చెప్పి, కిందటి ఫాల్గుణంలో అతను వంగదేశానికి బయలేరాడట. తరువాత అతని సంగితే తెలియచేదుట.

పోలీసు రైల్వే శాఖలో కనుక్కోగా—ఆ రోజుల్లో ఒక సన్యాసి శవాన్ని రైల్లోనించి ఖుస్రుపూర్‌లో దించినట్లు తెలిసింది. ఆ సన్యాసి పెట్టె అవీ అతనివే నని మఠంలో శిష్యులు గుర్తించారు.

ఇంకా ఎక్కువ సంగతులు తెలుసుకుందామని ఖుస్రుపూరు వెళ్ళాను. సన్యాసి శవాన్ని అక్కడ దింపారుట. అప్పుడు మయనావతి నివాసి రాఖాల్ భట్టాచార్య—




అంటే లీలావతి భర్త డ్యూటీలో వున్నట్టు తెలుసుకున్నాను. ఆ తర్వాత ఒకటి రెండు రోజులకే రాఖాల్ ఉద్యోగం వదులుకుని కాశీ వెళ్ళాడుట.

మయినావతి వెళ్ళాను. అక్కడ రాఖాల్ అన్న వున్నాడు. ఇప్పటివరకు రాఖాల్ సంగతు లేవీ అతనికి తెలియలేదుట. తమ్ముడు బతికివున్నాడో, లేదో కూడా అతనికి తెలియదుట.

ఇప్పుడంతా తెలిసిపోయింది. రాఖాలే చచ్చిపోయిన సన్యాసి కాగితాల్లోంచి అన్నీ సంగ్రహించి, భవేంద్రుడి రూపంలో జాతురీపాడా చేరుకున్నాడు. అందుకే – నువు రాసినట్టు ఆవేళ అతన్ని చూసి సురబాల ఉలిక్కిపడింది.

మరికొన్ని సంగతులు తెలుసుకోవాలి. అవికూడా తెలుసుకున్నాక జాతురీపాడా వచ్చి ఉంటున్నాను.

* * * * *

వారంరోజులనించీ తెరిపి లేకుండా వర్షాలు కురుస్తున్నాయి. ఖర్ ఖర్ మని దగ్గుతూ, కచేరీ పనులు చూసుకుంటూ, దివాన్ జీ – బాబుగారి కోసం ఎదురు చూస్తున్నాడు.

అంతఃపురంలోకి ముమ్మారు కబురంపాడు. ఇదుగో వస్తున్నా, అదుగో వస్తున్నా అనటం తప్ప, బాబు ఇవతలికి ఊడిపడరందే! —" ఇంతటి స్త్రీలోలుడు ఆ స్తిపాస్తుల నెలా కాపాడుకుంటాడో!— అజమాయిషీ లేకపోతే ఎక్కడి దక్కడ పాడై, అంతా ఒక కొలిక్కి వచ్చేలావుంది. ఇద్దరూ గువ్వపిట్లల్లా అంతఃపురంలో కూచుంటే, తక్కిన వ్యవహారా లన్నీ ఏంకాను ?— పైగా ఇతను వ్రతం చేస్తున్నాట్ట !— ఏం వ్రతమో, నా తలకాయవ్రతం. కుర్రవాడి కిప్పుడు భార్యావ్రతంలా ఉంది...

'ముమ్మారు కబురంపినా, ఎక్కడా మనిషి జాడాలేదు...హుం — ఇది పనికాదు, నీళ్ళలో పడితేగాని ఈత రాదు. నేను ఏదో సాకుతో కొన్నాళ్ళపాటు తప్పుకుంటే, ఆస్తిపాస్తుల భారమంతా నెత్తిన పడితే, అప్పుడుగాని బాబుకి చైతన్యం వచ్చేలా లేదు...'

దివాన్‌జీ విసిగిపోయాడు

రాత్రి పది దాటాక నౌకరు ముందు లాంతరుతో నడుస్తూవుండగా — గొడుగు వేసుకు బయలేరాడు రాఘవ్. తనకోసం బెంచీమీద కాచుక్కూచున్న దివాన్‌ను చూసి, "బాబయ్యగారూ !— ఇంకా ఇంటికి వెళ్ళలేదూ ?—"

"లేదు బాబూ! — అర్జెంటు పని ఒకటి వుంది. అందుకని..."

"ఓ — అవునవును, నాకోసం కబురంపాడుకదూ ?"

"అవును. రెండు మూడుసార్లు..."

"అవునవును. ఆ సంగతే మరిచిపోయా నసలు. నన్ను మన్నించండి బాబయ్యగారూ! — మీకు చాలా శ్రమ ఇచ్చాను."

"లేదుబాబూ! — శ్రమ ఏముందీ ? —"

"చీకటిరాత్రి, వానా వంగుతూను, బురదలోపడి వెళ్ళాలి మీరు. వెలుగుండగానే వెళ్ళలేకపోయారా ? — అంత అవసరమైన పని వుందేమిటి ? — సరే, అయితే పైకి పదండి."

"ఇవాళ పట్నంనుంచి పేష్కార్ మతిబాబు ఉత్తరం రాశారు. కలెక్టరుగారు ఎల్లుండి మీర్జాహాట్ రాఘారి బంగళాలో దిగుతారుట. మూడురోజు లుంటా రక్కడ. కనక, బాగా మర్యాదలూ అవీ జరగాలి. జిల్లా అధికారి కదా ? —"

"కానుకలూ అవీ ఇవ్వాలా ? —"

"కానుక లెలాగూ ఇవ్వాలి. వాటన్నిటికీ అన్నీ ఏర్పాటు చేశాను. మీర్జాహాట్‌లో మన కచేరీ లేదు. భద్రకాళిలో వుంది. రెండంతస్థుల మేడ— చిన్నప్పుడు మీరు

నాన్నగారితో రెండు మూడుసార్లు వెళ్ళారు. మన గుమాస్తాకి ఫర్మానా పంపాను. అతనే అన్నీ సరఫరా చేస్తాడు. అయితే, గుమాస్తాకి బాధ్యత అంతా అప్పజెప్పి నిశ్చింతగా కూచోటం మంచిదికాదు...''

"పోనీ, మీరు వెళ్తేసరి."

"నేను వెళ్ళగలను గాని, మీరు వెళ్ళటమే మంచిది బాబూ! —"

"ఇప్పు డెలా వెళ్ళటం? —"

"చిన్నరాణీగారు క్రమంగా ఆరోగ్యం పొందుతున్నారు. ఇలాంటి సామాన్య జ్వరాల్ని వైద్యుడు రెండు మూడు రోజుల్లో నయం చేసేస్తాడు. మరేం భయంలేదు. నేనూ వుంటానుగా? — ఎప్పటిక ప్పుడు కనుక్కుంటాను. మీరు వెళ్ళకపోతే బాగుం డదు. మీరు వచ్చినప్పట్నించీ కలెక్టరును కలుసుకోనే లేదు. ఇప్పుడయినా వెళ్ళక పోతే ఏమేనా అనుకుంటారు."

"నేను వెళ్ళి ఏం చెయ్యాలి?"

"మీరు పల్లకీలో వెళ్ళండి. వెళ్ళి, దొరగారిదగ్గిరికి మీ కార్డు పంపించండి. రమ్మని కబురు రాగానే వెళ్ళి షేక్‌హాండ్ ఇచ్చి కుశలప్రశ్నలు వెయ్యండి."

"బెంగాలీలోనా? —"

"అహఁ హఁ — ఇంగ్లీషులోనే మాటాడండి. ఒకటి రెండుసార్లు యువర్ ఆనర్ అనీ, సర్ అనీ అనండి, చాలు. 'దొరగారికోసం కోహ్నూ. గుమ్మా అనీ ముందుగానే పంపుకున్నాను. హుజూరు ఈ చిన్నికానుక స్వీకరిస్తే కృతార్థుణ్ణి.' అని సైగ చెయ్యండి మన మనిషి ఆ బహుమతి దొరగారిముందు పెడతాడు.''

"అబ్బా! — చాలా తతంగం వుందే? —"

"ఏం చేస్తాం బాబూ! — దొరలంటే కలియుగదేవతలు.''

"వాళ్ళకి పూజ చేశాక, తిరిగి నే నిక్కడికి వచ్చేసెయ్యవచ్చునా? —"

"అహఁ — బాగుండదు. ఆయన మూడు రోజు లుంటారు. రోజూ పొద్దున్నే వెళ్ళి, ఓసారి దర్శనం చేసుకోవటం ముఖ్యం..."

గత్యంతరం లేక సమ్మతించాడు రాఘాల్.

* * * *

"ఎలావుంది ఇందూ? — జ్వరం తగ్గిందా? —"

"ఏమో నా కేం తెలుస్తుంది? — శరీరానికి తెలియాలి."

ఆమె అభిప్రాయం గ్రహించాడు రాఘాల్.

"నా దురదృష్టం నువ్వెరుగుదువుగా ఇందూ? —"

"అహఁ - ఊరికే అన్నాను. మీ రేం కోపం తెచ్చుకోకండి. నా వంట్లో ఇప్పుడు కులాసాగానే వుంది. జ్వరం లేదు."

"ఇంతవరకూ చేసిన వ్రతాలూ అవీ చాలు. ఈ వ్రతాన్ని ఇక్కడితో ముగిద్దామా అనుకుంటున్నా."

"అహఁ - అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు. మిమ్మల్ని నేను అధర్మ పథానికి ఎన్నటికీ లాగను. ఒకటి గనుక జరిగితే, నేను స్వార్థంతో ఒకపని చెయ్యవచ్చు. అప్పుడు మీకు వ్రత భంగం తప్పదు."

"ఏమి టది ఇందూ ? –"

"మీ వ్రతం పూర్తి అవటానికి ముందే, నాకు ఆఖరి గడియలు రావటం తటస్థిస్తే..."

"ఇందూ !– ఏమి టా మాటలు ?– అలాంటి అమంగళాన్ని తలపెట్టకు తప్పు."

"అమంగళ మేముంది ? – ఆడదానికి అంతకంటె మంగళప్రదమైన దేముంది?– అటువంటి యోజేకనక వస్తే – చచ్చిపోయేముందు నా తలను మీ ఒళ్ళో పెట్టుకోక మానను. అప్పు డింక మీ వ్రతాన్ని పాటించేది లేదు." ఇందుమతి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"అవునూ – మన ఎస్టేటులోకి కలెక్టరుగారు వచ్చారుట. ఏ వూరికి వచ్చారూ?" అంటూ ప్రసంగం మార్చింది ఇందుమతి.

"ఆఁ– మీర్జాహాట్ కి వచ్చారుట."

"ఎంతదూరం ? –"

"భద్రకాళి దగ్గర."

"చాలా దూరమే – ఏర్పాటన్నీ జరిగాయా ? –"

"ఆ - అన్నీ జరిగాయట. కానీ, నాకే చిక్కు వచ్చింది."

"ఏం?... ఏం చిక్కు వచ్చింది ? –"

"నీ వంట్లో బాగుండలేదా ? – ఇటువంటి పరిస్థితిలో నిన్ను వదిలి, మూడు రోజులు అక్కడికి వెళ్ళి ఎలా వుండేది ? –"

"మూడు రోజులకే ఇలా బాధపడుతున్నారు. పదహారేళ్ళు ఎలా వుండగలిగారూ ?... ఏం, కోపం వచ్చిందా ? పాపిష్టిదాన్ని. ఎందుకో ఇవాళ అన్నీ మీకు కష్టమైన మాటలే అంటున్నా. నన్ను క్షమించండి. ఏమండీ, మీ ముందు కాకపోతే మరెవరిదగ్గర అభిమానం తెచ్చుకోను; చెప్పండీ ? – "

రాఘవ్ ముఖకవళికలు చూసింది. మళ్ళీ ప్రసంగం మార్చివేసింది ఇందుమతి.




''ఏమండీ, భద్రకాళిలో మహత్తు గల కాళికాదేవి వుంది, మీకు తెలుసా ? _''

"ఏం, అంత మహత్తు గలదా ? _ "

"అవును. అందరూ చెప్పుకుంటారు."

"అయితే _ నీకు వెంటనే ఆరోగ్యం చిక్కితే అమ్మవారి పూజ చేయిస్తానని మొక్కుకుంటా."

"అదికాదు; కులాసా చిక్కితే, ఇద్దరమూ వచ్చి పూజ చేయిస్తామని మొక్కుకోండి. అమ్మవారి ప్రసాదం, కుంకుమ నాక్కాస్త తెచ్చిపెట్టంటి "

"తప్పకుండా తెస్తా."

* * * *

హుజూర్, సెలవైతే, మేమేదేనా ఇంత తిని, నీళ్ళు తాగి, కాస్త అలసట తీర్చుకు వస్తాం'' అన్నారు పల్లకీ బోయీలు.

"సరే _ కానివ్వండి. ఇ దేవూరూ ? _ " అడిగాడు రాఘాల్.

"బేడాగ్రామం, హుజూర్ ! _ మాగంజిసింగి దొరవార్లది. ఇక్కడ సాయెబులెక్కువ, హిందువులు తక్కువ."

బోయీలు వెళ్లారు.

రాఘాల్ పల్లకీ దిగి, అలా అలా నడుస్తూ, అటు ఇటు చూసుకుంటూ, ఊళ్ళోకి వెళ్ళాడు.

ఒకచోట పెద్ద గుంపు. ఏదో దెబ్బలాట. రాఘాల్ అక్కడికి వెళ్ళాడు.

"నా ప్రాణాలు పోయినా సరే, ఈ మేకపిల్ల నివ్వను" అంటున్నా డొక సాయెబు.

"ఇవ్వవూ ? – ఏమనుకుంటున్నావో. ఇది జమీందారుగారి హుకుం !– "

"జమీందా రయితే కానీ, జమీందారుకి నే నేం శిస్తుబకాయి లేను. నా మేకని నే నెందు కివ్వాలి ? – "

రాఘాల్ గుంపులోనించి ముందుకు వచ్చాడు

"ఏమిటీ గొడవ ? – " అని అడిగాడు.

"సలాం, బాబూ ! – మీరు హిందూ సాధువులు. మీరు చెప్పండి. ఈ మేకను నా ప్రాణంకంటె ఎక్కువగా పెంచుకుంటున్నాను. నే తినటం మాని, దానికి పెడు తుంటాను. ఇది నా చేతుల్లోనే పెరిగి పెద్దదయింది ఇప్పు డీ మేకను నే నెందు కివ్వాలి ?– దీన్ని తీసుకుపోయి, కోసుకుతింటారు, బాబయ్యా. నన్నూ, నా మేకనూ రక్షించండీ," అన్నాడు సాయెబు.

"వీడి మొండితనం చూడండి బాబూ ! – రేపు జమీందారుగారింట్లో విందు. కలకత్తానించి గొప్పగొప్పవా ళ్ళంతా వస్తున్నారు ఈ మేక నివ్వడంట ఇవ్వవూ ? ఇవ్వవూ ? – ఇస్తావా, మర్యాదగా ఇయ్యి లేకపోతే, చెప్పుతీసుకు పళ్ళు రాల గొడతా" అంటూ మేకకు కట్టిన తాడు గుంజాడు మేకపిల్ల కుయ్యో మొర్రో మంటూ కింద పడి అరిచింది.

"ఎవడివిరా నువ్వు ? – " కోపంగా అడిగాడు రాఘాల్

"ఆ––దిగాడు దొర, మాలావు సాధువు. నేను సింహాదొరల సిపాయిని. ఎవర్నీ లెఖ్ఖచెయ్యబోవయ్యా నువ్వూ..." అంటూ వెటకారం చేశాడు సిపాయి.

"నోర్ముయ్ !– అతని సొత్తు అత నిష్టం. అత నివ్వనంటూంటే నువ్వేలా జబ ర్దస్తీ చేస్తావ్ !– నీ కేమేనా బుద్ధి వుందా, లేదా ?" అని కేక వేశాడు.

అప్పటిదాకా వెనక్కి నక్కివున్న ముసల్మానులు ముందుకు వచ్చారు.

"హబీబ్ భాయ్ !– ఇవ్వొద్దు. నీ మేకని నువ్వెందు కివ్వాలి ?–"

"ఏమిటీ జులుమ్ ?– మన మింతమందిమి వుండగా, ఈ కుర్రసిపాయి మేక నెలా లాక్కెడతాడో చూదాం."

నలుగురూ నాలుగు మాట లన్నారు.

సిపాయి తగ్గిపోయాడు. "నే నేం వూరికే అడగటంలేదు. దా ని ఖ రీ దె ంతో సుకో, ఇస్తా."

"నీ డబ్బు నువ్వే వుంచుకో. నాకు ప్రాణప్రదమైనదాని ప్రాణాన్ని ఎందుకు యనిస్తాను ?- నా ప్రాణం పోయినా మేక నివ్వను" అన్నాడు హబిబుల్లా.

"ఓయి సిపాయీ !- నువ్వు క్షేమంగా వెళ్ళా లనుకుంటే మెల్లిగా ఇక్కడినించి గారుకో. మీ యజమానికి మాంసం తినాలనుంటే, అమ్ముకునే వాళ్ళదగ్గర కొనుక్కో. ంతేగాని, పేదవాళ్ళమీద జులుమ్ చెయ్యకు." అన్నాడు రాఖాల్.

"సరే, వుండండి - జమీందారుకే అవమానం చేశారుగా ? కానీండి : చూపిస్తాం దాఖా." అంటూ ధుమధుమలాడుతూ వెళ్ళిపోయాడు సిపాయి.

"ఇదుగో - మీ జమీందారు మీ మీద అత్యాచారాలు చేస్తున్నట్టయితే రేపు కలెక్టరు గారి డేరా పడబోతూంది. మీర్జాహాట్‌లో ఆయన మూడురోజులు మకాం చేస్తారు. ఆయన దగ్గరి కెళ్ళి మీ బాధలు చెప్పుకోండి" అంటూ రాఖాల్ వెళ్ళిపోయాడు.

* * *

"నాకు ప్రాణప్రదమైనదాని ప్రాణాన్ని ఎందుకు తియ్యనిస్తాను ?-" అన్న సాహెబు మాటే రాఖాల్ చెవుల్లో మారుమోగుతున్నది. అతని హృదయంలో చొచ్చుకు పోయిం దా మాట. అతని శరీరంలో అణువణువునా ప్రసరించిం దా మాట......

......అతని కళ్ళలోంచి కన్నీళ్ళు తొణికిసలాడాయి......

ఇందుమతిని గురించే అతని ఆలోచన.

"చదువు సంధ్యలు లేని అ సాయెబుకి వున్నంత జ్ఞానమైనా నాకు లేదు. తనకి ప్రాణమైనదాని కంఠాన్ని నులమటానికి ఒకడు సిద్ధమయితే - సాయెబు తన ప్రాణాలు ఒప్పగించాడు. హుఁ - కాని, నేను......?

......నేను......ప్రేమిస్తున్నవారి కంఠంలోనే కత్తితో పొడవటానికి సిద్ధ డుతున్నాను...ఏమి టీ జన్మ ?- ఎందు కీ జన్మ ?-"

రాఖాల్ ఆలోచన ఎంతకీ తెమలటంలేదు.

* * *

"నాయనా !- నీ ముఖం అలా వుందేం, నాయనా ?- వంట్లో ఎలా వుందీ ?-" అడిగింది పెద్దరాణి.

"ప్రయాణపు బడలికవల్లనేమోనమ్మా" అని చెప్పి తప్పుకున్నాడు రాఖాల్.

"అలా వున్నారేం ?- కళ్ళూ, ముఖమూ పీక్కుపోయినట్టున్నాయేం ?-" అడిగింది ఇందుమతి.

"అబ్బే. ఏం లేదే ?_"

"భద్రకాళి దర్శనం చేసుకున్నారా ?_"

"లేదు" అని, ఒక్కటేమాట సమాధాన మిచ్చాడు రాఘాల్. ఇందుమతి ఆశ్చర్యపోయింది.

జరిగిం దేమిటో ఆమె కేమీ బోధపడలేదు.

రాఘాల్ అక్కడ ఎక్కువసేపు వుండలే

*          *          *

"బాబూ !_ నా కొక నెల్లాళ్ళు సెలవిప్పించాలి" అడిగాడు దివాన్

"ఎందుకు బాబయ్యగారూ !_"

"నా ఆరోగ్యం ఏమీ బాగుండటేదు. కొంతకాలం డార్జిలింగ్‌లో ఉండివస్తా."

"మీ ఆరోగ్యానికి అవసరమని తోస్తే, సరే, అలాగే వెళ్ళిరండి."

"అయితే - ఇక్కడ పనులూ అవీ నువ్వు కాస్త జాగ్రత్తగా చూసుకోవాలి బాబూ !_ మన మేనేజరు చాలా అనుభవం ఉన్నవాడే. అయినా, నీ ఆస్తి నువ్వు స్వయంగా చూసుకోకపోతే తీన్ తేరా అయిపోతుంది.'

మరి కాస్సేపు మాటాడి, దివాన్‌జీ సెలవుతీసుకు వెళ్లిపోయాడు

*          *          *

"అదేం నాయనా, ఏమీ తిననేలేదూ ?_" అడిగింది పెదరాణి.

"అట్టే ఆకలిగా లేదమ్మా"

"ఒంట్లో ఎలా వుంది ?_"

"బాగానే వుంది."

"కాదు నాయనా ! నా దగ్గర దాచకు. నీ ఒంటో బాగుండలేదు. వైద్యుడికోసం కబురంపనా ?_"

"అహఁ — వైద్యు డక్కర్లేదమ్మా !_ దానంత టదే సర్దుకుంటుంటుంది," అంటూ చెయి కడుక్కున్నాడు.

పడుకుందుకి వెళ్ళేముందు, రోజులాగా ఇందుమతిని చూడటానికి వెళ్ళలేదు. తన గదిలోకి వెళ్ళి తలుపులు వేసేసుకున్నాడు రాఘాల్

హుక్కా తీసుకువచ్చిన నౌకరు చాలాసేపు, తలుపు తీస్తాడేమో నని చూసి, వెళ్లిపోయాడు.

*          *          *

రెండురోజులు గడిచాయి.




దివాన్‌జీ డార్జిలింగ్ వెళ్ళాడు.

ఇందుమతి పథ్యం తిన్నది

రాఖాల్ మనస్సుకిమాత్రం ఇంకా స్వస్థత చిక్కలేదు

సాయంత్రం నాలు గయింది.

రాఖాల్ అంతఃపురానికి వెళ్ళాడు.

"పద - కాస్సేపు తోటలో తిరిగివద్దాం."

"ఏం, అలా వున్నారు ?-" శంకిస్తూ అడిగింది ఇందుమతి.

"ఏం, బాగానే వున్నానే ?-"

"అహఁ - మీ కంఠస్వరం బరువుగా వుంది మీ కళ్ళు ఉబ్బివున్నాయి "

"తోటల్లోకి రా, అక్కడ చెబుతా."

*　　　　*　　　　*

తోటలో -

రాఖాల్ ఏదో చెబుదా మనుకున్నాడు. కాని, చెప్పలేకపోతున్నాడు. బ్రహ్మ ప్రయత్నం చేశాడు. అతనివల్ల కాలే.

"నామాట ఒకటి చెల్లిస్తారా ?-" అడిగింది ఇందుమతి.

"ఏమి టది ?-

"మీకు మనస్సూ, ఆరోగ్యమూ కూడా బాగుండడంలేదు. పదహారేళ్ళు ఎక్కడెక్కడో తిరిగి, హఠాత్తుగా రావటంవల్ల ఈ వాతావరణం మీకు సరిపడినట్టులేదు. మీ మనస్సు ప్రశాంతంగాలేదు. మనం కొన్నాళ్లపాటు పశ్చిమప్రాంతానికి వెళ్ళివద్దాం. అత్తగారుకూడా తీర్థయాత్రలు చేసుకురావా లంటున్నారు. నెలా నెలాపదిహేనురోజులు అలా తిరిగివద్దాం, ఏమంటారూ ?"

"ఆఁ ? -" అని ఉలిక్కిపడ్డాడు, ఏదో ఆలోచనలో వున్న రాఖాల్,

"ఏమంటారూ ? - వెడదామా ? -"

''ఎక్కడికీ ? -''

"నే నింత సేపూ చెప్పింది వినలేదా ? -

''నేను వేరేసంగతి ఆలోచిస్తున్నా; ఏం చెప్పావ్ ? -"

ఇందుమతి మళ్ళీ చెప్పింది.

అంతా విని, ''సరే చూదాం" అని వూరుకున్నాడు రాఖాల్.

ఇంకా రాఖాల్ ఆలోచన తెగలేదు.

* * * *

టంగ్‌మని గడియారం ఒకటి కొట్టింది.

బయట ఏదో అడుగుల సవ్వడి వినిపించింది.

అది ఆమెకు పరిచిత మయినదే !

ఇందుమతి పమిటా అదీ సర్దుకుని, లేచి నించుంది.

రాఖాల్ లోపలికి వచ్చాడు.

"ఇవాళ నే నింత సేపటికి జ్ఞాపకం వచ్చానా ? -" అంటూ కాస్త ఎత్తిపొడిచింది.

రాఖాల్ ఏమీ మాటాడలేదు. తల వంచుకున్నాడు.

"కూర్చోండి "

"ఉహుఁ - " అంటూ, అంగరఖాలోకి చెయి పోనిచ్చాడు.

వణుకుతున్న చేతులతో ఏదో ఉత్తరం తీసి ఇచ్చాడు.

"ఎవరిదీ ఉత్తరం ? -"

"నీది."

"ఎవరు రాశారు ? -"

"తీసి చూడూ -" అంటూ, తాగినవాడిలా తూలుతూ, బయటికి వెళ్ళిపోయాడు రాఖాల్

ఆమె ముఖం చిన్నబోయింది.

కాళ్ళూ చేతులూ వణకసాగాయి.

కవరు చించింది.

ఉత్తరం తీసింది...

*    *    *    *

"నిన్ను ఏమని సంబోధించాలో తెలీటంలేదు. నా జీవితంలో నువ్వు ఏకైక సుఖానివి, ఏకైక ఆనందానివి. కానీ, దైవవంచన మూలంగా నిన్ను నేను వంచించినవాడి నయ్యాను.

నే నేమంత చదువుకోలేదు. నా మనస్సులో దంతా పూసగుచ్చినట్టు చెప్పగల సత్తా లేదు నాకు.

పుట్టినప్పటినుంచీ నేను దుఃఖజీవిని. ఇన్నాళ్ళకి భగవంతుడు నాకు సుఖాన్ని చవిచూపబోతున్నాడు కదా అని ఆశపడ్డాను. కాని, అదృష్టాన్ని ఎవరమూ చూస్తూ చూస్తూ వదులుకోలేము.

నేను వట్టి దుర్మార్గుణ్ని, అసమర్థుణ్ని. నీపట్ల నే చేసిన అపరాధానికి క్షమాపణ అనేదిలేదు. పతివ్రత అయిన ఏ హైందవస్త్రీ కూడా నన్ను క్షమించలేదు. నీ క్షమకు నేను అనర్హుణ్ని.

నిన్ను ప్రేమించటంవల్ల సంపాదించిన జ్ఞానంవల్ల ఈ ఉత్తరం రాస్తున్నాను.

నిన్ను చూడనిక్రితం నాకు జీవితంలో ప్రేమఅంటే ఏమిటో తెలియదు. నిన్ను ప్రేమించాను కనుక మోసం చేయలేను. నన్ను పూర్తిగా నమ్మిన నీ గొంతుకను నులిమివేసేటంత అథముణ్ని కాను నేను.

ఇక – అసలుసంగతి విను

నేను భవేంద్రుణ్ని కాను. నీ భర్తను కాను; నీ భర్త పరలోకవాసి. ఆస్తిమీద ఆశతో నేను భవేంద్రుడివేషం వేసుకుని......"

...అంతే – మరి చదవలేకపోయింది ఇందుమతి. ఆమెకు కళ్ళు చీకట్లు కమ్మాయి; స్పృహ తప్పింది సోఫాలోంచి అమట్టునే చాపకట్టుగా కింద పడి పోయింది.

కొద్దిక్షణాలు గడిచాయి.

కనకలత ఆ గదిలోకి వచ్చింది

ఆశ్చర్యపోయింది

అటు ఇందుమతి! — ఇటు ఉత్తరం!!

గబుక్కున ఉత్తరం తీసి, అక్కడక్కడ చదివింది. సంగతి గ్రహించింది. దాన్ని రవికలో దాచేసి, నలుగుర్నీ కేకవేసింది.

* * * *

కనకలత తన గదిలోకి పోయి, తలుపు వేసేసుకుంది.

జాకెట్‌లో దాచుకున్న ఉత్తరం తీసి చదివింది.

ఉత్తరంలో చివర ఇలా రాసివుంది :

* * * * *

"నేను వేసుకువచ్చిన ఎత్తు పూర్తిగా ఫలించినట్టే. మాయావి నని ఎవరూ నన్ను గుర్తించలేకపోయారు. ఈ ఐశ్వర్యాన్నంతటినీ ఏ అడ్డూ లేకుండా నే ననుభవించ గలను.

అయితే – మనుష్యుల మనఃప్రవృత్తిని ప్రేమ ఎలా మార్చి వేసేదీ ఇదివరకు తెలియదు. ఇప్పుడు తెలుసుకున్నాను.

నీపట్ల నే చేసిన అపరాధాలకు క్షమాపణ చెప్పుకుని, శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నాను.

నీ జీవితం – ధర్మమార్గంలో సుఖంగా, ఖులాసాగా ఉండేలా చెయ్యమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను.

నీ దగ్గిర దాపరికం లేకుండా అన్ని విషయాలూ వెల్లడించాను.

ఇక – పెదరాణిగారితో కూడా చెప్పి క్షమాపణ కోరుకుని వెళ్ళటం భావ్యంగా వుంటుంది. అయితే – అందువల్ల ఇదంతా గొడవ గొడవయిపోతుందేమో ! – లోకం నీకు కళంకం అంటగడుతుందే ! – ఈ సంగతి క్రమక్రమంగా ఊరూరా, వాడవాడలా, దేశదేశాలా పాకిపోతుందే ! ! –

ఏదో – చేసిన ఘోరం ఏదో చేశాను. ఇంతకంటె ఎక్కువ చెయ్యలేను. నా సంగతి నీ మనసునించి తుడిచివెయ్యి. ఈ దుర్మార్గుడింక భూమిమీద ఉండడు.

ఇట్లు
రాఘాల్ భట్టాచార్య

తా. క:–

ఈ కొద్దికాలంలో నన్ను గురించి నీ మనఃప్రవృత్తి ఎలా మారిందో నాకు తెలియదు. నేను నిన్ను ప్రేమించినట్టే నువ్వూ నన్ను ప్రేమించినట్టయితే, వితంతు వివాహానికి నువ్వు సమ్మతించేట్టయితే, శాస్త్రీయంగా మనం వివాహం జేసేసు




కుందాం. నీకు అంగీకారం కాకపోతే, ఆ సంగతి తెలియగానే నే నిక్కడినించి శాశ్వతంగా వెళ్ళిపోతాను.

నా అపరాధా లన్నీ క్షమించు. ఇదే నా కడపటి ప్రార్థన.

ఇట్లు
రాఖాల్ భట్టాచార్య

* * * * *

ఈ ఉత్తరం చదివి, కనకలత ఇలా అనుకుంది: "ఇంకా నయం, ఈ ఉత్తరం అదృష్టవశాత్తు నా చేతిలో పండింది కనక సరిపోయింది. మరెవరి చేతిలో నయినా కనక పడివుంటే ఈ పాటికి గోంగోల అయిపోయి వుండేది. రాఖాల్ వెళ్ళిపోవటం మంచిదే. భవేంద్రుడికి ఇంటో మనసు నిలవలేదు. అందుకని వెళ్ళిపోయా డనుకుంటారు లోకులు. అంతే...

"అతను మనిషి అయివుండడు. ఏ దేవుడో ! – అతని పాదధూళి నా శిరస్సున ధరించా లనిపిస్తూంది..."

* * * * *

రాత్రి పది దాటింది.

గదిలో రాఖాల్ తలుపులు వేసుకూర్చున్నాడు.

ఏమీ తోచటంలే చతనికి

నిద్ర పట్టలే.

ఆపసోపాలు పడుతున్నాడు.

ఉన్నట్టుండి తలుపు తట్టిన చప్పుడు.

ఉలిక్కిపడ్డాడు రాఖాల్

"ఎవరూ - ? "

"............"

వణుకుతున్న చేతులతో తలుపులు తీశాడు.

ఒక యువతి - వితంతు లోపలికి వచ్చింది. తలుపులు వేసింది

"నువ్వు — ఎవరు మీరూ?-" అడిగాడు రాఖాల్.

"కనకలతని..."

"ఏమిటి సంగతులు ?— చినరాణికి ఎలా వుంది ?—"

"ఏం బాగా లేదు. వైద్యుడు ఆశ వదులుకున్నాడు రాత్రి గడవటం సందేహమే "

ఈ మాట వినగానే రాఖాల్ తల పట్టుకు కూచున్నాడు "చినరాణి మిమ్మల్ని నా దగ్గరికి పంపిందా ?—"

"ఉహుం— ఆమె కసలు స్పృహే లేదు మీరు ఉత్తరం ఇచ్చివెళ్ళినప్పటినించీ అలాగే వుంది. ఒకటి రెండు సార్లుమాత్రం క్షణం, క్షణంసేపు తెలివొచ్చింది."

రాఖాల్ ఏమిటో ఆలోచించసాగాడు.

"రాఖాల్ బాబుగారూ!- మీ రివాళ చినరాణిగారి కిచ్చిన ఉత్తరం అదృష్టవశాత్తూ ముందుగా నా చేతిలోనే పడింది. నేను దాచేశాను." అన్నది కనకలత.

ఆశ్చర్యపోయాడు రాఖాల్.

"మీ రెందుకు దాచారు ?-"

"ఆ వుత్తరం మరొకరి చేతిలో పడితే, ఇం కేమేనా వుందా?- పోలీసులు వచ్చి సర్వనాశనం చెయ్యరూ ?- మిమ్మల్ని సంకెళ్ళు వేసి తీసుకువెళ్ళరూ ?-"

"దాన్నిగురించి మీ కెందుకూ బాధ ?-"

"హృదయం వున్నప్పుడు బాధ కలగకుండా వుంటుందా ? నా మనస్సు రాయి కాదు...మీరు మాటిమాటికీ నన్ను 'మీరు మీ' రని ఎందుకు మన్నిస్తారు ?- నా కేమిటో సిగ్గుగావుంది. నేను తమకు దాసీనిమాత్రమే."

"నీ ఉద్దేశం ఏమిటి ?-" అడిగాడు, రాఖాల్.

కనకలత అతన్ని క్రీగంట చూసి, సిగ్గుతో భయపడుతూ, "ఈ దాసికి తమ పాదసన్నిధిని – అనంత – ఆశ్రయం – లభిస్తుందని వచ్చాను."

రాఖాల్ అసహ్యించుకున్నాడు.

"చూడండీ !– చినరాజీకి రాసిపెట్టినట్టు జరిగింది. తెల్లవారేలోగా అంతా అయిపోవచ్చు. ఇంతడబ్బూ ఎవరికి అందినది వాళ్ళు ఎగరేసుకుపోతారు. దీన్నంతటినీ మీరే ఎందుకు అనుభవించకూడదూ ? వితంతువివాహం మీకు అభ్యంతరం లేదుగా?– నేనూ బ్రాహ్మణ యువతినే. నా తలితండ్రులూ కులీనులే. మీరు వచ్చిన ఈ భవేంద్ర వేషంలోనే ఇకముందుకూడా ఉండవచ్చు ఎవరూ తెలుసుకోలేరు మనం ఉభయులం రాజవైభవం అనుభవించవచ్చు. చెప్పండి ఈ దాసికి తమ పాదసన్నిధిని ఆశ్రయ మిస్తారా ?–"

రాఖాల్ పళ్ళు పటపట కొరికాడు. కళ్ళు ఎర్రపడ్డాయి.

"నిన్ను వెల్లికిలా పడేసి, కాళ్ళురెండూ నీ కంఠంమీద పెట్టి, తొక్కి వేయా లనిపిస్తూంది. ఒక స్త్రీని ఎలాగూ హత్య చేశాను రెండో హత్యకూడా చెయ్యమని నా మనస్సు లాగుతూంది."

కనకలత లేచి నిలబడింది.

ఆమె భావభంగిమ అంతా మారిపోయింది.

"రాఖాల్‌బాబూ !– నువ్వు అలా నన్ను హత్యచేసిననాడు నా జన్మ తరిస్తుంది. కాని అదంతా జరిగేపనికాదు. మీదంతా పటికవిత్వం. ఏదీ, మీ పాదధూళి కాస్త నా శిరస్సున ధరించనివ్వండి," అంటూ చటుక్కున అతని పాదాలు ముట్టుకుంది

రాఖాల్ తెల్లబోయాడు.

"మీ ఉత్తరం చదివినప్పటినించీ మీ పాదధూళి శిరస్సున ధరించాలని తహతహలాడిపోయాను. మనుషులలో ఇంకా ఇంత మంచివాళ్ళూ, త్యాగులూ ఉన్నారని నే నెన్నడూ అనుకోలేదు నేను మీకు నా ప్రేమను వెల్లడించాలని రాలేదు, రాఖాల్‌బాబూ !– నా భక్తిని వెల్లడించుకోవటానికే వచ్చాను. మీ ముందు కూడా కాస్త నా అభినయం చూపుదామన్న ఉద్దేశంతో ఇలా కొంటెతనం చేశాను.

"నేను నియమ నిష్ఠలు గల వింతువునీ కాదు, గితంతువునీకాదు. నే నొక నటిని రంగులు పులుముకుని, రంగస్థలంమీద నిలబడి, ప్రేమగీతాలుపాడిపాడి, నాముఖంలో రక్తం ఎండిపోయింది. నే నెవరినయిందీ ఇక్కడివాళ్ళ కెవరికీ తెలీదు. ఇవాళ మీకుమాత్రం తెలిసింది. మీరు ఎలా వేషంలో వచ్చారో, నేనూ అలాగే వచ్చాను.

"నేనిక్కడికి ఇలా ఎందుకు వచ్చానో, చాలా కథ వుంది. మరొకప్పుడు చెబుతాను నేనిక్కడికి రావటం ఒకవిధంగా అదృష్టమనే చెప్పుకోవాలి లేకపోతే, ప్రపంచంలో మీలాంటివ్యక్తి ఒక రున్నారని ఎలా తెలుస్తుంది చెప్పండి ఇక్కడ నేను ఎక్కువరోజు లుండను. నేను ఉండే ఈ కొద్ది రోజుల్లోనూ మీ కేదేనా ఉపకారం చేసి మరీచే వెళతాను. మీ రిప్పు డేం చెయ్యదలచుకున్నా రిహ ? _"

"నేనిక్కడినుంచి వెళ్ళిపోతాను. ఎక్కడికో ఇంకా నిర్ణయించుకోలేదు."

"అయితే _ రాఖాల్‌బాబూ ! _ నా కోరిక ఒకటి చెల్లిస్తారా ? _"

"ఏమిటీ ? _"

"మీరు వెళ్ళేముందు ఒక్కసారి నన్ను కలుసుకువెళ్ళండి."

"ఎందుకు ? _"

"చాలా ముఖ్యమైన కారణ ముంది. అదేమిటో అప్పుడే చెబుతాను. ఒకవేళ మీరు నన్ను కలుసుకోకుండా వెళ్ళారంటే మీకు తెలియకుండానే అమాయకులు మరొకర్ని సర్వనాశనం చేసినవా రవుతారు."

"మీ మాటల్లో నిగూఢరహస్య మేమిటో నాకు అంతుపట్టటంలేదు."

* * * *

"నమస్కారాలు బాబుగారూ ! _"

"నమస్కారాలు. ఏమిటి, హఠాత్తుగా వచ్చారు · ఎక్కడ్నించి? _

"కలకత్తానుంచే. మీతో అత్యవసరమైన పని వుంది."

"పని వుందా ? _ సరే, అయితే స్నానం అవీ ముగించుకుని, ఫలహారం చెయ్యండి. తరవాత చూసుకోవచ్చు."

"అహఁ _ అలాకాదు. చాలా అర్జంటు పని."

"సరే ఉండండి నాకు కాస్త తీరిక చిక్కగానే మీకు కబురు పంపుతాను." అంటూ రాఖాల్ మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడు.

ఖగేంద్రుడు అక్కడే కూచుండిపోయాడు,

అరగంట దాటింది. కబురు లేదు.

ఖగేంద్రుడు విసుక్కున్నాడు, కసుక్కున్నాడు.

చివాల్న లేచి, బూట్లు టక్‌టక్‌మని చప్పుడు చేసుకుంటూ మెట్లెక్కి పైకి వెళ్లాడు.

* * * * *

ఈజీఛైర్‌లో పడుకుని ఏదో ఆలోచించుకుంటున్నాడు రాఖాల్.

హఠాత్తుగా బూట్ల చప్పుడు.

గుమ్మం కేసి చూశాడు రాఖాల్.

"బొత్తిగా తీరికలేకుండా వున్నారల్లేవుందే" అని వ్యంగ్యంగా అంటూ, తనూ ఒక కుర్చీ లాక్కు కూర్చున్నాడు ఖగేంద్రుడు.

"ఏం కావాలి మీకు ?—"

"నాకు డబ్బు కావాలి."

"అయితే నా దగ్గర కెందుకు రావటం ?—మీ చెల్లెలి జీతం తాలూకు ఏదైనా రావలసివుంటే, వెళ్ళి ఆమె నడగండి. దివాన్‌గారు లేరు. మేనేజరు లెక్క చూసి ఇస్తాడు."

"చిత్తం, అది కాదు. చెల్లెలి జీతం కాదు. మీ దగ్గర్నుంచే కొంత ఆశిస్తున్నాను. ఎక్కువ అక్కర్లేదు. ప్రస్తుతం ఒక లక్ష. ఆ తరవాత నెలనెలా బెంగాల్‌బ్యాంకి మీద రెండువేల రూపాయలకు ఒక చెక్కు అయితే చాలు..."

"తాగి ఏమైనా వచ్చారా ?—"

"తాగేవాడినే. కాని ఇప్పుడు మాత్రం తాగి రాలేదు. బాగా తెలివిగా ఉండే వచ్చాను.

"నేను మీకు డబ్బు ఎందు కివ్వాలి ?—"

ఖగేంద్రుడు నవ్వాడు. "నేను మీకు సోదరుణ్ణవుతాను. అంటే—దొంగకి దొంగ ఏమవుతాడో అలాంటిది మన సంబంధం. ఇంత ఆస్తినీ ఒక్కరే కాజేస్తారా ?—ఈ వేలు విడిచిన సోదరుడికికూడా కొంత వాటా ఇవ్వండి. ఇంతకీ అసలు సంగతి తెలుసా ?—"

"ఏమి టది ?—"

"మీరు భవేంద్ర చటర్జీ కాదు—రాఖాల్ భట్టాచార్య. ఖుస్రుపూర్‌లో టిక్‌టిక్ మని టెలిగ్రాంలు కొడుతూ, చక్‌చక్ మని టిక్కెట్లు అమ్ముతూ, పాతబూట్లు వేసుకుని ప్లాట్‌ఫాంమీద తిరిగే రాఖాల్ భట్టాచార్య మీరు ఇప్పటికయినా తెలిసిందా. ఇంకా టీకా-టిప్పణీ కావాలా ?—"

"ఈ సంగతు లన్నీ మీ రెలా తెలుసుకున్నారూ ?—"

"బోలెడంత శ్రమపడి, బోలెడంత డబ్బు ఖర్చుపెట్టి."

"అయితే — మీరు పడిన శ్రమ, పెట్టిన ఖర్చు అంతా వృధా."

"కారణం ?—"

"మీకు డబ్బు రాకపోవటం."

"రాదూ ?—"

"రాదు."

"రాఖాల్‌బాబూ !– ఇదంతా వట్టి బుకాయింపు అనుకుంటున్నారేమో మీరు. నేను కలకత్తావాణ్ని. చేతావాయ కాని పని చేసేవాణ్నికాను. కావాల్సిన సాక్ష్యాలూ, ఆధారాలూ అన్నీ సిద్ధంగా వున్నాయి. మీ మయినావతీ, వసంతపూరూ, ఖుస్రూపూరూ, తిన్‌తారియా మఠం, అన్నీ తిరిగాను మీ సిగ్నల్‌మానూ, గాంగ్‌కూలీలూ, తిన్‌తారియా సన్యాసులూ మీ యింటో విందులు కుడుస్తూ కూచున్నారు. వాళ్ళంతా మిమ్మల్ని పోల్చుకోగలరు. ఆనవాలు పట్టగలరు. డబ్బు ఆశ చూపి సాక్షుల్ని తిప్పు కుందుకి చూస్తారేమో. ఆ సావకాశ మేమీ నేను ఉంచలేదు అంతా విన్నారు గనుక, ఇహ తియ్యండి; డబ్బు పైకి తియ్యండి. లేదూ అంటే – కృష్ణనగర్ వెళ్ళి పోలీసులకు అంతా రిపోర్టు ఇస్తాను. మూడేళ్లు శ్రీకృష్ణ జన్మస్థానం తప్పదు. చూసుకోండి. ఇప్పుడేనా మీ అభిప్రాయాన్ని మార్చుకున్నారా ?–"

"మీరు అనవసరంగా శ్రమపడుతున్నారు. వృధాగా నన్ను భయపెడుతున్నారు. మీకు దీనివల్ల చిల్లిగవ్వంత కూడా లాభించదు. నిన్ననే యదార్ధ మంతా చినరాణిగారితో చెప్పేశాను."

ఈ మాట వింటూనే ఖగేంద్రుడు కుప్పలా కూలిపోయాడు. అతనికి నెత్తిన పిడుగు పడినట్టయింది.

"ఆఁ !–చెప్పేశారా ?–" అన్నాడు ఖంగారుగా.

"ఆ, – చెప్పేశాను. మీకు చెల్లె లవుతుందో ఏమవుతుందో, ఆ కనకలతని అడిగి తెలుసుకోండి" అంటూ రాఖాల్ నౌకరుని పిలిచాడు

"బాబుగారిని కిందికి తీసుకువెళ్లు; స్నానానికీ దానికీ ఏర్పాట్లుచూడు. వారి చెల్లెల్ని చూడాలంటే పెద్దరాణిగారికి కబురు పంపించు."

*　*　*　*　*　*　*

ఖగేంద్రుడు స్నానం చెయ్యలేదు; ఫలహారం చెయ్యలేదు; ఏమీ లేదు.

కోటుజేబులోంచి వెండిఫ్లాస్కు పైకితీసి, నీళ్ళు కలియని బ్రాందీతో గొంతు తడుపుకుంటున్నాడు.

కనకలతను కలుసుకుందికి అనుమతి వచ్చింది.

తూలుతూ తూలుతూ నౌకరు వెంట వెళ్ళాడు

"ఇలా గయిపోయా రేమిటీ ?– ఏం జరిగింది ?–" అడిగింది, కనకలత.

"తెలియదూ ?____"

"చినరాణికి అంతా చెప్పేశా నని అన్నాడు. నిజమా, అబద్ధమా ?"




"నిజమే."

మరో గుక్కెడు బ్రాందీ తాగాడు ఖగేంద్రుడు. "ఇంటోవా ళ్ళంతా విని ఏమన్నారూ ?—"

"ఇంటో ఎవరికీ తెలియదు. ఒక్క చినరాణికి మాత్రమే తెలుసు. ఏమిటిదీ ?— పరగడుపున బ్రాందీ తాగుతున్నా రెందుకూ ?—"

"మెదడుకి మంచిది. కాస్త నువుకూడా ?—"

"ఇక్కడ తాగకండి. మర్యాదస్తుల ఇంటో ఏమి టీ పనీ ?—"

"నాకు బుద్ధి అనేది నశించింది ఇప్పుడు తాను ఖవేంద్రుడు కాదని తెలిసినా చినరాణి తనని వదల దని అంతా చెప్పేసి, ఏ సివిల్ మారేజో చేసేసుకుందా మనకున్నాడు కాబోలు. వాహ్:- ఏం తెలివి, ఏం తెలివి! — కానీండి, వారంవారం 'వంగవాసి'లో మీ మీద కవిత్వం రాసి ప్రకటిస్తాను. మీరు తలెత్తుకోకుండా చేస్తా. కనకా !— నువ్వు ఎందుకూ పనికిరానిదానివి. చినరాణిచేత నన్ను పెళ్ళి చేసుకుందుకు వప్పించలేకపోయావ్ !—" అంటూ, పిచ్చిపిచ్చిగా ఏవేవో పాటలు పాడుతున్నాడు.

"ఖగేంద్రబాబు !- మీ రిలా చేస్తున్నా రేమిటి ?- మీ ఎత్తు లన్నీ విడిచిపెట్టండి. మీ కింక డబ్బు చిక్కే ఆశ ఏమాత్రం లేదు."

"ఆశ ఏ మాత్రం లేదా, ఏ మాత్రం లేదా ?—" అంటూ, కనకలతమీదికి దూకి, ఆమెను ఒక్క తోపు తోశాడు.

కనకలత కింద పడింది.

"పాపాత్మురాలి కిదే శాస్తి" అంటూ, తూలుతూ తూలుతూ లేచి, మెట్లు దిగి, మెల్లాలోకి వచ్చాడు.

చేతులు తిప్పుతూ, "వినండొహోయ్ !— వినండి !— ఎక్కడెక్కడి వాళ్ళూ వినండి ; అతను భవేంద్రుడు కాడు. రాఖాల్, అతను రాఖాల్; సురబాల రాఖాల్ పెళ్ళాం." అంటూ అరచుకుంటూ, తూలుతూ, అంతఃపురమూ కచేరీ దాటి వీధిలోకి వెళ్ళిపోయాడు.

* * * * * * *

పూజాగృలోంలోంచి పెద్దరాణి కంగారుగా పరుగెత్తుకు వచ్చింది. "ఏమని వెళ్లాడూ ? కనకలత అన్న ఏమిటీ అరుచుకుంటూ పోయాడూ?—'' అని అందరినీ అడిగింది.

ఎవరూ జవాబు చెప్పలేదు.

"ఏదీ కనకలతా ?— సురబాల ఏదీ ?— అంటూ, పిచ్చిదానిలాగా పరుగులెత్తింది.

"సురో! సురో!!— అతను మా భవేంద్రుడు కాడూ?—"

"కాదు" అంటూ ఏడ్చింది సురబాల.

"నీ భర్తా ?—"

"ఊఁ—"

"ఏదీ కనకలత ఏదీ ?—" ఆఁ కనకా !— మీ అన్నయ్య మెల్లాలో నిలబడి ఏమిటీ అన్నడూ ?—"

సమాధానం చెప్పలేదు కనకలత.

"ఆ వచ్చినతను మా భవేంద్రుడు కాడూ ?—"

"కాదు" అంది స్పష్టంగా.

సురబాల భర్తా ?—"

"ఊఁ—"

మొదలు నరికిన చెట్టులా అక్కడే కూలబడిపోయింది పెద్దరాణి.

* * * * *

ఇదుగో, హనుమాన్ సింగ్ !— నీకు కావలసిన సిబ్బందిని తీసుకువెళ్ళి, ఇంటి చుట్టూ పహరా వుంచు. అతను పారిపోకుండా చూడు" అటూ, మేనేజరు హుకుమ్ జారీచేశాడు

జమాదార్ హనుమాన్‌సింగ్ వెళ్ళిపోయాడు

రెండు గ్లాసుల నీళ్ళు గటగటా తాగేసి, చెమట తుడుచుకున్నాడు. "నే నప్పుడే సందేహించాను; కాని, నా కెందుకని ఊరుకున్నాను. పదహారేళ్ళు పత్తా లేకుండా పోయిన మనిషి మళ్ళీ ఎక్కడయినా తిరిగి వస్తాడా ?_ బాబాయ్‌గారూ ! 'బాబాయ్ గారూ!! అని పిలవగానే దివాను కరిగిపోయాడు. నేనే దివానునయితే, కళ్ళలో దుమ్ము కొట్టగలిగేవాడా ?_ ఇప్పుడే దివాను గనక ఉన్నట్టయితే ఈపాటికి గోడ దూకి పారిపోయేవాడే !_" అంటూ, మరోగ్లాసు నీళ్ళకి ఆజ్ఞ ఇచ్చాడు.

"అయిందేదో అయింది. ఇప్పు డేమిటి కర్తవ్యం ?" అని అడిగాడు, ఒక వృద్ధ ఉద్యోగి

"రాణాకి కబురు చేస్తాను" అన్నాడు మేనేజరు, హుందాగా ఖాళీగ్లాసు కింద పెడుతూ.

"సబినస్పెక్టరు వచ్చి ఆయన ఖగేంద్రుడు కాడు అనటానికి ప్రమాణా లేమిటని అడిగితే ఏం చెబుతారూ ?_ఆ తాగుబోతుమాటలు తప్ప మరే ఆధారాలూ లేవే ?_"

మేనేజరు వెనక్కి తగ్గాడు.

'ఒకవేళ ఆ తాగుబోతుమాటే అబద్ధ మయితే_అ(_బాబుగారి చుట్టూ పహరా పెట్టానే! వా రేమనుకుంటారో ?_ రేపే నా ఉద్యోగం లాగేస్తే ?_'

"అ(.ఆ తాగుబోతు ఎక్కడికి పోయాడు ?_ అతన్నే పిలిచి కనుక్కుంటే తేలి పోతుందిగా ?_" అంటూ, ఖగేంద్రుణ్ణి వెతికి పట్టుకురమ్మని హుకుమ్ చేశాడు.

"మీరు ఒకసారి మన పెద్దరాణిగారి దగ్గరికి వెళ్ళి మాట్లాడడం మంచిది. రాణాకి కబురు పంపమంటారో, దివాన్‌గారికి డార్జిలింగు తంతి ఇవ్వమంటారో తెలుసుకోవటం ముఖ్యం" అన్నాడు వృద్ధ ఉద్యోగి.

* * * * * * *

"అమ్మా !_మేము విన్న దంతా నిజమేనా ?_"

"నిజమే."

'ఇప్పు డేమిటి ఉపాయం ?_"

"భగవంతుడు చూపించినది"

"రాణాకు కబురు పంపనా ?_ ఆయన చుట్టూ పహరా వుంచాను ._"

"రాణాకి కబురు పంపవద్దు. పాహరా వాళ్ళని తీసెయ్. అతన్ని ఎవరుగాని అవమానించటానికి వీల్లేదు. అతనికి కోపం తెప్పించకండి. అతని యిష్టం — అతనంతట అతి నెప్పుడయినా సరే, వెళ్ళనీ."

"ఇంకా హుకుమ్ ఏదేనా వుందా, అమ్మా?—"

"కోడలికి జబ్బు ఎక్కువగా వుంది. కృష్ణనగర్‌లో పెద్దడాక్టరికి తంతి యిప్పించు"

"దివాన్‌గారిని రమ్మని తంతి ఇవ్వమన్నారా ?—

"వద్దు."

* * * * * * * *

ఇందుమతికి స్పృహ వచ్చింది.

తలాపిదిక్కున కూచుని విసురుతున్న సురబాలను చూసింది.

"రాత్రంతా నువ్విలాగే కూచున్నావా ?—"

"లేదు. నేను వచ్చి ఎంతోసేపు కాలేదు. పెద్దరాణిగారు స్నానానికి వెళ్ళేముందు నన్నిక్కడ కూచోబెట్టారు. ఆవిడ ఈ రెండురోజులూ స్నానమూ, భోజనమూ ఏమీ చెయ్యలేదు

"రెండురోజులా ?—నాకు సుస్తీ ప్రారంభమై ఎన్నాళ్ళయిందీ ?"

"మొన్న మధ్యాహన్నం మీరు హఠాత్తుగా మూర్ఛ వచ్చి పడిపోయారు."

ఇందుమతి కళ్ళలో నీళ్ళు నిండాయి,

"నిన్న డాక్టరుగారు........."

ఏ డాక్టరుగారూ ?—ఎప్పుడు వచ్చారూ ?—''

''మొన్న సాయంత్రం కృష్ణనగర్‌నించి వచ్చారుగా ?—డాక్టరుగారు. ఆయన, మీకు కాస్త కులాసా చిక్కగానే గాలి మార్పుకి తీసుకువెళ్లాలని చెప్పారు.''

''ఇంక ఆ అవసరం లేదు."

"ఎందుకని ?"—

''అంతా విన్నావుగా ?—ఇంకా నేను బతికి ఏం ప్రయోజనం ?—ఈ కళంకిత జీవితం ఎంత త్వరగా ముగిస్తే అంత మంచిది కదూ ?—"

"మీ రెందుకు అలాఅనుకోవటం ?—మీ దోషం ఏమీ లేదే ?—''

''అంతా నా అదృష్ట దోషం..."

"శిలా విగ్రాహాన్ని దేవుడుగా భావించి పూజిస్తూ వుంటాం ఆ పూజ రాతికి చెందుతుందా, దేవుడికి చెందుతుందా ?—అలాగే మీరు మీ దేవుణ్ణి పూజించారు."

ఇందుమతి కళ్లు మూసుకుంది

''సరే, ఆలోచించిచూస్తాను ... అవు నవును ... సరిగ్గానే చెప్పావు. అవును గానీ—నా కొక పని చేసిపెడతావా ?—"




"చెప్పండి "

"ఆ బీరువాలో కుడివేపు సొరుగులో ఎడంవేపు మూలగా దంతప్పెట్టె వుంది. దాన్నిలా తెచ్చిపెట్టు."

సురబాల తీసుకువచ్చింది

దానిని ఇందుమతి ఎంతో ఆప్యాయంగా గుండెలకు హత్తుకుంది.

"ఇందులో ఏ ముందమ్మా ?—"

పెట్టె మెల్లగా తెరిచి, అందులో కట్టిపెట్టివున్న పట్టురుమాలు విప్పింది. అందులో రంగురంగుల పావు లున్నాయి.

"ఏం పావులమ్మా ఇవి ?— "

ఇందుమతి ముఖంలో చిరునవ్వు తొంగిచూసింది. "పెళ్ళినాటి మర్నాడు— పూలపాన్పుకు ముందురోజున పావులు పెట్టి ఆడతారుకాదూ ?— ఇవి ఆనాడు మేం ఆడుకున్న పావులు "

సురబాలకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

*    *    *    *    *    *

పెద్దరాణి రాకకోసం ఎదురుచూస్తున్నాడు రాఘాల్

ఆవిడ వచ్చింది, కానీ. కూచోలేదు.

రాఖాల్ ఒక్కొక్క అడుగే ముందుకు వెళ్ళాడు. తల నేలకి ఆన్చి నమస్కరించాడు "నా అపరాధా లన్నిటినీ క్షమించండి" అని మాత్రం అనగలిగాడు. తల వంచుకుని. అవిడ కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

రాఖాల్‌కు దుఃఖం ఆగిందికాదు. నీళ్ళు నిండిన కళ్ళతో, "మిమ్మల్ని 'అమ్మా!' అని పిలిచే అర్హత నాకు లేదు. నేను మహా పాపిని. మీ పాదధూళి తీసుకుని శాశ్వతంగా సెలవు తీసుకుంటాను" అన్నాడు.

పెద్దరాణి పెదవులు కంపించాయి, "నాయనా !—" అని మాత్రం అన్న దామె. కొంగు ముఖానికి అడ్డం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది

"అనుకున్నంత నిర్భాగ్యుణ్ని కాదు నేను. 'నాయనా!' అని నన్ను పిలిచి, 'అమ్మా!' అని పిలిచే అధికారాన్ని నాకు ప్రసాదించారు. అమ్మా !— ఇహ వస్తాను, సెలవు..." అని మళ్ళీ తల నేలకి ఆన్చి నమస్కరించాడు.

"వెళ్ళిరా నాయనా !— నీ మనస్సు న్యాయమార్గంలో ఉండాలనీ, నువ్వు మళ్ళీ సుఖంగా వర్ధిల్లాలనీ ఆశీర్వదిస్తున్నాను" అంటూ, ఆమె గుమ్మంవేపు వెళ్ళి వెనక్కి తిరిగింది, "కొంచెం ఆగు— కనకలత వచ్చి నిన్ను కలుసుకుంటుంది" అని ఆమె వెళ్ళిపోయింది.

* * *

"మీ రివాళే వెళుతున్నారా ?" అడిగింది కనకలత.

"సాయంకాలం రైలుకి వెళతాను చినరాణీగారి కెలా వుంది ?"—

"కులాసాగా వున్నట్టే. కాని, నేను మాత్రం అలా అనుకోను."

"మరి—ఎల్లుండే తీర్థయాత్రలకి బయల్దేరుతున్నారని విన్నాను ? ఇలా వున్నప్పుడు ప్రయాణం తలపెట్టడం మంచిదేనా ?—

"మే మంతా చెప్పిచెప్పి నెగ్గలేకపోయాం. ఇంక ఇక్కడ వుండటం ఆమె కెంతమాత్రం ఇష్టంలేదు."

"ఎక్కడికి వెళ్తారూ ?—"

"కాశీ ... ... ... మీ రెక్కడికి వెళ్తారూ ?—" అడిగింది కనకలత.

"కలకత్తా వెళుతున్నాను. తర్వాత అక్కడినుంచి మరెక్కడికయినా వెళ్తాను."

"అవునుగానీ — లీలావతి ఇక్కడ వున్న సంగతి మీరు విన్నారా ?—"

"ఆఁ — విన్నాను."

"ఆమె కేమిటి ఏర్పాటు చేశారు ?—"

"దాని ఏర్పాటదే చేసుకోగల్దు దానికి నే నేం చెయ్యగలను?—అన్నీ మీకుతెల్సుగా?—"

"నాకు తెలుసు. కానీ, మీకు తెలియదు. లీలావతి సంగతి నాకు తెలుసు. ఆమెను గురించి మీ రింకా ఎదో భ్రమలో వున్నారు. మీ భార్య ఉత్తమ ఇల్లాలు. అయితే కాస్త పెత్రిబాగులది. ఏదో తెలివితక్కువవల్ల ముప్పు తెచ్చుకుంది, అంతే నే నేదో కథ అల్లుతున్నా ననుకుంటున్నారా ?— అదేం కాదు మీకు దాఖలా కావాలంటే ఇవిగో—"అంటూ, ఖగేంద్రుడు తనకి రాసిన ఉత్తరాలు ఇచ్చింది.

ఉత్తరా లన్నీ చదివాడు రాఘాల్. ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఏమి టాలోచిస్తున్నారూ ? ఇం కేమైనా సందేహం వుందా ?—"

"పెద్దరాణిగారి కివంతా తెలుసా ?—"

"ఆఁ— ఆవిడకు ఇప్పు డన్నిసంగతులూ తెలిశాయి "

"అయితే—ఈ విషయంలో ఆవిడ ఉద్దేశ మేమిటి ?—"

"ఆవిడ చేష్టలను బట్టి మీ రింకా ఆవిడ అభిప్రాయం తెలుసుకోనేలేదా ?—"

"ఏమి టది ?—"

"నన్ను కలుసుకోమని మీకు చెప్పివెళ్ళలేదా ?—"

"ఆఁ—ఆఁ—అవును, నిజమే. అది సరేగానీ, పెద్ద రాణిగా రేమన్నారూ ?—"

"ఏమంటారూ ?—అన్ని సంగతులూవిని, మీ ఆవిడ తెలివితేటల్ని ప్రశంసించారు."

"అది కాదు......"

"అవును, అర్థమయింది. లీలావతి నిర్దోషి అని తెలిశాకకూడా ఆమెను వదిలిపెట్టి, ఆమెకు అన్యాయం చెయ్యడు. రాఘాల్ అంతటి అధర్మం ఎన్నడూచెయ్యడు"అన్నారు.

'నువ్వు మళ్ళీ సుఖంగా వర్ధిల్లు' అని దీవించిన పెద్దరాణి మాటలో అర్థం ఇప్పుడు స్ఫురించింది రాఘాల్‌కి.

* * * *

ఆరోజు మధ్యాహ్నం బాళులీపాడా జమీందారుగా రింటినించి రెండు మేనాలు బయల్దేరి వెళ్ళాయి.

* * * *

బెంగాల్ - నాగపూర్ లైన్‌లో రాఘాల్ భట్టాచార్య మళ్ళీ అసిస్టెంటు స్టేషన్ మాష్టరుగా కుదురుకున్నాడు.

రెండునెలల తరురాత ఒకనా డతని కొక ఉత్తరం వచ్చింది. అది లీలావతికి కనకలత రాసిన ఉత్తరం.

రాసపూర్ణిమనాడు చినరాణి ఇందుమతీదేవి కన్ను మూసిందిట. ఆమె కోరిక ప్రకారం ఆ పావుల్నికూడా ఆమె చితిమీద ఉంచారుట !—



"ఇప్పుడిప్పుడే ఈజిల్‌మీంచి తీసుకొచ్చిపెట్టిన చిత్రమండి ఇది; రంగుముద్దలు ట్యూబుల్లోంచి పిండినవి పిండినట్లే ఉన్నాయి చూడండి పచ్చిపచ్చిగా!..."
"అందుకే దీన్ని నే కొనబోతూంట! ఏమైనా చవగ్గా కిడితే—ఈ రంగుముద్ద ల్తోనే ఒకడజను చిత్రాలు నే వేసుకుందామని...!"



"ఒకవెయ్యి చపాతీలకి ఏమాత్రం పిండి ఉండా అంటావు?......"
"వెయ్యిచపాతీ లెందుకండీ!? ఏదైనా విందు చేస్తారా ఏమిటి?"
"అదేంలేదులే! మరే మన ఇంటికప్పు బాగుచేయ్యాలిగదా, పెంకులకు బదులు నీచేత చెపాతీలు చేయించి నేయించితే దిట్టంగా ఉంటుందని......"




బలివాడ కాంతారావు

అచ్యుతరామయ్య రాస్తూ రాస్తూ మధ్యను వాక్యం పూర్తి కాకుండానే కలంవేపు చూస్తూ ఆపేశాడు. కంటికి కనిపించేది కలం కాదు — కొడుకు ఆ కొడుకు యెలావుంటాడో వూహించుకోగా మనసులో యేర్పడిన ప్రతిబింబం అది

టేబిల్ లాంపు స్విచ్చి ఒక్కసారి టప్‌మని ఆర్పి బాధగా ఆ టేబిలుమీద తలదించేశాడు ఇంట్లోవున్నది ఒక్కడే. భార్య ముగ్గురు కూతుళ్ళను పట్టుకొని కన్నవారింటికి పురిటికి పోయింది రోజుకు రోజు నాల్గోసంతానం కొడుకు తప్పక అవుతాడన్న ఆశ పెరిగిపోతోంది గానీ యీ నాటికీ యింకా వార్త అందలేదు ఈ వేళ సాయంత్రమే ఆఫీసులో తోటివాళ్ళు అనుకోగా పరోక్షంగా విన్నమాటల్లో సత్యం వుంటుందనే భావన తననిలా స్విచ్చిని ఆర్పనిచ్చింది

దోచినవాళ్ళందరికీ ఆడపిల్లలు పుట్టేస్తున్నారా ? ఈసారి తనకు ఆడపిల్ల వుట్టే యేం చేస్తాడు? దీనికి జవాబు రాకండానే చీకటిలో మనసు కొద్ది క్షణాలవరకూ బేజారైంది

పరుపుమీద చారబడి అటూయిటూ దొర్లుతున్నాడు గతం జ్ఞప్తికి తెచ్చుకోకూడదనుకున్నా వీలుపడటంలేదు. గతం పునాదై మనిషి యొక్క ప్రస్తుతాన్ని యింటిగా నిలువనిస్తుంది. గతం మరచిపోలేని మనిషి కూలిపోతాడు. పై అంతస్థులాంటి భవిష్య

త్తును వెయ్యాలంటే గతం దిట్టంగా వుండి ప్రస్తుతం అందంగా గట్టిగా వుండాలి మనిషి సైకిలులా కోరికల క్రాంక్ చక్రపు కోణాలమీదనించే కదలాలి అప్పుడే యీ జీవితపు సైకిలు ముందుకుపోతుంది ఎప్పుడైతే గొలుసు జారిందో సైకిలు ఆగిపోతుంది ఆ గొలుసు యెందుకు జారుతుంది? అరిగిపోతే – కోరికల ఆవేశంతో అతి వేగంగా త్రొక్కితే తన జీవితం యింకా అరిగిపోలేదే? కోరికలు హెచ్చయ్యాయా?

ఈ రాత్రికి అచ్యుతరామయ్యకు ఆలోచనలే ఆహారమైపోయాయ్ తనకు జ్ఞప్తికి వున్నవరకు మొదటి కోరిక పదేళ్ళ వయసులో కలిగింది. తన తండ్రి వూరిలో బడిపంతులు మందడు పిల్లలతో యెప్పుడూ బ్రతుకు భారం మొయ్యలేక వదులుతున్నట్లు బాధగా విచారంగా వుండేవాడు. అతను ఒకరికి అన్యాయం చేసే అవకాశాలు దొరకలేదు. అందుకే కామోసు అతను యెప్పుడూ కొడుకుతో నీతి వాక్యాలు చెప్తుండేవాడు నీతిని గరపే గ్రంథాలు చదివిస్తూండేవాడు పదేళ్ళ వయసులో వూరికామందుల బిడ్డ షరాయి తొడుక్కొని పట్నంనించి వస్తే తనకు షరాయిమీద మనసు పుట్టింది. తనకు అప్పటికి చెడ్డీలే అదైనా ఒక్కటే వుండేది రాత్రుళ్లు గోచీ కట్టుకొని చెడ్డీ వుతుక్కునేవాడు మేనమామ ధర్మమా అంటూ పట్నంలో స్కూలు ఫైనలు వరకూ చదివే అవకాశం కలిగింది పట్నంలో వున్నప్పుడు తన కెన్నెన్నో కోరికలు కలిగాయ్ తనకు సిలక వుండేది నలుగురిలా క్రాఫింగ్ వుంటే బాగుండేదన్న కోర్కె, తండ్రి గతించాక, గుండు చేసాక గానీ తీరలేదు బలమైన కోరికలు యౌవనంలోగానీ రాలేదు. వచ్చినవి తీర్చుకొనే వుపాయం, సమర్థత లేదనుకున్నాడు తన తండ్రి పిల్లలతో యెంత బాధగా బరువుగా గడిపాడో, పిల్లలు లేకండానే తనకు జీవితం బరువై పోయింది. తండ్రి వుండగా చిన్న వయసులో కట్టపెట్టిన యిల్లాలు కాపరానికి వచ్చేసరికి అష్టవంకరలతో వుండేది. అతను సాంప్రదాయం గుణగణాలు చూసుకున్నాడు గానీ అందం కొరుక్కు తింటామా అని అందంగురించి ఆలోచించనేలేదు. ఈలోగా పట్నంలో ఆడవాళ్లనీ- సినిమాలోని హీరోయిన్లనీ చూసిన అచ్యుతరామయ్యకు అందమైన భార్య కావాలన్న తహతహ యింతా అంతా కాదు పెళ్లాంతో కాపరం చేస్తున్నా తనలో తిష్టవేసుకున్న యీ కోర్కె భార్య తొలికాన్పులో గతించాక గానీ తీరలేదు తను యీసారి యెంచుకొని తెల్లని పిల్లను చేసుకున్నాడు.

తన ప్రతికోరికా కొనసాగడానికి ఒక విషాదసంఘటన జరగటం తనకు కష్టమనిపిస్తోంది. సుఖాలతో కోరికలు తీరితే అనుభవం హాయినిస్తుంది.

కష్టాంతో కోరికలు ఫలిస్తే ఆ అనుభవంలో కన్నీరు వుంటుంది. ప్రతి కోర్కె యిలా తీరగానే అంతకంటే బలీయమైన కోర్కె లేవో మనసులో పుట్టున్నాయ్. అరటి గెల వేసింపని చెట్టు నరకగానే ప్రక్కనే యింకో చెట్టు తయారు; అదిపోతే యింకోటి— మనిషి మనసులో కోరికల దుంప అలా నిత్యం కోరికలను మొలిపిస్తుంది కామోసు! అందమైన భార్య కావాలనుకున్నాడు—వచ్చింది. ఆవిడ వుండటానికీ, ఆమెతో విచ్చలవిడిగా విహరించటానికీ సరియైన యిల్లేదీ? కంపు వీధుల్లో, జనం కిటకిటలాడుతున్న కొంపల్లో, వెలుతురూ, గాలీ సోకని నాలుగు గోడల నరకకూపాలలో ఆనందించటానికీ, ప్రేమను ఆస్వాదించడానికీ తనలాంటి గుమస్తాకి ఆస్కారం యేదీ? ఎబ్బెట్టుగా వున్నా సినీమాల్లో చూపిస్తున్న ప్రేమవిహారాలూ, బాహాటంగా పార్కుల్లో ప్రేమకలాపాలూ, అందమైన మేడల్లోని కామవికారాలూ అంతా తనకు నచ్చేవి. భార్యతో పదేపదే చూసి పొందిన హాయి హాలు వదలగానే అలాంటి విహారాలు సల్పలేకపోయామన్న బాధతో కోరికలను కొల్లలుగా సృష్టించేవి. అతను గతంలో నేర్చుకున్న నీతివాక్యాలింకా యీ కోరికల గుర్రాలు పరుగెత్తకుండా అడ్డుగోడల్లా వుండేవి. తన పరిసరాల్లో అంతా అన్యాయం చూశాడు. అలాంటిది తను న్యాయంగా పోయి కోరికలు తీర్చుకోవటం అసాధ్యం అనిపించేది. సుఖం అన్నది కోరికలు చంపుకోవటం వలన యెన్నడూ రాదు, కోరికలు కొనసాగించుకోవటంలో చూపించిన ప్రజ్ఞబట్టి వస్తుంది. తనదగ్గర బిల్లులు పాస్సుచేయించుకోడానికి వచ్చిన కంట్రాక్టరు, అతనిదగ్గర డిమాండ్ చెయ్యగలిగే ఆఫీసరు, ఆఫీసరుక్రింద హెడ్ గుమస్తా — హాయిగా బ్రతుకుతున్నప్పుడు — యింత కష్టపడి బిల్లులు తయారుచేసే తనెందుకు సుఖపడకూడదూ? న్యాయంగా పోయేవాడికి అన్యాయం చేస్తే బాధగా వుంటుంది? అన్యాయంగా దోచేవానిదగ్గర పుచ్చుకుంటే న్యాయమే అవుతుందని అచ్యుతరామయ్య "నా సంగతి ఆలోచించారా?" అన్నాడు ఒకరోజున.

కంట్రాక్టరుకు ఆశ్చర్యం వేసింది. 'ఈ ఆఫీసులో యితనొక్కడే మడికట్టుకున్నవాడనుకుంటే అతనూ మనలో చేరా' డని.

"ఉంచండి...." అంటూ డబ్బు అందిచ్చిననాడు అచ్యుతరామయ్య

శరీరమంతా వణికిపోయింది ఆ రాత్రి జ్వరం వచ్చేసింది. ఒంట్లో బాగు లేనప్పుడు ఆ డబ్బే ఖర్చు పెట్టాడు అదేంటో తన కోరికలు కష్టాలతోనే తీరటం మామూలై పోయాయ్

కోలుకున్నాక రెండో బిల్లు ప్యాస్ చేసేటప్పుడు కంట్రాక్టరు మరికాస్త హెచ్చుడబ్బు యిచ్చాడు. శాకాహారి, మాంసాహారం తొలిసారిగా వాంతులు చేసుకున్నా, మళ్ళీసారి యిముడ్చుకుంటాడు. ఎప్పుడైతే యిముడ్చుకున్నాడో రోజూ మాంసం కూర వుంటేగానీ తిండి యెక్కించలేదు. అతనికి డబ్బుమీది ఆశ కొత్తగావచ్చిన వాడికొమ్ములై పోయినాయ్. నర మాంసం మరిగిన పులి గ్రామాలమీద పడి మనుషులను యెత్తుక పోయి భక్షించినట్లు అతను లంచాలు భక్షించ సాగాడు ఈ భక్షణం అంత సులువు కాదు ముళ్ళకంపల మీదనించి దాటాలి అవసరమైతే మురికికూపాల్లో నక్కివుండాలి చీము లున్న చెల్లగ బ్రాకాలి బురదగోతుల్లో గెంతాలి. గొంగళిపురుగులా ప్రాకాలి పులి మేకలా లంచం అగపడినా, యెవడు తుపాకి పట్టుకి యేమూల నక్కివున్నాడోనన్న భయంతో గుండె బితుకు బితుకు మంటోంది

పొద్దు మునిగితే యెక్కడిపిట్ట అక్కడ చేరుకున్నట్లు తను ఆఫీసు నించి తన స్వంతయింటికి వచ్చానన్న తృప్తికోసం ప్రొద్దాక సింగారం మానుకొని స్వంతకొంపను లేవదీసాడు తను కోరుకున్నట్లు యిల్లు అన్ని హంగులతోనూ కట్టించాడు మేడమీద పడగ్గది – వెన్నెల్లో విహరించడానికి డాబా, డాబా మీద గోళాల్లో పూల మొక్కలు, ఆ మొక్కల్లో మొగ్గలుతొడిగిన సన్న జాజి తివ్వ, అంగట చిన్న కాంపౌండు – అందులో పచ్చ గడ్డిచుట్టూ నాట్యం చేస్తున్నట్లు కదిలే రకరకాల శృంగారం తొణికిసలాడు మొక్కలు; అచ్చంగా తను సినీమాల్లో చూసిన యిల్లులాగే అన్ని వసతులతోనూ కట్టించుకున్నాడు. ఇల్లు చేరేసరికి భార్య యిద్దరిపిల్లల తల్లి ఐంది. ఆమె ప్రేమ మూడు భాగాలైంది.

ఇదివరకు కంపు వీధుల్లోవున్న చిన్న యిళ్ళల్లోనే ఆమె తనకు తీగలా చుట్టుకోనేది ఇప్పుడు ప్రక్కకు చేరటానికి యెన్నో అవధులు దాటాలి అంతే కాకుండా డబ్బు గడించాలి యిల్లు కట్టించాలన్న తన ఆరాటం తన ఆరోగ్యాన్ని చాలావరకు మింగివేసింది. శృంగారానికి సుముఖంగా చేసే ఘడియలు అతనికి యెప్పుడోగాని రావటంలేదు

దానికితోడు లంచం తినటం అంటే శనగలు తిని చెయ్యి కడుక్కోవటం

కాదు రంకూబొంకూ యెలాదాగదో తిన్న లంచం అలానే దాగదు రంకు పోయేవాడ్నీ, బొంకేవాడినీ, అలాంటి చిన్నె లున్నావాళ్ళే తాము యేమీ యెరగని అమాయకులు అనుకొని దుయ్యబట్టారు. అచ్యుతరామయ్య యిల్లు, సంపదను చూసి అలా బైలుకు వచ్చినవాళ్ళే యెత్తిపొడుపు మాటలాడి పౌరుషం తెప్పించేవారు. పౌరుషానికి వెంటనే మంగలికత్తి మింగలేక పోయినా అతను పడకగదిలో కుప్పిగంతులు వేసేవాడు "నాకున్న బానకడుపు నింపడానికి వున్న సూది మెడను పెద్దది చేసుకొని సుఖిస్తుంటే వీళ్ళందరికీ యీ కన్నెర్ర యెందుకూ? వీళ్ళలాంటివాళ్ళే నా పిలకను చూసి వెక్కిరిస్తే క్రాపింగు వుంచాను. క్రాపింగు చూసి వెళాకోళమాడారు నా మొదటిభార్య అష్టవంకర్ల గాడిదంటే యింకో సురూపమైన గుజ్జాన్ని తెచ్చాను అప్పుడు దీనిని సూర్పణఖ మేనగోడ లన్నారు. ఇంత అందమైన యింటివేపు చూసి మురిసే బదులు నేను నాలుగు చేతులతో దోచి కట్టించా నని నాకు శృంగభంగం చెయ్యటం యెందుకూ ?" అనుకున్నాడు.

రోజుకురోజూ అచ్యుతరామయ్య పాదంలో పుట్టిన పుండు పైకెగబ్రాకి పోతోంది. చిన్ననాడు తండ్రి నూరి పోసిన నీతులు తన రక్తంలో యింకా ప్రవహిస్తూనే వున్నాయి ఆరోగ్యం



ఢీ గొడిస్తూం టే తాత్కాలికంగా సీసాపై బిరడా బిగించినా ఒకనాడా బిరడా ఎగిరిపోయింది. మనసులో వేళ్ళు పాతుకున్న నమ్మకాలూ, భావాలూ, చంపటం అంత సులువు కాదు. ఇన్నాళ్లూ నీతులూ నమ్మకాలూ పండిస్తున్న చెట్టును నరికినా అది మళ్ళీ చిగురు పెట్టింది. ఆ చిగుళ్ళు కొమ్మలైనాయ్.

కొమ్మలకు పూలు పూసి ఆపూలపై తుమ్మెదల ఝుంకారం వినిపించగానే అచ్యుతరామయ్య మేల్కొన్నాడు. ఇన్నాళ్లూ తను కుంభకర్ణుడిలా నిద్రపోయి జగమంతా చీకటే అనుకొన్నాడు. తెలివి రాగానే వెలుగు చూశాడు. ఆ వెలుగులో పూలు కాయలై కాయలు పళ్ళయ్యాయ్. మళ్ళీ తన నమ్మకాలు నీతులు తనలో ఫలించగానే తను ముళ్ళకంపలో చిక్కుకున్నానని, యీ భోగభాగ్యాలు తనకు శునకానికి సూడిద లాంటివని తోచింది. సోదెకు పోతే రంకు బైట పడినట్లు సుఖానికి పోతే తన బండారం బైటపడిం దని విలపించాడు. అన్యాయంగా బ్రతికేవాడ్ని దేవుడు పైకి బాగా లేవనెత్తి భోగభాగ్యాలతో సంతోషంగా గడిపేటప్పుడు ఒక్కసారి క్రిందకు విడిచిపెడ్తా డన్న విషయం మరచినది జ్ఞప్తికి వచ్చింది. అలుడికి బలుడు, బలుడికి బ్రహ్మదేవు డన్న న్యాయంతోనే ప్రపంచం పరిభ్రమిస్తోం దని తనకు నమ్మకం కలిగించే యెన్నో సంఘటనలను చూశాడు. మంచివాళ్ళ కష్టాలు, చెడ్డవాళ్ళ అదృష్టం దేవుని దయవల్లనే వస్తాయ్. మంచివాళ్ళు కష్టాలతో అతనిదగ్గరగా చేరుకుంటారు. చెడ్డవాళ్ళు సుఖాలతో అతనికి దూర మౌతారు.

దిగులుతో అచ్యుతరామయ్య గుండెజబ్బు తెచ్చుకున్నాడు. అతన్ని చూసినవాళ్ళు తనివితో లావెక్కాడన్నారు. ఇలాంటి పరిస్థితిలో భార్య నాల్గో పురిటికి కన్నవారింటికి వెళ్లింది. నిద్దరపోలేని అచ్యుతరామయ్య డాబా మీదకు వచ్చాడు. నడినెత్తిన చందమామ యినుకపర్రమీద పడిన వజ్రంలా గున్నాడు. ఆ పర్రను అంటుకొని వున్న ఆకాశంలో అక్కడక్కడా వెలుగుతున్న చుక్కలు లంగరు దించిన ఓడల్లా వున్నాయ్. డాబామీది చివురు పెట్టిన గోరింటలు చిన్నారి చామంతులు కొత్తపూలు ముడుచుకొని వయ్యారంగా కదులుతూ ఆలోచనలు కలిగించాయ్. అందాన్ని చూసి ఆనందించాలని వేసుకున్న మొక్కలు మౌనంగా ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాయ్. వీటి కున్న స్వాభావికమైన అందాలకీ, పరిమళానికీ కారణమేమిటి? నీరూ, గత్తంతగలగా నేవిజృంభించిన యౌవనంతో వేస్తాయ్. ఆలాగే మనిషి ఆకలిదప్పులు తీరితే స్వాభావి

కంగా పెరుగుతాడు. కోరికలులేకుండా మనిషి పుట్టాడు కోరికలు తీరకండానే లగ్గవుతాడు.

న్యాయంగా ఆకలిదప్పులు తీర్చుకున్నవాని మనుసు వెన్నెలై. మాట పిడుగులా వుంటుంది ఆ గిర్వం తన కెందు కుండకూడదూ? ఒకనాడు తెల్ల కాగితంలా నున్న తన జీవితం మీద నల్లసిరా ఒలికినట్టు, తెల్లని కమీజుపై నల్లని గుడ్డవేసి కుట్టినట్టు అనిపించింది తప్పులు చేశానన్న తలపులు గుండెలో గుట్టపు డెక్కల్లా కదలజొచ్చయ్.

తనకు యింకో కూతురు తప్పదన్న నిస్పృహా అతనిచే చేతులను జోడింప జేసి "దేవుడా! నాకేగాని కొడుకు పుట్టే యిదిగో నా భార్య చేతి గాజుల తోడు, నుదుట కుంకుమ తోడు, నల్ల పూసల తోడు, కాళ్ళ మట్టెల తోడు-నేను లంచాలు తినను నా కొడుకును యీ అన్యాయార్జితంతో కట్టిన మేడలో పెరగనివ్వను. యిందులో పెరిగితే వాడికి ఆ గాలే సోకుతుంది. వాడు చావుఘోష వినే సమయానికి యెన్నో నోములు నోస్తేగాని పొందని మానవజన్మవ్యర్థమైందని విలపిస్తాడు."

ఇలా చెయ్యరాని సత్యాలుచేశాడు అచ్యుతరామయ్య. ఇం వరకు దిగులు దెబ్బలు తిని ముడుచుకుపోయిన హృదయం వికసించింది సముద్రానికి గట్టులా తన కల్లోలానికి యీ వూహాలు గట్టువేశాయ్. మనసులో పోయిపోయి పాటువచ్చింది తిరగరానిచోట్లన్నీ తిరిగి మళ్ళీ స్వగ్రామం వచ్చినట్లనిపించింది.

ఆ మరసటిరోజు ఆఫీసుకు వెళ్ళక ముందు టెలిగ్రాం వచ్చింది వణికే చేతులతో టెలిగ్రాం విప్పాడు

"కొడుకు!"

"హాఁ...నాకు కొడుకే. దేవుడు యెంత దయామయుడు"- అచ్యుత రామయ్య కాళ్ళు ఒక్కదగ్గర నిలువ లేదు శివమెత్తినట్లు ఇంట్లో "కొడుకు-నాకు కొడుకు-నాయింటి దీపం-నా కొడుకు" ఆఫీసు మరచిపోయి కదలి పోతున్నాడు అప్పుడే బంట్రోతు యీ వార్త ఆఫీస్సు మోసేసాడు ఆవేశంతో పొంగిన నరాలింక చల్లబడలేదు-పెద్ద ఘరానా కంట్రాక్టరుని చూడగానే ముఖం తిప్పేశాడు

అతని కా విషయం చెప్పకూడదని భీష్మించుకున్నాడు. అతనే చొరవ చేసుకొని భోం మని భోషాణం తెరచి నంత పెద్ద నవ్వుతో ముందు కొచ్చి బలవంతాన అతని చేతులుకలిపి "కంగ్రాచ్యులేషన్సు" అన్నాడు.

"దేనికి?"

"అలా అడుగుతారేం మీకు అబ్బాయి పుట్టాడుగా!"

"మీ కెలా తెలుసు?"

"మీ కోసం ఆఫీసుకెళ్తే తెలిసింది"

తన ఆనందప్రవాహానికిస్వలాభంతో బంఢరాళ్ళ ఆనకట్ట కట్టిన యీ

వ్యక్తిని వదల్చుకుండా మన్న తన ప్రయత్నం వ్యర్థమైంది. కుర్రాడు ముక్కూ మొఖం చూడకుండానే కంట్రాక్టరు వర్ణించేస్తున్నాడు

"ఈ బుల్లయ్య, మీకు అదృష్టం తెస్తాడు ఇప్పుడు యెలాగా హెడ్ గుమస్తాగా యాక్టింగు చేస్తున్నారుగా—ఖాయం కావటం తప్పదు మంచి రోజు లన్నీ ఒక్కసారిగా వస్తాయండీ అనుభవించాలి" ఇంతలో వాళ్ళ ముందుగా డ్రైవరు ఒక పేకెట్టు తెచ్చి పెట్టాడు

"ఇదేంటీ?"

"మన బాబుకోసం— మీకు ఆక్కడికి పంపించటం శ్రమని తోస్తే మా కారుమీదే పంపిస్తాను"

"నా కక్ఖర్లేదు తీసుకపోండి"

ఈ మాటలతో షాక్ తిన్న కంట్రాక్టరు పళ్ళద్దాలు కిందపడ్డయ్. ఎదురుగ నున్న వ్యక్తి ఆకారం గజిబిజి అయిపోయింది

"ఎవరు? తను మాటాడుతున్నది కొండలు మింగే అచ్యుతరామయ్య గారితో నేనా?" అన్న సందేహం తనలో కలిగింది తమాయించుకొని "మాకు చేసిన వుపకారానికి యిదేమాత్రం—అబ్బాయి ఇక్కడికి రానీయండి దొరల పిల్లలకు త్రిప్పే బండి ఒకటి అప్పుడే ఆర్డరు యిచ్చాను"

"నా కేమీవద్దు నాఅబ్బాయి దొరల పిల్లడు కాడు. ఒక గుమస్తా కొడుకు. గుమస్తా కున్న తాహాతుకొలది పెరుగుతాడు."

"మన సంబంధం యీ నాటిది కాదు ఇది యింకా చిలవలు పలవలు చేసికొని కలకాలం నిలవాలి."

మౌనంగా వుంటే కదుల్తాడేమోనని కొద్ది క్షణాలు యెదురుచూస్తే అతను సవినయంగా మీ రో సహాయం చెయ్యా" లన్నాడు.

"ఏంటది ?"

"ఇంకో కాంట్రాక్టు మన పేర వచ్చింది."

"వస్తే ?"

"పని వెంటనే ప్రారంభించాలి"

"ప్రారంభించండి"

"డబ్బు లేదు !"

'ఐతే న న్నేం చెయ్యమంటారు?"

"వున్న దంతా యీ పెద్ద పనిమీద పెట్టేశాను సకాలంలో పూర్తి చెయ్యలేక పోయాను అంచేత యీ క్రొత్త యింజినీరుతో చెప్పి-"

"మీరే చెప్పండి"

"నేను చెప్తే వినడు. మీ ద్వారా పని సాగా లంటాడు"

"పని పూర్తి కాకండా పూర్తయిందని చెక్కు వ్రాసిమంటారా?"

"పని తర్వాత తప్ప పూర్తి చేస్తాను"

"ఈ అన్యాయానికి ఒడిగట్టుకోలేను."

"కొత్త మనిషిని కానండీ! మన మామూలికి రెండింతలు ముట్ట జెప్పనా? ఈ సారి యిల్లు కట్టిస్తే నా మీద భారం వేసేయండి."

"నా కేడబ్బూ వద్దు—యే యిల్లూ వద్దు ఈ అన్యాయంనూతిలో యీత రాని నా కొడుకును యెత్తీను"

కంట్రాక్టరు పెద్దగ నిట్టూర్పి లేచి నిల్చున్నాడు.

అచ్యుతరామయ్య రెండుచేతులు పట్టుకొని "బాబ్బాబూ యివి పాదా లనుకోండి ఈ పనిమీద నష్టమేగానీ లాభంరాలేదు ఈ క్రొత్తకంట్రాక్టులో యీ నష్టాన్ని కలుపుకుంటాను ఈ సహాయం మీరు చెయ్యకపోతే నా గౌరవ మర్యాదలు గంగలో కలుస్తాయ్. మీరు కోరినంత యిచ్చుకుంటాను ఆ డబ్బు బుల్లిబాబు చదువుకి సరిపోతుంది"

అచ్యుతరామయ్య అరికాలి మంట యీ మాటలతో ఒక్కసారి నెత్తి కెక్కింది "ఛో"... అని గసిరేశాడు ఆయినా వాడు వదల్లేదు. "మీ సేమ నండి, మీరు సరి అనంటేగానీ కదలను" అని జలగలాగ విడవకండానే దగ్గరగా నిల్చున్నాడు"

"కళ్ళెర్ర జేసి కదలరా" అన్నాడు.

"ఊహు"

"గెంటేస్తాను" అరిచాడు

"తిరిగివస్తాను"

ఒక్కొక్క మాటతో పాదరసం ఒక్కొక్క డిగ్రీ మీదకు పోయి థర్మామీటరు పగిలిపోయింది

"ఎలా వస్తావో చూస్తాను. ఛో" అంటూ గట్టిగా అరచి మెడమీద చెయ్యివేసి ఒక్కతోపు తోశాడు. కంట్రాక్టరు దభీమని జారిపడ్డాడు తల గుమ్మం మీద పడి రక్తం పిచ్చికారి నింపి పంపుచేసినట్లు యెగిరి అచ్యుతరామయ్య కమీజుమీద పడింది

ఆ రక్తం చూడగానే యిదివరకు గుండెలో కదుల్తున్న గుప్పుడెక్కలు నిర్దాక్షిణ్యంగా గుండెనుకుమ్మేశాయ్, వూపిరాడలేదు గుండెను పట్టుకుంటూ కుర్చీమీద కూలబడి "నా బాబూ" అనుకుంటూ కళ్లు తేలేశాడు








## జరిగిన కథ

[పాఠశాల రోజుల్లో ఉన్న భేదాభిప్రాయాలూ, ఈర్ష్యలూ పోయి స్నేహానుబంధం ఏర్పడి పరిస్థితుల కారణంగా దూరమైపోయి మళ్ళీ కలకత్తాలో కిశోర్ మెడిసన్ శంకర్ 'లా' చదువుతూ కలిస్తే ఏదో ఆప్యాయతా-ఎంతో దగ్గరైనట్టుగా అనుభూతి పొందారు.

శంకర్ చెల్లెలు ప్రమీలను సుకుమార్ తన చెల్లెలైన నీహారిక కోరికపై వివాహ మాడాడు. శంకర్ తన చెల్లెలిని చూడటానికి సుకుమార్ యింటికి కిశోర్‌ను తీసుకు వెళ్ళాడు. అక్కడ కిశోర్ నీహారికను చూశాడు నీహారిక స్త్రీల స్వాతంత్ర్యం, హక్కులుపై కొన్ని వ్యాసాలు వ్రాసింది ప్రచురింపబడిన ఈ వ్యాసాలు చూచి 'దివాకర శర్మ' అనే పేరుతో కిశోర్ వాటిపై విమర్శలు ప్రచురించాడు ఈ విమర్శ లకు ప్రతివిమర్శలు 'మేఘమాల' అనే పేరుతో నీహారిక పంపింది. త్వరలోనే ఈ విషయమంతా తెలివిడి అయింది. కిశోర్ నీహారికల మధ్య గౌరవానురాగా లేర్పడినై.

నీహారిక, తల్లి చనిపోయిన తరువాత పంతులమ్మగా చేరింది కిశోర్, శంకరులు తమ తమ ప్రేమలను నీహారికకు వెలడించి విఫలులయ్యారు. పంతులమ్మ ఉద్యోగానికి రాజినామా యిచ్చిన నీహారిక మళ్ళీ అన్నద్వారా ప్రయత్నించేసి ఛోటానాగపూర్‌లో స్కూలు హెడ్‌మిస్ట్రెస్‌గా కుదిరింది.

—ఇక చదవండి

రాజాగారు టీ త్రాగుతూ నాతో చాలా విషయాలు మాట్లాడారు. నేను ఇచ్చిన టీ అద్భుతంగా ఉన్నదని పొగిడారు. ఆ తర్వాత మా వూరూ, ఇంటి సంగతులూ అడిగారు. మాది కలకత్తా అనీ, అమ్మా నాన్నా చనిపోయా రనీ, అన్నయ్య వున్నా డనీ చెప్పాను

"Oh I see! అందుకనేనా మీరు చదువు మానింది?"

"నేను కాలేజీ వదిలినా చదువు మానలేదు. నేను ప్రైవేటుగా బి. యే. కు చదువుతున్నాను," అన్నాను.

"I am very glad to hear it మీరు చదువు మానకండి. పైగా మీరు ఎవరినీ ఇబ్బంది పెట్టకుండా, సంపాదించి చదువుకుంటున్నారు. విదేశాల్లో చాలామంది ఇలాగే చేస్తారు," అన్నారు రాజాగారు

"ఆ దేశాల్లో స్త్రీలకు ఆత్మగౌరవం ఎక్కువనుకుంటాను. అంచేతనే వారు తమ హక్కుల్ని అలా కాపాడుకుంటారు," అన్నాను.

"Quite so; ఆ దేశాల్లో స్త్రీలు అలాగే చేస్తున్నారు."

"నేనుకూడా బేథూన్ కాలేజీలో చదివేటప్పుడు 'నారీ అభ్యుదయ సమితి అని ఒక సంఘం పెట్టను. చాలామంది పిల్లలు సంఘంలో చేరారు. కొంత పనికూడా చేశాము."

"మీ ఈ ప్రయత్నం చాలా ప్రశంసనీయమైంది. స్త్రీజాతి అభ్యుదయం నా జీవితలక్ష్యాలలో ఒకటి. అందుచేతనే ఈ స్కూలు పెట్టాను మీకు ఈవిషయంలో నావల్ల కాగలిగిన సహాయ మేదైనా చేస్తాను," అన్నారు రాజాగారు

"అయినా ఇక్కడ ఆఫీల్డు ఏమున్నది? ఈ విషయంలో రాణీగారి అభిప్రాయం ఏమిటి? వారివల్ల ఏమైనా సహాయం లభిస్తుందా?" అని అడిగాను.

రాజాగారు నవ్వి అన్నారు. -"మా అంతఃపురంలో ఇంకా అలాంటి వేమీ ప్రవేశించలేదు. వాళ్ళు ఈనాటి ప్రపంచానికి చాలాదూరంగా వున్నారు. మీరు ఒకసారి వచ్చి మాట్లాడిచూడండి, మీకే తెలుస్తుంది. చెప్పండి, బండిపంపించమంటారా?"

"పంపించండి."

"ఘోషాబండి కావాలా?"

"అక్కరలేదు"

"మీరు ఇక్కడికి వచ్చినతర్వాత ఈ గదే వదిలిపెట్టినట్టులేదు. మీ కారుకు మాత్రం ఎక్కడికి పోతారు? ఎవరితో పోతారు! ప్రతిరోజూ సాయంత్రం చల్ల గాలికి పోవటం మంచిది - మీరు చెప్పితే రోజూ బండి పంపిస్తాను"

"రోజూ అక్కర్లేదు. మీ కిబ్బంది లేకపోతే అప్పుడప్పుడూ పంపుతూండండి."

"మీరు గనుక అనుమతిస్తే నేనే మిమ్మల్ని రోజూ షికారుకు తీసుకు పోగలను. సరే, మళ్ళీ వచ్చి కలుసుకుంటాను," అని లేచారు

నేనూ లేచి వారికి కృతజ్ఞత తెలిపాను వారు నా కరస్పర్శచేసి నవ్వుతూ వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం ఎనిమిదిగంటలకు ఒకమనిషి వచ్చి రాజాగారు నాకోసం బండి పంపారని చెప్పాడు ఇంకాసేపటికి మా తీర్థులుగారు వస్తారు, నాకు పాఠం చెప్పను ఎలా పోవటం ? నేను కొంచెంసేపు ఆలోచించి వెళ్ళటానికే తీర్మానించు కున్నాను నాకున్న చీరెల్లో మంచి చీరె కట్టుకుని, సిల్కు బ్లౌజ్ వేసుకుని, మా బోర్డింగులో వుండే ఒక పిల్లను వెంటపెట్టుకుని బండి ఎక్కాను

బండి సరాసరి రాజాగారి మహాలుకు పోయి ఆగింది రాజాగారు స్వయంగా వచ్చి నన్ను బండి దించి లోపలికి తీసుకుపోయారు దివాణంలో ముందు రెండు భాగాలూ పురాతనపద్ధతిలో ఉన్నై కాని, వాటి వెనక రాజాగారు ఆధునిక పద్ధతిలో పెద్దబంగళా కట్టించారు. దానిలోనే వారు కాపురం వుండటం ముందు వాటిలో జమీందారీకి సంబంధించిన ఆఫీసులు వగైరాలు వున్నై

రాజాగారు నన్ను జనానాలోకి తీసుకుపోయారు అది పెద్దగది. క్రింద తివాసీలు పరిచివున్నై. గోడలనిండా తైలచిత్రాలు రాణీగారు జుట్టు విరియబోసుకుని సోఫాలో కూచునుంది ఒక పరిచారిక దంతపుదువ్వెనతో ఆమె తల దువ్వుతున్నది ఆమె జుట్టు పెద్దదే. ఇంకో పరిచారిక ఆమె కెదురుగా అద్దం పుచ్చుకు నుంచున్నది.

రాజాగారు ఆమెకు నన్ను ఎరుకపరిచి—"ఈమె నీతో మాట్లాడాలని వచ్చింది. మీరు మాట్లాడుతూవుండండి. నేను వస్తాను," అని అయన వెళ్ళిపోయారు

రాణీగారిపేరు సుభద్రాదేవి రాజపుటానాలోని నయాగడ్ రాజు కూతురు వయస్సు 25 సంవత్సరా లుంటుంది జరీదుస్తులతోనూ, రకరకాల రాళ్ళతోనూ ఆమె మెరిసిపోతున్నది తనభర్త విదేశాలకు పోయివచ్చినా, ఆమె పాత పద్ధతులు మానలేదు కాని మాటలధోరణినిబట్టి కొద్దిగా చదువుకున్న దని గ్రహించాను ఆమె హిందీ కలిసిన బెంగాలీలో మాట్లాడింది. మధ్యమధ్య ఒకటి రెండు ఇంగ్లీషు శబ్దాలుకూడా వాడింది ఆమె ఇంట్లోనించి బయటికి కదలనప్పటికీ ప్రపంచ విషయాలు తెలుసుకుంటూనే వుంటుందని గ్రహించాను.

"మీకు ఇక్కడ ఎలా వున్నది ? ఏమీ కష్టంగా లేదుకదా ?" అని అడిగింది రాణీగారు.




"తమ దయవల్ల నే నిక్కడ సుఖంగానే వున్నాను," అన్నాను నేను

"మీరు ఈ కొద్దికాలంలోనే స్కూలును బాగా అభివృద్ధి పరిచా రని రాజా గారు చెప్పారు. బహుశా మీ రిక్కడ ఎక్కువకాలం వుండ రనుకుంటాను — పెళ్ళి అయితే వెళ్ళిపోతారు కదూ."

"నా జీవితం స్త్రీ జాతి అభ్యుదయానికి అర్పించాలని వుంది. తమరు నా కీ విషయంలో తోడుపడండి,'' అన్నాను నేను

"స్త్రీ జాతి అభ్యుదయం అంటే మీ వుద్దేశం ఏమిటి? చదువు సంధ్యలే కదా? దానికి స్కూళ్లు ఉండనేవున్నై," అన్నది రాణీగారు.

"నేను అన్ని విధాల అభ్యుదయము కోరుతాను. మీరు రాజాగారి ద్వారా వినేవుంటా రనుకుంటాను — పాశ్చాత్య దేశాలలో స్త్రీలు పురుషుల అధీనత నుంచి తప్పుకోవటానికి ఎన్నో రకాల ప్రయత్నాలు చేస్తున్నారు''

రాణీగారు నవ్వి అన్నది — "స్త్రీ తప్పకుండా పురుషుడి అధీన మవు తుంది. స్త్రీ పెళ్ళి చేసుకుంటే పురుషుడి అధీన మైనట్టు కాదా?''

"పెళ్ళి చేసుకోకపోతే? స్త్రీ తప్పక పెళ్ళి చేసుకోవా లని ఏ శాసనం వుంది?", అని నే నన్నాను

"పెళ్ళి చేసుకోకపోతే పిల్ల లెలా పుడతారు? పిల్లలు లేకపోతే వంశ మెలా నిలుస్తుంది?'' అన్నది రాణీగారు

దీనికి ఏమి జవా బివ్వాలా అని నేను ఆలోచించసాగాను. రాణీగారు మళ్ళీ అన్నది :— "స్త్రీలకు పిల్లలు కావా లనే కాంక్ష చాలా జాస్తి. నాకు పిల్లలు లేరు — అందుచేత నా మనసు చాల పరితాపపడుతూవుంటుంది ''

"ఈ మాతృత్వ కాంక్ష యింకో విధంగాకూడా తీర్చుకోవచ్చు. ఈ ప్రపంచంలో పిల్లలందరినీ తనవారిగానే ఎంచుకోండి,'' అన్నాను

ఆమె దీర్ఘంగా నిట్టూర్చి — "అలా తీరదు. నీళ్ళతో తీరే దాహం ఎక్కడైనా పాలతో తీరుతుందా ?" అని అడిగింది.

"విదేశాలలో స్త్రీలు చాలామంది పెళ్ళి చేసుకోకుండా. తమ వున్నతి కోసం, దేశాభ్యుదయం కోసం ఎన్నో సత్కార్యాలు చేస్తున్నారు. మనంకూడా అలా చెయ్యవచ్చు కదా ''

"అయితే యివి పెళ్ళి చేసుకునికూడా చెయ్యవచ్చు కదా ? పురుషులతో మనకు విరోధ మేముంది, వారు అడ్డుపడటానికి ? మనకు సహాయంకూడా చేయవచ్చు."

"కాని ఇంతవరకూ మనల్ని బంధించివుంచారు కదా !''

"ఎక్కడ బంధించారు ? స్త్రీ భర్త అధీన మని చెప్పుతారే కాని అది నామ మాత్రం మన శాస్త్రాలలోనే వుంది, 'శక్తిలేని శివుడు శవమాత్రు' డని. ఈ ప్రపంచంలో ఏపనికూడా భార్య యిష్టం లేకుండా భర్త చెయ్యలేదు. స్త్రీ తెలివిగలదైతే భర్త ప్రతివిషయంలో ఆమె సలహా తీసుకుంటాడు. మన దేశంలో స్త్రీలు ఎంతమంది ఏలలేదు రాజ్యాలు ?''

ఇక ఆమెతో వాదించి ప్రయోజన మేమీ లేదని తెలుసుకుని అన్నాను :— "తమ అభిప్రాయాలు తెలుసుకుని నేను చాలా సంతోషించాను. పదిగంటలకు నాకు స్కూలు వుంది. మళ్ళీ ఇంకోమాటు వచ్చి కలుసుకుంటాను," అని లేచాను.

రాణీగారు దాసీని కేకవేసి నాకు తాంబూలమూ, కుంకుమా తెప్పించి ఇచ్చింది. నేను అవి తీసుకుని బయలుదేరాను ఒక దాసీ నన్ను సింహద్వారం వరకూ సాగనంపింది. అక్కడ బండి సిద్ధంగావుంది. నేను అది ఎక్కి బోర్డింగుకు వెళ్లాను.

ఆవాళ సాయంత్రం నేను స్కూలునించి బోర్డింగుకు తిరిగివచ్చానో లేదో ఒక బిళ్ళబంట్రోతు వచ్చి — "రాజాగారు బండిలో వున్నారు ; మిమ్మల్ని పిలవమన్నా" రని చెప్పాడు.

నాకు నిన్నటి సంభాషణ జ్ఞాపకం వచ్చింది. త్వరత్వరగా గుడ్డలు మార్చుకుని బయలుదేరాను. రాజాగారు రోడ్డుమీద గుర్రపుబగ్గీలో వున్నారు. నన్ను చూడ

గానే దిగి నాకు చెయ్యి అందించి బగ్గీలోకి ఎక్కించారు. వారు నన్ను తన ప్రక్కనే కూచోమన్నారు, కాని నేను కూచోలేదు. ఎదురుగా కూచున్నాను.

అప్పటికి ఇంకా ప్రొద్దు క్రుంకలేదు. అస్తమించే సూర్యుని బంగారు కిరణాలు అక్కడి పర్వతాలమీదా, పంటభూములమీదా, చెట్లమీదా పడి ఎంతో ఆనందాన్నిస్తున్నయి. అది పుష్యమాసం. పైరులు పంటకు వచ్చిఉన్నై. నే నివి చూసి ఆనందిస్తూ పోతూవున్నాను. రాజాగారు నా ఏకాగ్రతను భంగం చేశారు

''మీరు ఈవైపు ఎప్పుడూ రాలే దనుకుంటాను ?'' అన్నారు వారు.

"ఉహుఁ. అయితే దూరాన్నించే ఈ సుందరదృశ్యాలు చూసి ఆనందిస్తూ ఉండేదాన్ని,'' అన్నాను నేను.

''ఒక్క సుందరదృశ్యాలేకాదు; సుందరమైన ప్రతి వస్తువూ అనుభవించదగిందే. కాని ఈ సౌందర్యా లనుభవించటానికి కల్చరు కావాలి. అది ఎంతమందికి వున్నది ? సరే, రాణీగారినిగురించి మీ అభిప్రాయ మేమిటి" అని అడిగారు వారు.

"వారు చాలా తెలివికలవారు. ప్రపంచజ్ఞానం కూడా కలవారే. కాని వోల్డ్ ఫాషన్డు,'' అన్నాను నేను.

రాజాగారు నవ్వి—"మీరు సరీగ్గా గ్రహించారు. నే నెంత ప్రయత్నించికూడ ఆమెను మార్చలేకపోయాను సొసైటీలోకి తీసుకుపోలేకపోయాను" అన్నారు.

"వారు బయటి ప్రపంచంలో అడుగుపెడితే చాలా మారిపోవచ్చు.''

"అక్కడే కదా చిక్కు ? ఆమె అంతఃపురం వదల నంటుంది ఊళ్ళో ప్రజలు కూడా ఆమె బయటికి వస్తే ఎంతో ఇదిగా చెప్పుకుంటారు ''

అప్పటికి చాలా దూరం వచ్చేశాము. నేను సంభాషణ మార్చి ''ఇక తిరిగి పోకూడదా ?'' అని అడిగాను

"మూడు మైళ్ళేగా మనం వచ్చింది ! సరే, అయితే తిరిగివెళ్ళుదాము. మీకు చలిగాలి తగులుతుందేమో," అని, కోచ్‌మాన్‌తో బండి త్రిప్ప మన్నారు.

నేను బోర్డింగుకు వచ్చేవరకు నిరిస్తాణీదేవి అక్కడే వుంది నేను "అక్కయ్యా ! ఈవేళటప్పుడు వచ్చావేం ?" అని ఆమెను అడిగాను. ఈమధ్య ఆమెను నేను అక్కయ్య అనే పిలుస్తున్నాను

"నీతో ఒక విషయం మాట్లాడాలి. నీవు నా చెల్లెలిలాంటిదానివి. అంచేత నా మనసులో ఉన్నది నీకు చెప్పక తప్పదు,'' అన్నది నిస్తారిణి.

నేను కొంచెం ఆశ్చర్యంతో — "ఏవిషయం చెప్పాలి ? మీరు నిర్భయంగా చెప్పవచ్చు,'' అన్నాను.

ఆమె నా దగ్గిరిగా వచ్చి—"ఇవాళ నీవు రాజాగారితో షికారుకు వెళ్లావట. అది మంచిపనికాదు," అన్నది

నాకు కొంచెం కష్టంవేసింది · — "అక్కయ్యా! మీరుకూడా ఇది తప్పనే అంటారా? పల్లెటూరివాళ్ళకు వారి అజ్ఞానంవల్ల ఇది తప్పుగా కనపడవచ్చు. కాని చదువుకున్న మీరుకూడా ఇలాగే అంటారా?"

"నీవు షికారుకు పోవటమూ తప్పుకాదు; బండి ఎక్కటమూ తప్పుకాదు. నీవు రాజాగారితో కలిసి బండిలో పోవటమే తప్పు. రేపటినించి ప్రజలు వాళ్ళ ఇష్టమొచ్చినట్టు చెప్పుకుంటా రని నా భయం"

నాకు కోపం వచ్చింది — "నా కా భయ మేమీలేదు నేను వాళ్ళ అభిప్రాయాలు లెఖ్ఖకూడా చెయ్యను మనసులో కుళ్ళు వున్నవాళ్ళే లోకంలో కుళ్ళు వెతుకుతారు," అన్నాను

"కాని, చెల్లీ! ఆడవాళ్ళు కొంచెం సోషల్‌గా వుంటేనే చెడుపేరు వస్తుంది. అలాంటిది ప్రచారం కానివ్వటం మంచిదే నంటావా?"

నేను మండిపడ్డాను · — "ఇదంతా ఆడవాళ్ళకేనా? మగవాళ్ళ కేమీ లేదా? ఇదే మన సమాజంలో ఉన్న అన్యాయం దీనికే నేను పోట్లాడుతున్నాను. ఈ అన్యాయాన్ని ఎదుర్కొనే మనోబలంకూడా నాలో ఉంది!" అన్నాను నేను.

నిస్తారిణి చాలా నొచ్చుకుని—"నిన్ను ఈ విషయంలో హెచ్చరించటం మంచిదని తోచి యీ మాటలు చెప్పాను ఆతర్వాత నీ యిష్టం," అని చెప్పి వెళ్లిపోయింది.

మర్నాడు ఉదయం తీర్థులుగారు వచ్చారు నిన్న నేను రాజాగారి ఇంటికి వెళ్ళిన ప్రసక్తి తెచ్చారు

"అవును. రాజాగారు బండి పంపారు నేను రాణీగారిని చూద్దామని వెళ్ళి వచ్చాను" అన్నాను

"మళ్ళీ సాయంత్రం రాజాగారితో షికారు వెళ్ళారటగా?"

"ఆఁ. వారు స్వయంగా బండి తీసుకొచ్చారు అలా ఒకమాటు వెళ్లొచ్చాను"

"ఇది మంచిపనికాదు తల్లీ! నీవు హిందూకన్యవు. పరపురుషులతో కలిసి తిరుగుతుంటే మాకు ఎలాగో వుంటుంది"

నేను చాలా నొచ్చుకుని అన్నాను·—"తీర్థులుగారూ, మీరు నాకు పితృతుల్యులు. నా హితైషులు మీరు ఏది చెప్పినా నా మంచికోసమే చెబుతారు. కాని, నా స్థితి కొంచెం ఆలోచించండి. రాజాగారు ఇక్కడ అధిపతులు నా కెన్నోవిధాల సహాయం చేశారు. వారు చదువుకున్నవారు; సంస్కార మున్న




వారు వారు స్వయంగా వచ్చి షికారుకు పోదాము రమ్మంటే నేను ఎలా కాదనేది? వారితో పోవటంతప్పా?"

"అమ్మా, నీవు చదువుకున్నదానివి బుద్ధిమతివి నీవు ఒక్కసారి ఈ సంగతి ఆలోచించి చూడు — నిస్తారిణి ఇంతకాలంనించీ ఇక్కడ వున్నదికదా, ఆమెను రాజాగారు ఒక్కమాటుకూడా ఎందుకు ఆహ్వానించలేదు? నిన్నే యింత గౌరవించటం ఎందుకూ? తల్లీ! నీకు ప్రపంచజ్ఞానం తక్కువ లోకుల చిత్తవృత్తి తెలుసుకోలేవు అంచేతనే, మన శాస్త్రకారులు, స్త్రీలకు స్వాతంత్ర్య మివ్వలేదు అలాచేయటం వారిమీద అసూయవుండికాదు—వాళ్ళ మేలుకోసమనే సరే,ఈచర్చ నీకు కష్టం కలిగించవచ్చు పారాలు మొదలుపెట్టు," అన్నారు తీర్థులుగారు.

నాకు నిజంగా చాలాకష్టంవేసింది 'స్త్రీలమీద వీరి కింత అనుమానమా! ఈ సనాతనుల మనసు ఎంత సంకీర్ణమైంది?'

ఆ సాయంత్రం మళ్ళీ రాజాగారు బండి తీసుకునివచ్చారు ఇవ్వాళ నామనసు అంత బాగాలేదు; షికారుకు పోదామనికూడా అనుకోలేదు కాని నేను నిస్తారిణితో అన్నమాట జ్ఞాపకం వచ్చింది - ఈ అజ్ఞానులమాట లెక్కచెయ్యనని.

నేను వెంటనే చీరె మార్చుకుని రాజాగారితో బండి ఎక్కి కూచున్నాను. ఇవ్వాళ్ళ రాజాగారు నన్ను ఎదురుసీటుమీద కూచోనివ్వలేదు ప్రక్కనే కూచోబెట్టుకున్నారు నేనూ పట్టుదలకు వారి ప్రక్కనే — కాని కొంచెం ఎడంగా,

కూచున్నాను. ఆయన బండిలో చాలాసంగతులు మాట్లాడారు; కాని అవి అన్నీ యూరోపుకు సంబంధించినవే; నేను అన్నిటికీ 'ఊ' కొట్టుతూ కూచున్నాను

మేము షికారుకు పోయివచ్చేవరకు ప్రొద్దుకూకింది నా గదిలో దీపంకూడా వెలిగించిఉంది నాతోపాటు రాజాగారుకూడా బండి దిగి లోపలికి వచ్చి ఒక ఈజీచైర్‌లో పండుకుని సిగరెట్టు ముట్టించి — "మీ గది చిన్నదైనా చాలా బాగుంది. నాకు ఇలాంటి కాంపాక్టుగా ఉన్న గదులంటే చాలా ఇష్టం. కూచోండి మీరుకూడా ఇప్పుడు ఒకకప్పు టీకూడా వుంటే ఎంత బాగుండును," అన్నాడు.

నవ్వి — "అదెంతభాగ్యం! పదినిముషాల్లో తయారుచేసి తెస్తా" నన్నాను.

"వద్దు, మీరు వొద్దు వంటవాడితో చెప్పండి, వాడు తెస్తాడు," అన్నారు.

నేను పోయి వంటవాణ్ణి నీళ్ళు కాచమని చెప్పి, టీ సరంజామా తీసుకు వచ్చాను. రాజాగారు నేను రాగానే — "ఆవాళ మీరు తయారుచేసిన టీ ఎంత బాగుంది? అలాంటిది నాజన్మలో త్రాగలేదు," అన్నారు

నే నేమీ సమాధానం చెప్పకుండా నవ్వాను. కాని వా రిలా పిలవా పెట్టకుండా ఆతిధ్యానికి వచ్చికూచోవటం నాకేమీ బాగాలేదు. వంటవాడు వేడినీళ్లు తెచ్చాడు. నేను టీ తయారుచేసి రాజాగారి కిచ్చాను ఆయన టీ తీసుకుంటూ ఏమేమో మాట్లాడారు నా చెవికి ఒక్కటీ ఎక్కలేదు ఈయన ఎప్పుడు వదిలి పోతాడా అని ఉంది నా మనసులో. రాజాగారు అది గ్రహించారో ఏమో — "మీరు చాలా అలిసిపోయినట్టుగా ఉంది అయితే నేను వస్తాను" అని లేచి చేతి కర్ర తిప్పుకుంటూ వెళ్ళిపోయారు

ఆయన వెళ్ళిన కాసేపటికి నిస్తారిణి వచ్చింది ఆమె ఈ వేళప్పుడు రావటం నా కేమీ నచ్చలేదు. ఆమె రాగానే అన్నది — "నే నిదివరకు ఒకసారి వచ్చాను రాజాగారు ఉండటం చూసి వెళ్ళిపోయాను. అయితే నిన్ను ఒకటి అడుగుతాను. నీవు వొంటరిగా వుండటం తెలిసికూడా రాజాగారు ప్రొద్దుకూకి రావటం బాగుంటుందా? లోకు లేమనుకుంటారు?"

ఆమె మాటలు వినేసరికి నాకు అరికాలిమంట నెత్తి కెక్కింది "అక్కయ్యా! నువ్వు మళ్ళీ ఇదే చెప్పటానికి వచ్చావా? ఇందులో నా తప్పేముంది, లోకులు అనుకోటానికి? ఒక పెద్దమనిషి మన యింటికి వస్తే ఎలా రావద్దంటావు? నీవు వద్దనగలవా?" అని అడిగాను

"చెల్లీ! నీ కంత కోప మెందుకు? నీ తప్పేమీ లేదని నాకు తెలుసు. కాని,

రాజాగారు ఇలా రావటం బాగా లేదంటాను. మన సంఘ పరిస్థితులు ఆయనకు తెలియవా, అన్నిటికీ స్త్రీయే బాధ్యురాలని ?"

"అందుకనే నేనుకూడా అవి ఉల్లంఘించదలచుకున్నాను. ఇక్కడ సంఘ మెవరు ? నేను సంపూర్ణ స్వతంత్రురాలిని."

"అందుకోసమే నీవు ఇంకా జాగర్తగా మెలగవలసి వుంటుంది. ఇంతవరకు జరిగిందేదో జరిగింది. ఇకముందు రాజాగారిని సాయంకాలం దాటితే ఇక్కడికి రావటానికి ప్రోత్సహించకు."

"నే నేమీ ప్రోత్సహించలేదు. వారే వచ్చి కూర్చుంటుంటే నే నేమి చేసేది? మెడపట్టి బయటికి గెంటమంటావా ? మర్యాద అనేది మనకీ ఉండాలి కదా !"

ఆమె దీనికి సమాధాన మేమీ చెప్పకుండా వెళ్ళిపోయింది. నా మనసుకు చాల కష్టంవేసింది. నాకు చాలాసేపు ఏమీ తోచలేదు.

నేను భోంచేసి మంచంమీద పండుకుని జరిగిన సంగతులు నెమరుకు తెచ్చుకో సాగాను. రాజాగారితో నేను షికారుకు పోవటం ఇక్కడివారికి తప్పుగా కని పిస్తున్నది — నిజానికి అది తప్పేనా ? ఇంతవరకు రాజాగారు నాతో అమర్యాద కరంగా ప్రవర్తించలేదు. నాతో జాగర్తగానే మెలగుతున్నారు — కాని ఈ సంగతి బయటివారికి ఎలా తెలుస్తుంది ? అయితే వారు నాయందు తీసు కుంటున్న శ్రద్ధ ఇతరులకు ఎలా కనిపిస్తుంది ? నాలాంటి పంతులమ్మమీద వారింత శ్రద్ధచూపటం ఉచితమేనా ? అయితే వారు చూపుతున్న శ్రద్ధకు నేను చాలా గౌరవపడ్డట్టు ఎంచుతున్నాను. ఇలా భావించటం నాకు ఉచితమేనా ? మొదటిసారి మేము కలిసినప్పటినించీ వారు నా అందానికి ముగ్ధు లయ్యారు. అది వారి చూపులో కనిపిస్తూనేవుంది. అది అప్రీసియేషన్ కావచ్చు; ఎడ్మి రేషన్ కావచ్చు. అయితే శంకర్ కూడా నావంక యిలానే చూసేవాడు. రాజాగారుమాత్రం అతనిలాగా ఎందుకు తయారు కాకూడదూ ? అందులో రాజాగారి భార్య అతనిమాదిరి 'ఎన్‌లైటెండ్' కాదు. అంచేత అతను 'ఎన్ లైటెండ్' స్త్రీలకోసం తిరుగుతుండవచ్చు. అయితే ఇప్పు డతనితో నేను కలవ వచ్చునా, కలవకూడదా ? నేను నా జీవితంలో తీసుకున్న ఆదర్శాని కిది అడ్డు రాదుకదా ? నాకు ప్రపంచానుభవం కలుగుతున్నకొద్దీ నేను నా ఆదర్శాలనించి కొద్దికొద్దిగా దిగుతున్నట్టు తోస్తున్నది వివాహ విషయమై నేనూ కిశోరూ వాదించుకున్నాము. అతని వాదన నాచెవిలో ఇంకా గింగురుమంటూనే వుంది. ఆపైని ఇక్కడ తీర్థులుగారు ఒకరు అప్పుడప్పుడు పెళ్ళినిగురించి లెక్చర్లు ఇస్తూనే

వున్నారు. పాపం ఇప్పుడు కిశోర్ ఎక్కడ వున్నాడో, ఏమి చేస్తున్నాడో! అతను నన్ను నిజంగా ప్రేమించాడు. కిశోర్ పొర్లివచ్చే కన్నీరు బలవంతాన ఆపుకుంటూ నా దగ్గర సెలవు తీసుకున్నాడు — అప్పుడు నా కళ్ళలో కూడా నీరు తిరిగింది అయితే అతని ప్రేమకు నా హృదయం కూడా మెత్తబడివుంటుందా?' కిశోర్ హృదయం చాలా మంచిది. అతను నిప్పులాంటివాడు సరే, ఇప్పుడు నే నివన్నీ ఎందుకు ఆలోచిస్తున్నట్టు? అయితే నేను నా ఆదర్శాలను చంపుకుని వివాహం చేసుకోవా లనుకుంటున్నానా? నా ఆదర్శాలకు భంగంరాకుండా నేను వివాహం చేసుకోటానికి వీల్లేదా? అయితే నా ఆదర్శాలకోసం నేను జీవితమంతా బ్రహ్మచారిణిగా వుండవలసిందేనా? నిస్తారిణి తన భర్తతో ఎంత చక్కగా కాపురం చేసింది? వా రిద్దరిమధ్య నిజమైన ప్రేమ వున్నట్టుగా తోస్తుంది: లేకపోతే ఇప్పుడుకూడా అది తలచుకుని ఏడుస్తుందా? ప్రేమద్వారానే స్త్రీత్వం వికసిస్తుందని విన్నాను. ఆ తరువాత మొన్న రాణీగారు చెప్పింది — తనమనసు సంతానం కోసం ఆరాటపడుతున్న దని ఈ మాతృత్వమే స్త్రీకి ఒక ముఖ్యమైన కాంక్ష. సంతానంలేని స్త్రీ జీవితం అసంపూర్తి జీవితమే. వివాహం చేసుకోనివారి జీవితంలో ప్రేమమార్దవం వుండదు—మాతృత్వంద్వారా సిద్ధించే కోమలత్వం కూడా జన్మించదు. వారి జీవితం మరుభూమిలాంటిది. కిశోర్ అన్నాడు, 'నీ మనస్సు కుతర్కమనే కంటకాలతో ఆవరించివుంది. అంచేత అక్కడ ప్రేమపుష్పం వికసించదు' అని. నేను కుతుర్క మవలంబించింది స్త్రీజాతికోసం ఆ స్త్రీజాతికోసం నా జీవితం బలి ఇవ్వాలా? కలకత్తాలో నేను పెట్టిన సమితికి పట్టినగతి అరుణ ద్వారా నేను విన్నాను. ఈ మధ్యనే చాలామంది మెంబర్లు మానుకొన్నారట. నా ఈ స్వల్పసామర్థ్యంద్వారా ఈ స్త్రీజాతి అభ్యుదయం ఎంతవరకు సాగుతుంది? - ఇలా నేను అనేక విధాల ఆలోచిస్తూ నిద్రపోయాను

## 9

తెల్లవారింది. మామూలువేళకు తీర్థులుగారు పాఠం చెప్పటానికి వచ్చారు. ఆయన ముఖం యివ్వాళ అదోక విధంగా వుంది. నాతో మరేవిషయమూ మాట్లాడకుండా పాఠాలు. చెప్పుకుపోయారు. నేనూ మధ్య ఏమీ ప్రశ్నించలేదు.

ఒకగంట పాఠం చెప్పి తీర్థులుగారు అన్నారు "అమ్మా! రేపటినించీ నాకు పాఠం చెప్పటానికి రావటం కుదురదు. కాని - నేను మానుకునేముందు నీ కొక సలహా యిచ్చిపోతున్నాను. 'యథా స్త్రీణాం తథా రాజ్ఞాం సాధుత్వే దుర్జనోజనః'



"హమ్మగారూ! ఈ తూరి పిచ్చర్‌లో టైయిటిల్స్ సూపుతప్పుడు మీకి మాంసం కై మా సప్లీచేసిదిగా మా పేరు మీ పేరుకిందా హెయ్యించ్వాల...!"

అన్నాడు భవభూతి. అంటే 'స్త్రీలవలెనే రాజు నడతనుగురించికూడా లోకులు సులభంగా అపవాదు లేస్తారు' అని. ఇక్కడ స్త్రీ, రాజూ ఇద్దరూ కలిశారు. అందుచేత లోకులు చెప్పుకోవటానికి చాలా అస్కారముంది. నేను ఏదో పూర్వ కాలపువాణ్ణి. నాబోటివాడు దూరంగా వుండటమే మంచిది," అని ఆయన లేచి వెళ్ళిపోయినారు. నాకు మాట్లాడటానికికూడా అవకాశ మివ్వలేదు. నాకు ఎంతో కోపం వచ్చింది పోయేవారికి నమస్కారం పెట్టి వూరుకున్నాను.

మామూలు మాదిరిగా ఆనాడుకూడా రాజాగారు బండి వేసుకొచ్చి నాకు కబురు పంపారు నాకు వంట్లో బాగాలేదని చెప్పి నేను షికారు మానుకున్నాను. నిజానికి ఆవాళ నా శరీరం కాకపోయినా, నా మనసు ఏ మాత్రం బాగోలేదు.

నేను తప్పించుకుందామన్నా రాజాగారు వదిలే ఘటంగా కనిపించలేదు. ఆయన బండి దిగి సరాసరి నేను కూర్చునే గదిలోకివచ్చి "ఏం ఇవ్వాళ మీవొంట్లో?"

"ఏదో యిదిగా వుంది" అన్నాను నేను.

"ఒక కప్పు టీ త్రాగండి కొంచెం హుషారు వొస్తుంది!" అని రాజాగారు వంటవాణ్ణి కేకవేశారు. వంటవాడు వచ్చాడు.

నేను ఇక ఈయన వదిలేటట్టు లేడనుకుని వంటవాణ్ణి టీ తయారుచేసుక రమ్మని చెప్పాను.

వంటవాడు వెళ్ళిపోయాడు. రాజాగారు కాలక్షేపానికి ఆయన జీవితంలో అనుభవాలు చెప్పసాగారు. నాకు వినే ఓర్పుగానీ ఓపికగానీ లేకపోయింది. ఆయన చెప్పేదానికల్లా 'ఊఁ' కొట్టుతూ పోయాను. ఇంతలో టీ వచ్చింది. నేను కలిపి యిచ్చాను. నా ధోరణి గ్రహించి రాజాగారు ఎక్కువసేపు కూర్చోలేదు 'గుడ్ నైట్' చెప్పి వెళ్ళిపోయారు. నేను బ్రతికిపోయా ననుకున్నాను.

నిస్తారిణి ఇవ్వాళ రాలేదు. బహుశా తీర్థులుగారిలాగా ఆమెకూడా నన్ను 'బాయ్‌కాట్' చేసివుంటుంది. అదృష్టవశాత్తు నేను ఇక్కడ ఏ సమాజానికీ చెందిన దాన్ని కాను. లేకపోతే నన్ను వెలివేసివుండేవాళ్ళేమో! భవానీపూర్ హెడ్ మిస్ట్రెస్‌కున్న అధికారం నిస్తారిణికి కూడా వుంటే ఈమెకూడా నన్ను డిస్‌మిస్ చేసివుండే దనుకుంటాను. నా మనసుకుమాత్రం ఆనాడు నేనెంత నిష్కళంకంగా ఉన్నానో ఈనాడూ అంతే నని తోస్తున్నది.

ఇది జరిగిన మరసనాడే అసలు క్రైసిస్ (సంకటం) వచ్చింది. దాని మూలానే నా జీవిత ఆదర్శా లన్నీ తారుమా రయినవి.

ఆనాటి సాయంత్రం రాజాగారు ఎలాగూ వెంటపడతా రని భావించి, బోర్డింగులో పిల్లల్ని వెంటపెట్టుకుని షికారుకు వెళ్ళాను. రాజాగారు దోవలో ఎక్కడా కనిపించలేదు. నేను సాయంత్రం ఏడుగంటలకు తిరిగివచ్చాను.

గదిలో లైటు వెలుగుతున్నది. లోపలికిపోయి చూద్దునుగదా రాజాగారు ఈజీఛైర్‌లో పడుకునివున్నారు. ఆయన నన్ను తేరిపార చూసి—"ఓ, యు లుక్ సింప్లీ చార్మింగ్ యిన్ దిస్ పింక్ శారీ అండ్ బ్లౌజ్!" అన్నారు.

నేను ఏమీ మాట్లాడలేదు ఆయన మళ్ళీ యిలా అన్నారు "ఇవ్వాళ మీ ఇంటో నేను అనధికారంగా ప్రవేశించాను. వంటవాడిని టీ కూడా తయారు చేయమన్నాను. మీకు ఇబ్బంది ఇక లేదు—కూర్చోండి, ఆ కుర్చీమీద."

నేను ఏమీ మాట్లాడకుండా దూరంగా వున్న ఒక కుర్చీమీద కూచున్నాను. ఆయన మళ్ళీ—"ఎంతదూరం వెళ్ళారు? అప్పుడప్పుడూ పిల్లల్నికూడా తీసుకు పోవటం మంచిదే — వాళ్ళకి కొంచెం 'ఓపెన్ ఎయిర్ ఎక్సర్‌సైజ్' అవుతుంది," అన్నారు

ఇంతలో వంటవాడు వేడినీళ్లూ తేయాకూ తెచ్చాడు. నేను టీ తయారుచేసి రాజాగారికి యిచ్చాను రాజాగారు టీ త్రాగుతూ ఏమోమో మాట్లాడారు. నేను అన్నిటికీ ఆఁ, ఊఁ లతో జవాబు చెప్పాను

రాజాగారు టీ త్రాగి—"మీ రిలా కొంచెం దగ్గరకు రండి. మీకోసం ఈ కంకణాలు తెచ్చాను. రండి, చేతులకు వేస్తాను!" అన్నారు.

ఈ మాట వినేవరకు నా వొళ్ళంతా భగభగ మండిపోయింది. నేను చాలా కష్టంతో దాన్ని ఆపుకుని—"మీరు ఏమిటండీ చెప్పేది రాజాగారూ? మీ దగ్గర నేను కంకణాలు తీసుకోవాలా? నేను ఎవరి ననుకున్నారు?" అని అడిగాను.

ఆయన నవ్వుతూ—"చూడు మిస్ చటర్జీ! నేను ఈ చిన్న కానుక ఇస్తానన టంలో నీ కేమీ ఆటంకంగానీ, అవమానంగానీ వుండకూడదు. స్త్రీకి పురుషుని దగ్గర అన్నివిధాల గౌరవాలూ, సత్కారాలూ పొందే హక్కు వున్నది. ఇక స్త్రీ సుందరి అయితే పురుషుల ప్రసంశా, పూజాకూడా పొందవచ్చు. ఇది నా పూజాకుసుమము!" అన్నారు, ఇంగ్లీషులో.

"విదేశాల సంగతి వదలండి. అక్కడి ఆచారాలు వేరు. అవి ఇక్కడ ఎలా కుదురుతవి?" అన్నాను నేను.

"యదార్థంగా! నేను లండన్‌లో వుండగా ఒక్క ముద్దుకోసం ఐదు వేల రూపాయలు ఖర్చుపెట్టాను," అన్నారు మళ్ళీ ఇంగ్లీషులో.

రాజాగారి ఈమాట వినేవరకు నాకు కోపం ఆగలేదు;—"రాజాగారూ! చూస్తే యివ్వాళ మీ బుర్ర సరిగా వున్నట్టులేదు. ఇలాంటి అశ్లీలాలు మీరు మాట్లాడతా రని తెలిస్తే మిమ్మల్ని ఇక్కడికి రానిచ్చేదాన్నే కాదు. విదేశాల్లో మీరు ఏమైనా చేయనీండి, ఇక్కడమాత్రం నోరు సంబాళించుకుని మాట్లాడితే బాగుంటుంది. మీ వుద్దేశాలు సరిగావున్నట్టు నాకు తోచలేదు. మీరిక యిక్కడికి రాకండి; మీ కంకణాలు పట్టుకుపొండి," అన్నాను నేను.

రాజాగారు ఈ మాటల కేమీ చిన్నబుచ్చుకోలేదు.—"మీరు నన్ను తప్పర్థం చేసుకున్నారు మిస్ చటర్జీగారూ! నేను విదేశాల్లో ఏమైనా చేయనీండి, అవి ఇక్కడ చేయబోవటంలేదు; నేను మీనించి అలాంటివి ఆశించటంకూడా లేదు. నిజం చెప్పాలంటే నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని పెళ్ళిచేసుకోవా లనుకుంటున్నాను. మీకు తెలుసు నాకు సంతానంలేదని. ఇంకో వివాహం చేసుకో టానికి నాభార్య కే ఆటంకమూలేదు. పైగా మా రాజాలకు బహు వివాహాలు చేసుకోవటం తప్పుకాదు. నేను నా ప్రేమకు నిదర్శనంగా మీ కీ కంకణాలు ఇస్తున్నాను మీ రివి స్వీకరించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి,"అని ఆ కంకణాలు నా చేతులకు తగిలించటానికి రాజాగారు లేచివచ్చారు.

నేను ఎడంగా జరిగి అన్నాను:—"నేను మీ ఈ ప్రస్తావనను అసహ్యంతో

తిరస్కరిస్తున్నాను. మీకు పెళ్ళి చేసుకోవాలని వుంటే ఇంకెవరినైనా చూసుకోండి. మీరు నా ఆశ వదులుకోండి. ఇంకా ఎక్కువ వత్తిడి పెట్టారంటే నే నివ్వాళనే వెళ్ళిపోతాను "

రాజాగారు కొంచెం తగ్గి మళ్ళీ కుర్చీలో కూచుని అన్నారు "మీరు నా ప్రస్తావనను అంత తేలికగా తిరస్కరించకండి, మిస్ చటర్జీ గారూ! ఒకమాటు శాంతంగా ఆలోచించి చూడండి. నాలాంటి రాజాకు రాణీ కావటం ఒక అదృష్టం క్రిందే లెక్క వేసుకోవచ్చు; అయితే మీదీ, మాదీ కులం ఒకటికాదు. ఆవిషయం మీలాంటి చదువుకున్నవారు పట్టించుకుంటా రనికూడా నేను భావించను. నేను మిమ్మల్ని ఏమీ కష్టపెట్టేటంత నీచప్రకృతివాణ్ణి కాను!"

పెద్దచిక్కు వచ్చింది! నేను కొంచెం శాంతంగా ఆలోచించి ఇలా అన్నాను:- "చూడండి, రాజాగారు! మీకు రాణీ అయ్యేకంటే పెద్దగౌరవం నా కేదుందో చెప్పండి! ఆ సంగతి నాకు తెలియదా? కాని, నాకు గార్డియన్‌గా మా అన్న వున్నాడు ఆయన్ను కనుక్కొని చెప్పుతాను "

రాజాగారు ఉబ్బిపోయి-"ఓ, తప్పకుండా కనుక్కోండి. వారికి ఇవ్వాళే టెలిగ్రాం యివ్వండి, లేకపోతే అంతా వివరిస్తూ వుత్తరం వ్రాయండి. వారం రోజుల్లో ఆయన్నుంచి జవాబు వస్తుంది. నేను మళ్ళీ కనిపిస్తాను. ఈ కంకణాలు నాకు తిరిగి ఇవ్వకండి; మీరే వుంచుకోండి. గుడ్ నైట్!" అని అవి టేబిలుమీద పెట్టి వెళ్ళిపోయారు.

ఈ ఆకస్మిక విపత్తుకు నేను తట్టుకోలేకపోయాను. అక్కడే నేలమీద పండుకుని ఆలోచించసాగాను — ఈ ఆపద ఎలా గడిచిపోతుంది? ఎవరు వుద్ధరిస్తారు? నే నిక్కడినించి ఎవరి సహాయంతో పారిపోయేది? ఇక్కడ ఒక్కక్షణం వుండకూడదు అన్నయ్యకు టెలిగ్రాం యిస్తే వస్తాడు, కాని రాజాగారు మమ్మల్ని ఇక్కడినించి పోనివ్వకపోతే? నిస్తారిణి మొదటనే నన్ను హెచ్చరించింది. తీర్థులుగారుకూడా యదార్థాలే చెప్పారు ఇప్పుడు కిశోర్ ఎక్కడ వున్నట్టు? ఏమి చేస్తున్నట్టు? కిశోర్ ఆనాడు యదార్థమే మాట్లాడాడు-భర్తే స్త్రీకి రక్షకుడనీ, భర్తగృహమే ఆమెకు ఆశ్రయ మనీ. నే నప్పుడు మండిపడ్డాను పాపం, కిశోర్ నన్ను మనసారా ప్రేమించాడు. అతని ప్రేమను నేను తిరస్కరించాను. అంతేకాదు మా తల్లి కోరికనుకూడా నేను మన్నించలేదు ఈ పాపానికి నాకు ప్రాయశ్చిత్తం కావలసిందే. నా కప్పుడు మరీ గర్వం బలిసిపోయింది దేవుడంటే కూడ లెక్కించలేదు ఇప్పుడు నాకు ఆయనతప్పితే దిక్కెవరూకనిపించటంలేదు.



"నీవేనా భీమారావువి ! ఆరోగ్యశాస్త్రంలో అందరికంటే ఎక్కువమార్కులు నీకే వచ్చినై !"

నే నీవిధంగా ఆలోచిస్తూ పండుకున్నాను. నా కళ్ళవెంట నీరు కారుతున్నది అస్ఫుటస్వరంతో "కిశోర్ ! నీ విక కనపడవా !" నాకు తెలియకుండా నే పిలిచాను.

ఇలా ఎంత సేపు వున్నానో తెలియదు. హఠాత్తుగా కళ్లు తెరిచేసరికి నా తల వైపున ఎవరో కూచునివున్నారు చకిత నయాను. నా కళ్ళను నేను నమ్మలేక పోయాను ఇది నేను మనసులో వూహించుకున్న మూర్తి కాదుగదా ?

నేను భయపడటం చూచి అత నిలా అన్నాడు — "నువు భయపడకు నీరూ ! నేను కిశోర్‌ను "

"కిశోర్ ! కిశోర్ ! నువ్వు భగవంతుడు పంపిన దూతవా ? నువ్వు నన్ను ఆపదనుంచి ఉద్ధరించటానికి వచ్చావా ? రా ప్రియా ! నిన్ను నేను చాలా కష్ట పెట్టాను. ఇక నిన్ను వదలను " ఇలా ఆవేశంలో ఏమేమో మాట్లాడి, కిశోర్‌ను కావిలించుకున్నాను

కిశోర్ నన్ను చెయ్యిపట్టుకు లేవదీసి యీజీచైర్‌లో పండుకోబెట్టాడు నేను కళ్ళు తుడుచుకుని అతనివంక తేరిపార చూస్తున్నాను. కిశోర్ కళ్ళవెంట నీరు తిరిగింది. ఏమీ మాట్లాడలేకపోయాను.

ఇలా ఎంత సేపు వున్నామో తెలియదు. చివరకు కిశోర్ ఇలా అన్నాడు —

"నాకు కలకత్తాలో సుకుమారునిద్వారా తెలిసింది, నువ్వు ఇక్కడ వున్నావని. నిన్ను చూడకుండా ఎన్నాళ్ళు వుండగలను? అంచేత చూసిపోదామని ఇవ్వాళ వుదయమే ఇక్కడికి వచ్చాను. ఇక్కడ హైస్కూలు మాస్టరు యుగళబాబు నా సహపాఠి, మిత్రుడు. అతని ఇంట్లో దిగాను. అతను నీ విషయం మాట్లాడుతూ, ఇక్కడి రాజాగారు నిన్ను నాగపాశంతో బంధించాలని చూస్తున్నాడని చెప్పాడు."

"ఆయన చెప్పింది యదార్థమే ఇంతకుముందే రాజాగారు వచ్చి కంకణాలు యిచ్చి నన్ను రాణీకమ్మని కోరారు."

"ఇది నేను స్వయంగానే విన్నాను. ఇవ్వాళ సాయంత్రం ఐదు గంటలకే నిన్ను చూద్దామని వచ్చాను నువ్వు పిల్లలతో షికారుకు వెళ్ళావని తెలిసింది. నేను ఇక్కడే కూచున్నాను. ఇంతలో రాజాగారు వస్తున్నారని తెలిసింది. నేను లేచి వెనకగదిలోకి వెళ్ళి దాక్కున్నాను. నీ వంటవాడు నన్ను చూశాడు; కాని అతనితో ఈ సంగతి ఎవ్వరికీ చెప్ప వద్దన్నాను. తర్వాత నువ్వు తిరిగి రావటం, రాజాగారితో సంభాషణ అంతా విన్నాను," అన్నాడు కిశోర్.

"కాని ఇక్కడికి వచ్చేముందు నన్నుగురించి నీవు చాలా చెడుగా వినివుండవచ్చు!" అన్నాను నేను.

"అవి వినటంవల్లనే నాకు దాక్కోవాలని బుద్ధిపుట్టింది. కాని, ఎవరు ఏమనుకున్నా నేనవి నమ్మదలచుకోలేదు. కాని బలవంతులు అసంభవాన్ని కూడా సంభవం చేసి చూపగలరు."

"అందుకోసమునే కదా నేనుకూడా మా అన్నయ్య అభిప్రాయం తెలుసుకోవాలని వంక పెట్టి ఒకవారం రోజులు గడువు తీసుకున్నది. ఇది నీవు విన్నావు కదూ?"

"ఎందుకు వినలేదూ! ఇప్పుడు నీదగ్గర టెలిగ్రాం ఫారం వుందా? సుకుమార్‌కు టెలిగ్రాం యిస్తాను, రమ్మనమని."

నేను వంటవాణ్ణిపిలిచి స్కూలు తాళంచెవి యిచ్చి, ఆఫీసుగదిలో టెలిగ్రాం ఫారం వుంది తీసుకురమ్మన్నాను. అతను పోయి తెచ్చాడు.

కిశోర్ టెలిగ్రాం రాశాడు. "My Marriage with Niharika Settled. Come Sharp. Kishore. (నీహారికతో నా పెళ్ళి సంబంధం స్థిరపడింది నువ్వు వెంటనే రా. కిశోర్.)"

నేను టెలిగ్రాం చూసి నవ్వాను. నా కప్పుడు నాకీ అభ్యుదయసమితి జ్ఞాప

కమే రాలేదు. నేను కిశోర్ తో—"నువ్వు రాజాగారి కోటలో కూచుని ఇంకొక కోట కట్టబోతున్నావు! ఈమాటు మీ ఇద్దరికీ యుద్ధం తప్పదు," అన్నాను

కిశోర్ కూడా నవ్వి—"ను వ్విప్పటికి గ్రహించా వనుకుంటాను—స్త్రీకి భర్తే, ముఖ్యదుర్గమని. సరే, టెలిగ్రాం ఆఫీసు మూస్తారు. ఇప్పుడే వంటవాడి కిచ్చి పంపు," అన్నాడు.

వంటవాడికి డబ్బూ, ఫారమూ యిచ్చిపంపాను. "అయితే నేను వస్తాను. యుగళబాబు నాకోసం ఎదురుచూస్తూవుంటారు," అన్నాడు కిశోర్.

"కొంచెం కూచోండి. మీసంగతులు విని చాలారోజు లైంది. నేను ఈలోపల ఒకమనిషికి కబురుచేసి వస్తాను," అని లేచివెళ్ళి ఇద్దరు పిల్లల్ని పిలిచి నిస్తారిణిని పిలుచుకురమ్మన్నాను.

నేను లోపలికి రాగానే కిశోర్ అన్నాడు—"ఏముందిలే సంగతులు. అన్నీ సువార్తలే. నాకు మెడికల్ కాలేజీలో సీటు దొరికింది. మా అన్నగారు పని చేస్తున్న కోర్టులో ఒక జడ్జీగారు వున్నారు. ఆయన నా కేసంతా విని 'నువ్వు చాలా మంచిపనిచేశావు, దీనికి బహుమాన మివ్వటం పోయి జైలుకు కూడా పంపారా? చదువుకూడా ఆపారా? Let me see what I can do for you,' అని ఒక వుత్తరం మా మెడికల్ కాలేజీ ప్రిన్సిపాలుకు రాసియిచ్చారు. నేను అది తీసుకుపోయి మా ప్రిన్సిపాల్ కు యిచ్చాను. ఆయనకు నేనంటే చాలా యిష్టంకూడా ఆ వుత్తరం చూడగానే నాకు సీటు యిచ్చారు. సరే నీకు తెలుసునా? సుకుమార్ కు సంతానం కలగబోతున్నది"

ఈ మంచి వార్తలకు నేను నా సంతోషం వెలిబుచ్చాను ఇంతలో నిస్తారిణి వచ్చింది. ఆమెకు అన్నీ చెప్పిన మీదట అన్నది—"భగవంతుడు రక్షించాడు. లేకపోతే ఈ వ్యవహారం ఎట్లా తేలేదో చెప్పలేము నేను ముందే నిన్ను హెచ్చరించాను సరే, ఇకముందుకూడా మనం జాగర్తగా మెలగవలసి వుంటుంది."

"మా అన్నయ్యను రమ్మనమని టెలిగ్రాం యిచ్చాము. బహుశా రేపే ఆయన రావచ్చు," అన్నాను నేను

"పెళ్ళి ఎక్కడ నిర్ణయించారు?" అన్నది నిస్తారిణి.

"అన్నయ్య వచ్చాక అది నిర్ణయిద్దాము. రేపు మీరు తీర్థులుగారికి చెప్పండి, మనపీడ వదిలిపోయిం దని." అన్నాను నేను.

"తప్పకుండా చెప్పుతాను. అతను నీకు పరమ హితైషి."

మర్నాడు మధ్యాహ్నం మా అన్నయ్య వచ్చాడు. ఇక్కడ జరిగిన సంగతు లన్నీ మేము చెప్పాము ఆయన చాలా సంతోషించాడు. చాలా కాలానికిగాను మనసు విప్పి మాట్లాడాడుకూడా : "నీరూ! మన అమ్మ ఆశీర్వాదంవల్ల ఈ ఆపద గడిచిపోయింది. మనకి ఇక ఏ భయమూ లేదు! అన్నాడు.

అమ్మ జ్ఞాపకం వచ్చేవరకు నాకు ఏడుపు ఆగలేదు. నేను మనసులోనే ఆమెను ఉద్దేశించి నమస్కరించి "అమ్మా! నీ ఆత్మను నే నెంతో కష్టపెట్టివుంటాను. నన్ను క్షమించి ఆశీర్వదించు," అని ప్రార్థించాను

మర్నాడు ఉదయం కిశోరూ, ఆయన స్నేహితుడు యుగళబాబూ, తీర్థులు గారూ వచ్చారు. నిస్తారిణికి కబురు పంపించాను.

"అమ్మా! నేను అన్ని సంగతులూ విన్నాను. విని సంతోషపడ్డాను కూడా శుభస్య శీఘ్రం వివాహం ఎక్కడ జరుగుతుంది? నేను పంచాగం చూసి ముహూర్తం నిర్ణయిస్తాను," అన్నారు తీర్థులుగారు.

నిస్తారిణి ఆఫీసునించి ఒక పంచాగం తెచ్చియిచ్చింది. తీర్థులుగారు పంచాంగం చూసి — "ఇవ్వాళ మార్గశిర బహుళ తదియ. ఇంకా ఎనిమిది రోజుల తర్వాత ఏకాదశి బాగావుంది," అన్నారు

"సరే, ఆనాడే నిర్ణయించండి," అన్నాడు అన్నయ్య

"ఎక్కడ చేస్తారు వివాహం? నా ఉద్దేశం ఇక్కడ చేస్తేనే బాగా వుంటుం దని," అన్నారు తీర్థులుగారు.

"నా వుద్దేశంకూడా అదే," అన్నది నిస్తారిణి ఆ తర్వాత గొంతు తగ్గించి — "కాని రాజాగారిని నమ్మటానికి వీలులేదు. ఏమి ఆటంకాలుకల్గిస్తారో," అన్నది.

"ఏం, ఇది మొగలాయి రాజ్యమా? ఇలాంటి తరాజుల్ని చాలామందిని చూశాను నే నివ్వాళ రాజాగారితో మాట్లాడతాను వివాహం ఇక్కడ కాక పోతే కలకత్తాలో చేద్దాము. ఏమంటావు కిశోర్?" అన్నాడు అన్నయ్య.

"ఇక్కడ చెలా కుదురుతుంది. నేను మా వాళ్ళకి తెలపాలి. మా అన్నయ్య వస్తాడుకూడా," అన్నాడు కిశోర్.

"అయితే ముందు రాజాగారితో మాట్లాడివస్తాను. ఆ తర్వాత చోటు నిర్ణయిద్దాము," అన్నాడు అన్నయ్య.

అన్నయ్య, యుగళబాబు, వాళ్ళ పెద్ద మాస్టరు సంతోషబాబు కలసి రాజా గారిని చూడడానికి పోయారు. అక్కడినించి తిరిగి వచ్చినతర్వాత మా అన్నయ్య అక్కడ జరిగిన మాటలు చెప్పాడు

కిశోర్ కూ నాకూ వున్న సంబంధం మా అన్నయ్య రాజాగారితో చెప్పాడట. అది వినగానే ఆయన నిట్టూర్చి — I am really glad to hear this. I must congratulate this young man on his good luck," అన్నారట. తర్వాత కాసేపు వుండి - "మీ చెల్లెలు నా కీ సంగతి ఎందుకు చెప్పలేదు ! నేను బహుశా ఆమెను నొప్పించి వుండవచ్చు. నన్ను గురించి దురభిప్రాయపడవచ్చు. దీనికి ప్రక్షాళనగా రేపు ఆమెను సన్మానించి పంపుతాను," అని హెడ్ మాస్టరు సంతోషబాబుతో వేరే ఈ విషయం మాట్లాడారట.

మరునాడు సాయంత్రం నాకు స్కూల్లోనే సన్మానసభ ఏర్పాటు చేశారు- రాజాగారు అధ్యక్షులు. స్కూల్లో పంతుళ్ళేకాక ఊళ్ళోవారు కూడా చాలా మంది వచ్చారు. తీర్థులుగారు నన్ను ఆశీర్వదించారు. సంస్కృతశ్లోకాల్లో. ఒక రిద్దరు నా సేవను పొగుడుతూ మాట్లాడారు. టీపార్టీతో సభ ముగిసింది.

నేను ఆ మర్నాడే కలకత్తా బయలుదేరాను. నిస్తారిణి వస్తుంటే కన్నీరు పెట్టు కుంది. ఆమెను వదలి రావటానికి నాకూ కష్టంవేసింది. అన్నయ్య తీర్థులుగారిని వివాహానికి రమ్మనమని ఆహ్వానించాడు. ఆయన వస్తానన్నారు.

మేము కలకత్తా చేరిన తర్వాత అన్నయ్య వివాహప్రయత్నాల్లో నిమగ్ను డయ్యాడు. అన్నయ్యద్వారానే నాకు తెలిసింది, శంకర్ మెట్రిక్ పాసయిన ఒక చక్కటి పిల్లని పెళ్ళి చేసుకున్నాడని. నాకు సంతోషమే కలిగింది ప్రమీలను తీసు కొచ్చేటప్పుడు, శంకర్ నుకూడా పిలుచుకురమ్మన్నాను, అన్నయ్యతో.

అన్నయ్య పోయి ప్రమీలను తీసుకువచ్చాడు వాళ్ళ వెంట శంకర్ రాలేదు. "శంకర్ నిన్ను చూడటానికి సిగ్గుపడుతున్నాడు." అని చెప్పాడు అన్నయ్య. "అయితే నా పెళ్ళినాడైనా రాకుండావుండడుగా. ఆనాడు చూస్తాను!" అన్నాను నేను

నా వివాహం — కాదు, మా యిద్దరిమధ్యా సంధి - అనుకున్న లగ్నానికి అయింది. నేను గార్హస్థ్యజీవితంలో ప్రవేశించాను. శంకర్ పెళ్ళికి వచ్చాడు వివాహ మయిన తర్వాత నేను శంకర్ ను మా గదికి పిలిపించాను.

అతను వచ్చాడు. "శంకర్ దా! నువ్వు పోగొట్టుకున్న రత్నాన్ని నేను వెదకి, పట్టుకొచ్చాను ఇదుగో తీసుకో," అని కిశోర్ చెయ్యి అతనికి అందించాను. వాళ్ళిద్దరూ ఎంతో అప్యాయంగా కావలించుకున్నారు. వారి మధ్యకూడా సంధి జగిరింది నా మనసు ఎంతో తేలిక అయింది. [సమాప్తం.]

# తల్లిమనసు

"లైమైపోయింది శశీ! వెళ్తున్నాను'' అనేసి సైకిల్ బెల్లు మోయించి వెళ్ళిపోయాడు శివరాం— 'వచ్చేస్తున్నానుండండి.' అంటోన్నా విన్పించుకోకుండా.

అన్నం వార్చుచేసి, పొయ్యి అలాగే వదిలేసి గబగబా వీధి గుమ్మం దగ్గిరికి వెళ్ళింది శశిరేఖ; ఎదరింటివేపు తీక్ష్ణంగా చూస్తూ నించుంది.

ఎదరింటివాళ్ళ పిల్లవాణ్ణి గాలిలోకి ఎగరేసి ముద్దుపెట్టుకుంటున్నాడు శివరాం. అలాగే చూసింది శశి.

శివరాం ఆ పిల్లవాడి బుగ్గలు నిమురుతూ నవ్వుతూ ఏదో పల్కరించాడు. మళ్ళా ఓసారి ముద్దుపెట్టుకుని పక్కనే వున్న వాళ్ళమ్మచేతి కిచ్చి టా టా చెప్తూ సైకిలెక్కి దూసుకుపోయాడు

గిరుక్కున వెనక్కి తిరిగి లోపలికి వచ్చేసింది శశిరేఖ. డబ్బాలోంచి ఓ గుప్పెడు కందిపప్పు తీసి పొయ్యిమీది కెక్కించింది,

ఉయ్యాలలో అమాయకంగా నిద్ర పోతోన్న బిడ్డని చూస్తోంటే ఎంతవద్దనుకున్నా ఓ రకమైన నిట్టూర్పు వెలువడింది. కళ్ళు చెమర్చబోతే రెప్ప లల్లార్చి కన్నీటిని కళ్ళలోనే ఇంకించుకొంది. ఉయ్యాల తాళ్ళు పట్టుకుని కొడుకు మొహంలోకి తదేకంగా చూస్తూ నించుంది.

ఒక్క పదినిముషాల క్రిందట...

శివరాం తల దువ్వుకొంటూ గుమ్మం దగ్గిరికి వచ్చి అన్నాడు—"అన్నట్టు శశీ! మర్చిపోయాను. పెన్‌లో యింకు అయిపోయింది నిన్నే. కాస్త పోసి పెడుదూ! మళ్ళా నా చేతులకి యింకు అవుతుందేమో!"

శశి బాబుని భుజంమీద వేసుకు తిప్పుతోంది వాడికి నాలుగైదు రోజులనుంచీ ఒంట్లో బాగాలేదు—"కొంచెం వీణ్ణి తీసుకొండి ఇంకు పోసి యిస్తాను,'' అంటూ వాణ్ణి శివరాంకి అందివ్వబోయింది

'బాప్‌రే!'' కెవ్వు మని కేక వేసినంత పనిచేశాడు శివరాం "చాల్లే! ఇంకు పొయ్యకపోతే పోసీగానీ వాణ్ణి మాత్రం నే నెత్తుకోను వెధవ చీ..డిముక్కువాడూను. ఆ అధరామృతం కారింది కారినట్టే వుంటుంది. ఇవ్వాళే యిస్త్రీ

---

ముప్పాళ రంగనాయకమ్మ

బట్టలు వేసుకున్నానుకూడాను," అంటూ రెండడుగులు వెనక్కివేసి నించున్నాడు. శశి నవ్వుతూ పైటకొంగుతో కొడుకు ముక్కూ మొహం తుడిచింది— "పోనీ యిప్పుడు చూడండి; ఎంత నీటుగా వున్నాడో!"



"ప్లీజ్! ఉయ్యాల్లో వేసేద్దూ! వాణ్ణి నమ్మలేం," అంటూ ప్రాధేయపూర్వకంగా చూశాడు. శశి నవ్వి బాబుని పడుకోబెట్టి ఇంకు పోసి పెన్ను అందించింది. 'అన్నం వుడికిపోయిందో ఏమో' అనుకొంటూ వంటగదికేసి వెళ్ళింది.

'పైమైపోతోంది శశీ!' అంటూ హడవుడిగా పరిగెత్తాడు శివరాం.

తీరా శశి వచ్చి చూసేసరికి కనపడ్డ దృశ్యం...శివరాం ఎదిరింటివాళ్ళ పిల్లవాణ్ణి గాలిలోకి ఎగరేసి...చేతుల్లోకి అందుకుని...ముద్దులాడి..బుగ్గలునిమిరి.. టా టా చెప్పి......

ఆలోచించకుండా వుండలేకపోయింది శశి.

అలాంటి దృశ్యం ఇదివరకుకూడా చాలాసార్లు చూసింది. మొదట్లో మొదట్లో కుతూహలంగా చూసింది.

'వాళ్ళ పిల్లాడు బావుంటాడుకదూ?' అని శివరాం అంటే 'బాగానే వుంటాడు.' అంది మనస్ఫూర్తిగానే.

రెండుమూడుసార్లు ఆ పిల్లాణ్ణి శివరాం ఎత్తుకుని ఇంటికికూడా తీసుకువచ్చాడు – 'తినటాని కేమైనా వున్నాయా శశీ' అని అడిగితే – 'ఏం వున్నాయి? బెల్లం ముక్క పెట్టనా?' అంది నవ్వుతూ. ఆ మర్నాడేకాబోలు శివరాం బిస్కట్ల పేకెట్ తీసుకొస్తే – "ఇదేమిటి? మన వాడు అప్పుడే బిస్కట్లు తింటాడా?" అంది ఆశ్చర్యంగా.

'అబ్బే! వాళ్ళ బుజ్జికోసం తెచ్చాలే' అని, బయటికి వెళ్ళేప్పుడు ఆ పేకెట్టు కూడా పట్టుకువెళ్ళాడు శివరాం.

'మన వెధవ తినేసరికి ఇలాంటివి ఎన్ని తెచ్చుకోవాలో!' అంటూ తనూ వీధిగుమ్మంవరకూ వెళ్ళింది.

కాని...శశి మనస్సు అంత తేటగా ఎంతకాలం వుండగలదు? శివరాం పరాయి పిల్లవాణ్ణి అంత ఆప్యాయంగా ముద్దులు పెట్టుకొంటోంటే కళ్ళారా చూసే శశి ఒకరకమైన ఆవేదనతో – 'ఇది అసూయకాదుగదా?' అంటూ తనను తను ప్రశ్నించుకొంది చాలాసార్లు.

పసిబిడ్డని..ఎవరిబిడ్డకానీ...ప్రేమతో ముద్దు పెట్టుకున్నంతమాత్రాన...తను యిలా బాధ పడటంలో అర్థం వుందా? తన సంస్కారం ఇంత సంకుచితమా? ఎన్నో చదివి తెలిసికోగలిగే తనలో ఇంత మూర్ఖత్వమా?– తన విమర్శలకు తనే తట్టుకోలేక సిగ్గుపడిందికూడాను. శివరాంని అపార్థం చేసుకోకూడ దన్న ఆలోచన శశిని కొంత నిశ్చింతగా వుండనిచ్చింది.

కాని...పసిబిడ్డని ప్రేమించటమే అతని తత్వం అయితే ఆ ప్రేమ తన బిడ్డకి ఎంతవరకూ దక్కుతోంది? తన బిడ్డమాత్రం పసివాడుకాడా? పైగా అస్వస్థతలతో అర్భకంగా తయారౌతున్న బిడ్డని ప్రేమించాల్సిన అవసరం ఎక్కువగా లేదా?

శివరాం కొడుకుని ప్రేమించటంలేదని ఆ క్షణంవరకూ అనుకోలేదు శశి. కాని శివరాం ప్రవర్తన ఏవిధంగా సరి పెట్టుకోగలదు ?

ఆరోజు... శశి మరొకసారి అదే దృశ్యం చూడటంతో... ఒక నగ్న సత్యం... తిరస్కారం చాలా పరిమిత మనీ... తన హృదయం చాలా స్వార్థ పూరిత మనీ... బాగా తెలిసివచ్చింది.

తనభర్త... పరాయి స్త్రీ కన్నబిడ్డని అలా నవ్వుతూ ముద్దులాడుతోంటే నిష్కల్మషంగా చూసి సహించగలిగేంత మంచిది కాదేమో తను ఇన్నాళ్ళూ తను వుపేక్షించింది. చాలా పొరపాటు చేసింది — తన వివేకం వుత్తదేకానీ ! తనహృదయం చెడ్డదేకానీ : శివరాం... పరాయి పిల్లవాణ్ణి అంత యిష్టపడటాన్ని తను సమర్థించదు.

శివరాంకి...కొడు కున్నాడు.

శివరాం రక్తాన్ని పంచుకు పుట్టి... శివరాంని తండ్రిగా ఎంచుకు పెరుగు తోన్న కొడుకు వున్నాడు. ఎవరే అన్యా యము చేసినా అర్థం చేసుకోలేని పసి తనంలో వున్నాడు. శివరాంనుంచి పసి బిడ్డకు లభించే ఏ ప్రేమైనా వాడికే పరిమి తము కావాలి వాణ్ణి చూసీ చూడగానే శివరాం కన్నుల్లో జ్యోతులు వెలగాలి. వాడికోసమే శివరాం చేతులు ముందుకు సాగాలి. శివరాం నిజమైన కన్నతండ్రిగా తన బిడ్డని ప్రేమించాలి.

రోజంతా అదే ధ్యాసగా వుంది శశికి.

రాత్రి... భోంచేసి గదిలో కూర్చుని పుస్తకం చదువుకోవటంలో నిమగ్న మయ్యాడు శివరాం.

శశి అన్నం వడ్డించుకునే ప్రయ త్నంలో వుంది,

బాబు నిద్రలో వులిక్కిపడి లేచి రాగం అందుకున్నాడు. అందుకే ఎదురు చూస్తోన్నట్టు శశి గబగబా వుయ్యాల్లోని వాణ్ణి లేవదీసి గదిలోకి తీసికెళ్ళి శివరాంకి అందిస్తూ అంది — "కాస్సేపు వీణ్ణి ఎత్తు కోండి. నేను అన్నం తిని కంచాలు కడిగి వస్తాను. అన్నట్టు రేపటికి పప్పుకూడా నానబొయ్యాలి."

పుస్తకంలోంచి తలే ఎత్తలేదు శివరాం.

"మిమ్మల్నే. విన్పించటంలేదూ?" రెట్టించింది శశి.

"అబ్బ ! ఏమిటి శశీ ? " ఇబ్బందిగా చూశాడు.

"కాస్సేపు వీణ్ణి ఎత్తుకోమంటున్నాను నాకు పని వుంది."

"నేను చదువుకుంటున్నాను శశీ ! సీరియల్స్ పూర్తి చేయాలిగా ? "

"మీరు చదువుకోవటం నాకేం కన్పించటం లేదా ? ఏడుస్తున్నా డని తీసుకువచ్చాను. అసలే ఒంట్లో బాగాలేదు."

"ఫర్వాలేదులెద్దూ ! అలా పక్కమీద పడుకోబెట్టు. చూస్తూ వుంటాను."

శశిరేఖ మొహంలో కోపం తాండ వించింది. తీక్షణంగా చూస్తూ అంది— ''చూస్తూవుంటారా? రొంపతో జ్వరంతో బాధపడుతూ పసిబిడ్డ ఏడుస్తోంటే చూస్తూ వుంటారు కదూ? ఎంత జాలి! కన్న కొడుకు...పరాయి పిల్లవాడి మాత్రం తోచలేదేం?"

అర్థం కానట్టు చూశాడు శివరాం— ''అదేమిటి? ఎందు కలా అన్నావు?''

''ఎందుకో అన్నాను. మతిపోయి అన్నాను"

''పరాయి పిల్లవా డెవరు? ఎవ ర్నెత్తు కున్నాను నేను?

''లేరు ఎవ్వరూలేరు. మీరు ఎవ్వర్నీ ఎత్తుకోవటం లేదు, ముద్దులాట్టం లేదు, షికార్లు తిప్పటంలేదు. నేను...అక్కసు కొద్దీ అంటున్నాను. ఉత్తపుణ్యానికే అంటున్నాను." కోపా న్నంతా వెళ్ళబెట్టే సింది శశి.

''శశీ! వాళ్ళ బుజ్జిని అప్పుడప్పుడూ ఎత్తుకుంటా ననేకదూ?" సావధానంగా చూశాడు శివరాం.

"అప్పుడప్పుడూ ఏంఖర్మ? ఎల్ల ప్పుడూ ఎత్తుకు తిరగివచ్చునే!"

"నువ్వు మాట్లాడే దేదో తి న్న గా మాట్లాడరాదూ?''

శశి కోపంతో రెచ్చిపోతూ అంది— ''ఇంకా ఏం తిన్నగా? ఎంత తిన్నగా? పొద్దుటికి పొద్దుట పిల్లాణ్ణి ఎత్తుకో మంటే బట్టలు పాడుచేస్తా డనీ—చొంగ కారుస్తా డనీ...వంకపెట్టి త ప్పిం చు కున్నారు. వస్తున్నా నుండమంటోన్నా విన్పించుకోకుండా పైపైపోతోం దని హడావుడిగా పరిగెత్తారు. తీరా గుమ్మం దాటింతర్వాత మీరు చేసిం దేమిటి? ఆ ఎదరింటివాళ్ళ పిల్లణ్ణి గాలిలోకి ఎగరేసి బంతులాట అడటానికి పై మెక్కణ్ణుంచి వచ్చిందీ? వాడు మీ బట్టలు పాడుచెయ్య డన్న నమ్మకం ఎలా కుదిరిందీ? అలాంటి దృశ్యం నేను ఎన్నిసార్లు చూశానో... చూసినప్పుడల్లా నన్ను నే నెంత సమర్ధిం చుకొంటూవచ్చానో మీకు తెలుసా?

"మీరు...మీకై మీరు...ఒక్కసారి కూడా బాబుని చేతుల్లోకి తీసుకోలేదు. ఎన్నోసార్లు ముమ్మల్ని ప్రా ధే య ప డి నిష్ఠూర పెట్టి, బలవంతం చేసి అందిం చాను. ఒక్కసారికూడా వాణ్ణి మీరు మనస్ఫూ ర్తిగా ము ద్దు పె ట్టు కో లే దు. వాడికేసి ఒక్క క్షణంకూడా రెండుకళ్లు పెట్టుకు చూడలేదు—ఇంట్లో బిడ్డకి రొంప పట్టినా...జ్వరం వచ్చినా... విరోచనా లైనా...అకస్మాత్తుగా చావుకి సిద్ధమైనా చలించరు మీరు...వాడి గురించి ఏ మంచి చెడ్డలూ మీ మనస్సు కంటవు. తెలుసు నాకు...తెలుసు." శశి గొంతు భారమైపోయింది. గాభరాగా లేచాడు శివరాం.

"ఛ! శశీ! ఏమి టది? ఎందుకంత కోపం? నే నేమంత కానిపని చేశానసీ?"

శివరాం మొహంలోకి సూ టి గా



చూసింది శశి – "కానిపని అంటే ఏమిటి? పరాయిపిల్లల్ని ముద్దు చేస్తూ కన్నబిడ్డల్ని నిరసించటం కానిపని కాదని చెప్పగలరా? మీ సీరియల్ కధల కోసం జ్వరంతో బాధపడుతోన్న బిడ్డని ఏడిపించటం కానిపని కాదని చెప్పగలరా? ఎందుకు వాడిమీద మీకంత కసి? మీనుంచి ఎలాంటి ప్రేమా వాడికి అందకూడదా?"

శివరాంకి చాలా కోపం వచ్చింది – "శశీ! నీకై నువ్వు ఏవేవో వూహించుకుని బాధపడుతున్నావు, గానీ ఒక్కటి కూడా నిజంకాదు. నేను వాళ్ళ పిల్లాణ్ణి ఎత్తుకుంటానని నువ్విన్ని నిష్ఠూరాలాడటం బాగాలేదు. ఆ పిల్లాడు తెల్లగా.. బొద్దుగా... ఉంగరాల జుత్తూ... అదీ చూడగానే ముద్దువస్తాడు. వాణ్ణి చూస్తే నేనే కాదు, ఎవ్వరైనా చేతుల్లోకి తీసుకోకుండా ఉండలేరు.

నిర్ఘాంతపోయినట్టే చూసింది శశి. గిర్రున వెనక్కి తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

తెల్లబోయాడు శివరాం. అక్కడే నించున్నాడు చాలాసేపు. నెమ్మదిగా వంటింటి గుమ్మందగ్గిరకెళ్ళి నిలబడ్డాడు.

బాబు వుయ్యాల్లో నిద్రపోతున్నాడు. శశి తలదించుకు గబగబా అన్నం తింటోంది.

"శశీ! నీకు కోపంవచ్చింది కదూ?" అదోమాదిరిగా అడిగాడు శివరాం.

"లేదు" శశి తలఎత్తలేదు – "నేనే

పొరపడ్డాను. నిజమే, పిల్లలంతా చూడగానే ముద్దువచ్చేంత అందంగానే వుండాలి. తెల్లగానే వుండాలి. లేకపోతే ఎలా ఎత్తుకోగలం? ఎందు కెత్తుకోవాలి? నిజమే. నేనే పొరపడ్డాను."

శివరాం కాస్సేపు శశికేసే చూసి గబగబా వెళ్ళి సీరియల్‌కథ మూసిపెట్టి పక్కమీద పడుకున్నాడు.

* * *

మర్నాడువుదయం — బద్ధకంగా లేచి గదిలోంచి బయటికి వచ్చాడు శివరాం. వంటింటిగడపలో చాపమీద పక్కవేసి పడుకోబెట్టిన బాబు...చాపకి బారెడు దూరంలో నీళ్ళతడిలోకి కాళ్లు పెట్టి బోర్లా పడుకున్నాడు. అంతవరకూ శశిరేఖ పప్పు రుబ్బటంలో మునిగి కొడుకువేపు చూడనేలేదు శివరాం బైటకి వచ్చినప్పుడే తలతిప్పిచూసింది. టూత్‌బ్రష్ ఇవ్వటానికి లేచింది.

వస్తూనే శివరాం కొడుకుని సరిగా పక్కమీద పడుకోబెట్టే వుద్దేశ్యంతో లేవదీయబోయాడు. శశి చటుక్కున వాణ్ణి అందుకుని భుజంమీద వేసుకొంటూ — టూత్‌పేస్ట్ తెచ్చి యిచ్చింది — "తొందరగా మొహం కడుక్కోండి. చాలా ఎండెక్కింది," అంది మామూలుగా.

"రాత్రి చాలా సేపటివరకూ నిద్ర పట్టలేదు శశీ!"

విని వూరుకుంది శశి.

శివరాం మొహం కడుక్కుని వచ్చి కొడుకుదగ్గిర చాపమీద కూర్చున్నాడు. బాబు బొటనవేలు నోట్లో పెట్టుకుని చూస్తూ పడుకున్నాడు. శివరాం వాడిమీద చెయ్యి వెయ్యబోతే శశి వారిస్తోన్నట్టే అంది — "వాణ్ణి అంటుకుంటే ఎత్తుకోమని ఏడుస్తాడు. చూస్తూ పడుకున్నాడుగా? ఫర్వాలేదు."

శశి అట్లు వెయ్యటం పూర్తిచేసి శివరాం ముందు పెట్టింది. తను బియ్యం ఏరుతూ కూర్చుంది.

శివరాం టిఫిన్ కాఫీ అయ్యాక పేపరు చూస్తూ కూర్చున్నాడు. బాబు వున్నట్టుండి బోర్లపడి నుదురు చాపకి ఒత్తుకుని కేరుమన్నాడు. శివరాం పేపరు పడేసి రెండంగల్లో వచ్చాడు. అప్పటికే శశి కొడుకుని ఒళ్ళో పడుకోబెట్టుకొంటూ — "నే నెత్తుకుంటానులెండి. మీరు పేపరు చదువుకోండి మళ్ళా ఆఫీసు వేళౌతుంది," అంది.

"నువ్వు బియ్యం ఏరుతున్నావుగా? నే నెత్తుకుంటాను."

"అబ్బే! వాడికి పాలుకూడా యివ్వాలి. పోనీ బియ్యం ఏరండి యిలా కూర్చుని," అంది నవ్వు తెచ్చుకొంటూ.

"నాకు చేతకాదులేవోయ్" అంటూ మళ్ళా పేపరు అందుకున్నాడు శివరాం.

శశి బాబుని ఒళ్ళోనే పడుకోబెట్టుకుని బియ్యం ఏరింది. కూరముక్కలు తరిగింది... దాదాపు ఎత్తుకునే పను లన్నీ

చేసింది. శివరాం స్నానం చేసి భోంచేసి ఆఫీసుకి బయల్దేరాడు. శశి ఎప్పట్లా శివరాం వెనక వెళ్ళలేదు. వీధి గుమ్మం కేసి చూడలేదు. సాయంత్రం ఇంటికి వస్తూనే అడిగాడు శివరాం—

"బాబుకి జ్వరం తగ్గిందా ?"

"బాగానే వుంది."

"ఏమిటి ? జ్వరమా ?"

బాబు వుయ్యాల్లో నిద్రపోతూ కన్పించాడు. లేచినప్పుడల్లా శశే హాజరై వుయ్యాల వూచి వాణ్ణి ఎత్తుకు సముదాయించి కిక్కురుమనకుండాజేసి పనులన్నీ చేసుకొంది.

రాత్రి... శివరాం స్నానం చేసి పుస్తకం చదువుకొంటూ కూర్చుంటే "అన్నం వడ్డిస్తాను. రారాదూ?" అంటూ పిలిపింది.

ఇద్దరం కలిసి భోంచేద్దాంలే. వాణ్ణి నిద్రపోనీ !" పుస్తకం మూయకుండానే జవాబు చెప్పాడు శివరాం.

"అప్పుడే నిద్రపోడు. ఇప్పటివరకూ పడుకునే లేచాడు. ఫర్వాలేదు. ముందు మీకు వడ్డించేస్తాను;" అనేసి లోపలికి వెళ్ళి పీట వేసి అన్నం వడ్డించింది. శివరాం లేచివెళ్ళాడు. భోంచేస్తూ చాలా విషయాలు తనకై తనే మాట్లాడాడు. కూరల్ని పొగిడాడు—ఉన్నట్టుండి— "ఏం ? అంత ముభావంగా వున్నావ్ ?" అంటూ శశి మొహంలోకి చూశాడు.

"అబ్బే ! ఏంలేదు. మీ రేదో చెప్తోంటే వింటున్నాను." అంటూ లేచి కొడుకుని వుయ్యాల్లో పడుకోబెట్టింది.

"వాడు పడుకున్నాడు గాని నువ్వు వడ్డించేసుకోరాదూ ?"

"మీ కంచం తీసేసి కూర్చుంటాను. అయిపోవచ్చిందిగా" రెట్టించ లేదు శివరాం. చెయ్యి కడుక్కు లేచాడు. నిద్ర పోతున్న కొడుకు కేసి ఒక్కసారి చూసి ఒక్కపొడి నములుతూ వీధి గుమ్మంలోకి వెళ్ళాడు. ఎదరింటి దంపతులు కొడుకుని ఆడిస్తూ వీధిలో కుర్చీలు వేసుకుకూర్చున్నారు ఆ సందు సాయంత్రం అయ్యేసరికే నిర్మానుష్యంగా ప్రశాంతంగా వుంటుంది. రాత్రుళ్ళు భోజనాలు చేసి ఆడవాళ్ళూ మగవాళ్ళూ కాస్సేపు ఆరుబయట కూర్చుని...ఒకళ్ళ నొకళ్ళు పల్కరించుకుని... కావలసినంత గాలి పీల్చుకుని...నిద్రాదేవత ఆవరిస్తోంటే ఇళ్ళల్లోకి పోవటం పరిపాటే.

శివరాంని చూస్తూ ఎదరింటావిడ కుర్చీలోంచి లేచింది. "రండి అన్నయ్యగారూ! వదినగారింకా భోం చెయ్యలేదా?" అంటూ పలకరించింది—"ఒరేయ్ బుజ్జీ ! మామయ్యగా రొచ్చార్రా ! వెళ్ళు! ఎత్తుకుంటారు," అంటూ చంకలో పిల్లాణ్ణి చనువుగా శివరాంకి అందించింది.

శివరాం బుజ్జిని ఎత్తుకుని ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు. ఆవిడ భర్తకేసి చూస్తూ అంది—"మన బుజ్జీ అంటే అన్నయ్యగారికి చాలా యిష్టమండీ ! ఈ వెధవని ఎత్తుకోకపోతే ఆయనకి తోచదో ఏమిటో అనుకుంటాను," అంటూ నవ్వింది.

శివరాం నెమ్మదిగా లేచాడు. బుజ్జిని వాళ్ళ నాన్నకి అందిస్తూ అన్నాడు— "వస్తానండీ! మావాడికి కొంచెం ఒంట్లో బాగాలేదు. లేస్తాడేమో! వాళ్ళమ్మ అన్నం తింటోంది. వస్తానమ్మా!" అంటూ గబగబా లోపలికి వచ్చేశాడు.

శశి బాబుని భుజంమీద వేసుకు తిప్పుతోంది అన్నం తింటూ తింటూ లేచినట్టు — పళ్ళెంలో మజ్జిగఅన్నం మిగిలే వుంది. శివరాం బాబుకోసం చేతులు జాపుతూ—

"ఇలా ఇవ్వు శశీ! నీ భోజనం కానీ!" అన్నాడు.

"ఫర్వాలేదు, నిద్రపోయాక తింటాలెండి;" అంటూ శశి అన్నంపళ్ళెం మీద ఓ ప్లేటు మూతపెట్టింది.

"పోనీ నే తిప్పుతాగా? తొందరగా తెములుచుకు రారాదూ?"

"మీ దగ్గిర వుండడు, ఒంట్లో బాగా లేదు."

"ఎందు కుండడూ? వాడికేం తెలుస్తుందీ?" అంటూ చొరవగా కొడుకుని తీసుకోబోతోంటే శశి యివ్వలేదు— "వద్దులెండి. నాకీక ఆకలిగాకూడా లేదు. అన్నం తినను. నేనే నిద్రబుచ్చుతాను."

"శశీ!" తీక్షణంగా చూశాడు శివరాం— "పొద్దుటినుంచీ చూస్తున్నాను. బాబుకి నా చిటికెనవేలుకూడా తగలనివ్వకుండా చేస్తున్నావు. నేను గ్రహించలేదనుకున్నావా?"

శశి నిర్లక్ష్యంగా అంది— "మీరు గ్రహిస్తే చాలా సంతోషం. నా ప్రయత్నంకూడా అందుకే."

"అంటే ఏమిటి నీ వుద్దేశ్యం?"

"గుండెల్లో దాచుకు కుళ్ళిపోవటం నా వుద్దేశ్యంకాదు: మీ కిష్టం లేని పని మీరు చెయ్యనేవద్దు."

"బాబుని ఎత్తుకోవటం నా కిష్టం లేదా? ఎవ రన్నారు?"

"ఎవ రన్నా నేను నమ్మను. ఎవరన్నా నేను వూరుకోను. మీరే అన్నారు. ఇక నుంచి వాణ్ణి ఎత్తుకోవద్దని మళ్ళీ చెప్తున్నాను."

"తీవ్రంగా అన్నాడు శివరాం—" నా కొడుకుని నన్ను ఎత్తుకోవద్దనటానికి నువ్వెవరివి మధ్య?"

"మీ కొడుకా?" సంభ్రమంగా అంది శశిరేఖ — "మీరు ఆలోచించే మాట్లాడుతున్నారా? నల్లటి నలుపు ... పీచు జుట్టు...తెగుళ్ళతో తయారైన ఎముకల గూడు...మీకు చూడగానే అసహ్యం వేసే వీడు మీ కొడుకా? మీరు మనస్సుని ఎంత బాధ పెట్టుకుని ఈ విషయము ఒప్పుకున్నారో నేను వూహించలేననుకున్నారా?"

"శశీ!"

"నేను మిమ్మల్ని తప్పు పట్టటంలేదు. అందమైన — ఆరోగ్యమైన బిడ్డలు కావాలని తల్లిదండ్రులు కోరుకోవటంలో అత్యాశ ఏమీలేదు. మీ కోరిక ఎంత

సహజమైనదైనా తీరేదికాదు. బాబుకి ఎంతమంది తమ్ముళ్ళు పుట్టినా... ఎంత మంది చెల్లెళ్ళు పుట్టినా ... వీడికన్న అందముగా వుండరు. వీడికన్న తెల్లగా వుండరు. వీడికన్న ముద్దుగా వుండరు. పరాయివారి బిడ్డల్ని చూసి మాత్రమే సంతృప్తి పడాల్సిన మీ దౌర్భాగ్యానికి నేనుకూడా ఎంతో విచారిస్తున్నాను.

మీరు ... ఆదిలోనే పెద్దపొరపాటు చేశారు మీ బిడ్డలకు తల్లి కాబోయే వ్యక్తిని నిర్ణయించుకునే సమయంలో చాలా ఆలోచనారహితంగా ప్రవర్తించారు కన్నతల్లి రూపలావణ్యాలూ ... అందచందాలూ బిడ్డలకు సంక్రమిస్తాయని ఆలోచించలేనంత అవివేకంగా ప్రవర్తించారు.''

శశిధోరణికి విస్తుబోయాడు శివరాం - "శశీ నీ అందచందాలను ఎన్నడైనా కించపరిచానా ? నిన్ను మనస్ఫూర్తిగా అంగీకరించేకదా పెళ్ళి చేసుకున్నాను. ఎందుకంత బాధపడతావు ?''

నిస్తేజంగా చూసింది శశి —— ''బాధ గాక ఏముంది ? అందమైన బిడ్డల్ని కని భర్తకు అందించలేని ఆడదానికి బాధగాక ఏం మిగులుతుంది ? తండ్రి ప్రేమకు నోచుకోని బిడ్డలకు దుఃఖంగాక ఏం దక్కుతుంది? మీరు నన్నూ నా అందచందాలనూ ఎంత విమర్శించినా ఇంత బాధ పడేదాన్ని కాను. నేను కన్నబిడ్డని...వాడి అందాన్ని ...మీరు హీనంచేస్తోంటే ... ఎవరోకాదు...సాక్షాత్తూకన్నతండ్రి..." మాట్లాడలేకపోయింది.

తదేకంగా శశిని చూస్తూవున్న శివరాం తనలో తను అనుకొంటూన్నట్టే అన్నాడు : "శశీ : నిజంగా నేను తెలివి తక్కువగా మాట్లాడాను. బాబుని విమర్శించుకుంటున్నా నన్న జ్ఞానం కూడా లేకుండా ఏమో అన్నాను. కాని...వాణ్ణి నేను ఎన్నడూ నిర్లక్ష్యం చెయ్యలేను శశీ : నన్ను నమ్ము."

"అదంతా నేను ఆలోచించలేను—" దృఢంగా అంది శశి "మీరు వీడికి తండ్రి. మీనుంచితండ్రిప్రేమ అన్నివిధాలా వీడికి దక్కాలని కోరుకున్నాను మీ యిష్టాలూ అయిష్టాలూ నాకు తెలీవు. మీ ఉదాసీనతని...ఎంత దాగివున్నా బాబుకి తల్లిగా నేను సహించలేను. ఇది మూర్ఖత్వమే అయితే ఇదే నన్ను జీవితమంతా వెన్నాడుతుంది." ఎంత ప్రయత్నించినా శశి కన్నీళ్ళు ఆగలేదు. చెంపలమీదుగా జార సాగాయి

శివరాం శశికి దగ్గిరిగా వెళ్ళి భుజం మీద చెయ్యి వేసి కన్నీళ్ళు తుడుస్తూ అన్నాడు.—— "నన్ను క్షమించు శశీ ! నా మూర్ఖత్వం నాకు బాగా అర్థమైంది. బాబు జన్మకి నువ్వొక్కదానివే కారణం కాదు. నేనుకూడా. ఇక నన్నెప్పుడూ యిలా శిక్షించకు శశీ ! ఏదీ ! నా బాబుని భుజంమీద వేసుకుంటాను. నువ్వు అన్నం తిను," అంటూ కొడుకుని అందుకుంటోంటే శశి వారించలేదు.



# కళ్యాణమందిర్

## కోడూరి కౌసల్యాదేవి

కళ్యాణికి మైత్రేయీ, ఆమె ఐశ్వర్యం కళ్ళల్లో మెదుల్తూవుండేది. వారిద్దరి మధ్యా ఉండే ఆప్యాయతలు ఆమె గుండెలను రేపేవి. ఇంట్లో తన పెండ్లి విషయంలో తల్లిదండ్రులమధ్య ఘర్షణలు తన మనసును కుంగదీశేని మైత్రేయీ ప్రకాశ్ ల ఆహ్వానంపై వారితోపాటు సినిమాకు కారులో బయలుదేరింది ఆరోజు.

—ఇక చదవండి.

కళ్యాణి మానసికస్థితి అందలం ఎక్కినంత ఆనందపడింది. కారు ఎంతఘనంగా సాగిపోయింది! ఎప్పుడూ చూడని ఎన్నడూ కూర్చోని ఆ ఫస్ట్‌క్లాస్ కుర్చీలు! అదేమిటో బాదంఖీరట! తా నంతకుమునుపు అటువంటివి ఎరుగనే ఎరుగదు! సర్వం మరచి హాయిగా తీయగా మాట్లాడుకొంటూ ఏం ఉల్లాసంగా ఉన్నారు మైత్రేయీ ప్రకాష్ లిద్దరూ! ఒక్క వా రిరువురే నన్నమాటేమిటి? ఎందరెందరు ఎన్ని రకాలుగా వచ్చారు, కళ్ళు జిగేల్ మన్పిస్తూ! ఎంతహాయిగా వుంటుంది ధనిక జీవితం!

సినిమా చూడడం మరిచి మనసున ఆకాశ హర్మ్యాలు నిర్మిస్తూన్న కళ్యాణి, హఠాత్తుగా ప్రకాష్ విసిరిన విసురుకు అదిరిపడింది. "మైత్రీ! ఆ హీరోయిన్ అచ్చంగా మన కళ్యాణిలాగే వుందికదూ?"

"నిజం!" మైత్రేయికూడ సంతోషాశ్చర్యాలను వ్యక్తపరచింది; "సరిగా నేనూ అదే చెప్పా లనుకుంటున్నాను. చూడు కళ్యాణీ, అచ్చంగా ఆ హీరోయినే నువ్వు—నువ్వే ఆ హీరోయిన్!" అన్నది.

ఆ మాటలు నిజమే ననిపించిన కళ్యాణికండ్లు ఆ చీకటిలోకూడ ప్రకాష్ చిలిపి చూపులకు ఖంగారుపడి వాలిపోయాయి. మొత్తంమీద ఆ రోజు కళ్యాణి మనస్సును పూర్తిగా పారవేసుకుని యింటికి చేరింది.

"రేపటినుండీ మాతో నువ్వు తప్పక వస్తూండాలి." కారు దిగి వెళ్ళిపోతూన్న కళ్యాణిని మరీ మరీ హెచ్చరించాడు ప్రకాష్.

కారుదిగి లోపలికివెళ్ళిన మైత్రేయీ ప్రకాష్‌లకు తల్లితండ్రుల ఆదరాభిమానాలు. నౌఖర్ల ఎదుర్కోళ్ళూ స్వాగతం పలికితే, కళ్యాణి యింట కళ్యాణి నొక నరకం ఆహ్వానించింది. తల్లీ తండ్రీ కాట్లకుక్కలకంటె హీనంగా దెబ్బలాడుకుంటున్నారు. రామ్మూర్తి మర్నాడు పాఠశాలలో సెకెండు ఫారమ్ విద్యార్థులకు డిక్టేట్ చేయవలసిన తెలుగునోట్సు బల్లమీ దుంచి భోజనానికి వెళ్ళివచ్చేలోగా, పసివాళ్ళిద్దరికీ ఎన్నడూలేని మైత్రీభావం ఆ సుమూహూర్తాన కుదరగా, ఇద్దరూకూడి వాటికి కాగితపు విమానాల రూపాంతరం కల్పించి వినోదిస్తున్నారు. వెంటనే పసిపిల్లల వీపుపై విందు జరిగిపోయి, వినోదం విలాపంగా మారి, పెద్దవారిమధ్య ప్రలాపనలు ప్రారంభమయి, ఘోరయుద్ధంగా పరిణమించింది. ఆ గాలిదుమారం అంతా ఏకమై అప్పుడే లోనికి ప్రవేశించిన కళ్యాణిపైకి ఉధృతంగా వీచింది.

భయపడ్తూ భయపడ్తూనే "ఏమిటమ్మా?" అని కారణ మరయబోయిన కళ్యాణికి ఈటెలవంటి మాటలు వచ్చి తగిలాయి.

"ఏముంది? నువ్వు హాయిగా ఎటో తగలడ్డావ్, నేను పనే చేసుకోనా — ఈ పిల్లలనే చూచుకోనా? భోజనాలు పెడ్తూ వంటింట్లో పడున్నాను; ఈ పసివెధవలేమో ఏవో కాగితాలు చింపేశారట మధ్యన చీవాట్లు నాకు!" ముక్కు చీదుతూ విషయవర్ణన చేసింది జానకమ్మ.

తండ్రి అందుకున్నాడు. "మహారాజకుమార్తెలాగా నీకు సినిమాలూ, షికార్లూ ఒకటి తక్కువయ్యాయా?

నిర్ఘాంతపోయి నిలబడింది కళ్యాణి

"ఇలా షికార్లు మరిగితే నేను రోజూ డబ్బెక్కడినుంచి తీసుకురాను?" తిరిగి ఉరిమాడు రామ్మూర్తి

"కావలిస్తే అమ్మ నడుగు. నే నేమీ డబ్బు ఖర్చుపెట్టి వెళ్ళలేదు. వాళ్ళ మైత్రేయి రమ్మని తీసుకువెళ్ళింది," ఎగదన్నుకు వస్తూన్న దుఃఖాన్ని ఆపుకొంటూ చెప్పింది కళ్యాణి.

ఏమేమో గొణుక్కుంటూ తిట్టుకుంటూ తిరిగి నోట్సు తయారు చేసుకోవడంలో లీనమైపోయాడు రామ్మూర్తి ముక్కుచూ మూల్గుతూ ఓ ప్రక్కన నడుం వాల్చింది జానకి. "ఈ పాట్లు పగవాడికైనా వద్దురా భగవంతుడా. ఈ ఆడబ్రతుకు బ్రతికేకంటె అడవిలో మానై జన్మించడం వెయ్యింతలు నయం తెల్లవారి లేచిన దగ్గర్నుంచీ ప్రతిదానికీ యిబ్బందే; ఇది చాలక అడుగడుగునా చీవాట్లు, నిందలు ఎలా

భరించనురా తండ్రీ ? ఎప్పటకో ఈ యాతన విరగడయ్యేది.........?" నిద్ర పట్టే వరకూ ఆ సామాన్య తరగతి సంసారిణి విలాపం అలా సాగిపోతూనే వుంది.

కళ్యాణి భోజనంచేయ కూర్చున్న దన్నమాటేకాని సహించలేదు. అడుగడుగునా తనకూ మైత్రేయికీ గల భేదమూ, ప్రకాష్ సుందరరూపమే — అతడి చతుర సంభాషణ, చలాకీతనమే ఆమెను వెంటాడుతున్నాయి. 'మైత్రేయిముందు నే నెంత ? ఛీ, ఎందుకు నా కీ బ్రతుకు ?' కరగిపోయిన హృదయంలోని బాధ కన్నీరై ప్రవహించింది తినీ తినకా లేచిపోయి, శయ్య జేరింది. తిన్నదో లేదో, బాధపడుతున్నదో, విలపించుతున్నదో చూడడాని కెవరికి రావాలి ? ఎవరికి తీరికి ? కుటుంబంలోని అందరూ అడుగడుగునా ఏవో బాధలలో మునిగితేలేవారే !

శయ్య జేరిన కళ్యాణినికి కంటిరెప్ప మూతేపడలేదు. 'కలవారి జీవనమే కడు సౌఖ్యవంతంకదా ! బ్రతికితే అలాగే బ్రతకాలి. ఎందు కీ చాలీచాలని అనామక జీవితాలు ?' అవే ఆలోచనలతో, వెన్నెలలో కడు రమ్యంగా చూపట్టుతూన్న మైత్రేయి మేడను చూస్తూ, ఎప్పుడో అర్ధరాత్రివేళ నిదురించిన కళ్యాణికి - తానే మైత్రేయిస్థానంలో వున్నట్టూ ప్రకాష్‌తో విహరిస్తున్నట్టూ కమ్మని కల వచ్చింది.

తెల్లవారేసరికి ఏముంది ? యధావిధి నరకకూపంలో జీవితం — తలిదండ్రుల సాధింపులూ, ఎడతెరిపిలేని చాకిరీ. ఉదయం ఎనిమిది గంటలవేళ ఇంకా కళ్యాణి తల్లి ఆజ్ఞలు పాటిస్తూ పనులు చేసుకుబోతూండగా మైత్రేయి, పనిమనిషిని పంపించింది, 'కళ్యాణిని ఒకసారి ర' మ్మని.

"ఏమిటి పని ? ఏమైనా విశేషమా ?" అడిగింది కళ్యాణి

"అబ్బే ఊరికెనే కబుర్లకూ, కాలక్షేపానికీ. కాలేజీకి వెళ్ళలేదు. ప్రకాష్‌బాబుగారితో పెద్దలు పెళ్ళిమాటలు మాట్లాడుతున్నారు, ఆ అబ్బాయిగారు ఇక్కడున్నన్నాళ్ళూ ఆ అమ్మాయిగారు కాలేజీకి పోరు "

కళ్యాణి మనస్సు నేదో గట్టిగా పిండినట్లైంది, "నాకిప్పుడు తీరికెలా ఔతుంది ? చాలా పను లున్నాయి. వీలైతే సాయంత్రం వస్తాను," అని చెప్పి పంపేసింది ఆ మనిషిని. నింజగా ఆరోజున యమధర్మరాజు వచ్చినా, వైకుంఠవాసు డేతెంచినా క్షణంకూడా తీరిక లేదని చెప్పి పంపేయవలసినంత ఊపిరాడని పను లున్నాయి కళ్యాణికి. తల్లీ తండ్రీ హోరాహోరి ఘర్షణపడుతున్నారు. 'నాపిల్లను నాతమ్ముడి కుమారునికే యిచ్చుకుంటా'నని తల్లీ, 'కాదు, నా స్నేహితుడికే — రెండో పెళ్ళి అయితే నేం ?' అని తండ్రీ.

"నీ తమ్ముడి కిస్తే ఏముంటుందే, చిప్పా కట్టాను ?" రామ్మూర్తి ఛీత్కారం.

"ముసలాడి కిచ్చి చేతులు దులుపుకుంటే ఏమైనట్టు? కలో గంజో త్రాగి నూరేళ్ళు బ్రతుకుతుంది కాని, ఆ మాయదారి బాధలన్నీ నాబిడ్డ పడలేదయ్యోయ్ దేవుడా!" అంటూ శోకాలు పెడ్తూన్నది జానకమ్మ.

"అతనికిచేస్తే ఏకొదువావుండదు మనం ఒక్కదమ్మిడీ ఖర్చుపెట్ట నవసరంలేదు. ఎప్పుడైనా వాళ్ళే మనని ఆదుకోవచ్చుకూడా. పరిస్థితి అర్థం చేసుకోకుండా గోల పెడ్తావేం?" అని చీదరించుకుంటూనే, భోజనం చేయకుండా వెళ్ళిపోయాడు రామ్మూర్తి.

సమాధానం చెప్పకుండా, జానకి తానూ ఏడుస్తూ అభోజనంగానే వుండి పోయింది. అటువంటి విషవాతావరణంలోని కళ్యాణి మానసికస్థితి ఎట్లా వుండగలదో అనుభవజ్ఞులకే సుగ్రాహ్యం. అదీకాక తల్లి పడుకున్నందువల్ల ఇంటెడుపనీ, పిల్లల ఆలనపాలనలు తానే చూచుకోవాలి.

నిర్వేద మలముకొన్న హృదయంతో, తులసికోటచెంత కూర్చున్న కళ్యాణి శేషు రాకను గమనించనేలేదు.

"ఏమిటి కళ్యాణీ ఆ దీర్ఘాలోచన?" మృదువుగా ప్రశ్నిస్తూ ప్రక్కన కూర్చున్నాడు శేషు. అతడే జానకి మేనల్లుడు.

"ఓ! ఎప్పు డొచ్చావ్? నేను చూడనేలేదు." కొద్దిగా జరుగుతూ అడిగింది కల్యాణి.

"ఏం? బొత్తిగా మా యింటికి రావటం మానేశావ్?"

"తీరికలేక." పొడిగా అన్నది కళ్యాణి.

"తీరికలేకా, లేక ధనవంతులైన స్నేహితులూ, కార్లలో షికార్లూ ఎక్కువై నన్ను మరచిపోయావా?"

తల త్రిప్పి చూచిన కళ్యాణి అతడు హాస్యంగా అనడంలేదని గ్రహించింది.

"నిన్న సినిమాకు నేనూ వచ్చాను," అన్నాడు శేషు, కళ్యాణి మాట్లాడేలోగానే.

"మరి పలకరించలేదేం?"

"నువ్వెక్కడో మేడమీద ఫస్ట్‌క్లాస్‌లో కూర్చున్నావూ......" అర్థోక్తిలో వదిలేశాడు శేషు,

అర్థం చేసుకుంది కళ్యాణి తనను పలుకరించడానికతడు సిగ్గుపడ్డా డన్నమాట! మాట మార్చుతూ, "ఏమిటి విశేషాలు? ఉద్యోగ మెలావుంది" అనడింగింది.

శేషుముఖం వికసించింది. "ఆ విషయం చెప్పడానికే వచ్చాను. నా జీతం యిప్పుడు వంద అయ్యింది. మా షావుకారుగారు మంచివారు. గుమస్తా లందరూ



చందమామ వారి

# దొరికితే దొంగలు

దర్శకత్వం పి సుబ్రహ్మణ్యం ✦ సంగీతం ఎస్ రాజేశ్వరరావు

నవయుగ

కలసి చేసుకొన్న విన్నపాన్ని మన్నించి, అందరికీ జీతాలు హెచ్చించారు; బోనసులు పెంచారు; ఈ పండుగకు క్రొత్తబట్ట లిచ్చారు."

నిట్టూర్చి ఊరుకుంది కళ్యాణి.

"అదేమిటి కళ్యాణీ, నీకు సంతోషంగాలేదూ? ఇదుగో ఈచీర నీకోసం తెచ్చాను, జీతం ఎక్కువైందన్న సంతోషంలో. పన్నెండు రూపాయలు దీని ఖరీదు. బాగుందా? రోజూ మామయ్య నాకు జీతం తక్కువని నిరసిస్తాడు. ఇవ్వాళ వంద రూపాయ లని విని నిజంగా ఎగిరి గంతేస్తాడు......"

కళ్యాణి మౌనం చూచిన శేషు వాగ్ధోరణి ఆగిపోయింది. "ఏం కళ్యాణీ, అలా వున్నావ్?'' అనడిగాడు నెమ్మదిగా.

నిర్వేదంతో కూడిన నవ్వు నవ్వింది కళ్యాణి. మనం అసలు ఇంతకంటె బాగా వుండడం సాధ్యమా బావా?"

"అంటే?"

"ఏముంది? నిత్యం యేవో ఓ బాధలు. నువ్వు వందరూపాయలకి మురిసిపోతు న్నావ్. రెండొంద లొచ్చినా మన బ్రతుకు లింతేకదా! మరో గుప్పెడు తిండి తిన గలమేమో! అంతేగా? ఇంతకంటె ఎదుగూ బొదుగూ ఎన్నటికైనా వుంటుందా?"

దిగ్భ్రాంతి జెందిన శేషు నిర్విణ్ణుడై చూచాడు, మాటలుదక్కి, చేష్ట లుడిగి.

కొలది సేపటికి తిరిగి కళ్యాణే అన్నది: "మైత్రేయిలాగా నిర్విచారమైన జీవితం గడపాలి; కాకుంటే చావాలి. ఎందు కీ చాలీచాలని జీవితాలు? నిత్యం సమస్యా మయం; వ్యథా భరితం, ఛీ."

అర్థమైనట్టు తల పంకించాడు శేషు. వ్యథాపూరిత స్వరంతో సంబోధిస్తూ మంద స్వరంతో అన్నాడు: ''కళ్యాణీ ఈ ప్రపంచంలో వ్యాధు లన్నిటినీ మించిన భయంకర వ్యాధి నిన్ను ఆవేశించబోతోంది ఇది చాలా ప్రమాదకరమైనదిసుమా!"

ఈసారి దిగ్భ్రమ నందడం కళ్యాణి వంతైంది. అర్థం కానట్టు కనుబొమలుముడిచి, ప్రశ్నార్థకంగా చూస్తున్న ఆమెకు మెల్లనిస్వరంలో సానునయంగా చెప్పసాగాడు శేషు. "ఉన్నదానిలో వివేకంతో తృప్తి నందడం పరిపూర్ణ ఆరోగ్య లక్షణం. అసంతృప్తి, అలవిమాలిన ఆశలు, అందనివాటికి అఱ్ఱులు చాచడం అనేది అతి ప్రమాదకరమైన అనారోగ్యం; అదే అధఃపతనానికి హేతువు. బహుశః మైత్రే యితో స్నేహం అధికమై నీ కీ అనారోగ్యస్థితి పట్టుకున్న దనుకుంటాను."

"ఒకరిని చూస్తేనేకాని, మన స్థితి ఎటువంటిదో మనకు తెలియదంటావా?" మధ్యలోనే అడ్డుతగిలింది కళ్యాణి.




# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పిఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృంతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబాని కంతాకలిపి నెలల తరబడి వస్తుంది

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

IWT/AM/2815

"మన స్థితి మనకు తెలియడంలో తప్పులేదు. తెలియడం అవసరంకూడా. కాని ఇతరులతో పోల్చి చూచుకోవడంలోనే ఉన్నది అనర్థ మంతా."

"పోల్చి చూచుకోకుండా కూపసమండూకాలలా ఉన్నదే ప్రపంచ మని తృప్తి పడితే ఇక ప్రపంచానికి పురోగతే లేదు."

జాలిగా నవ్వాడు శేషు. "నువ్వేదో ఒకవిధమైన ఆవేశంలో వున్నావు కళ్యాణీ. ఇటువంటి ఆవేశాలు చాలా అనర్థకరం. ఉన్నతదశలో వున్న వ్యక్తులను పురోగతి



కోసమై ఆదర్శంగా పెట్టుకోవడం వేరు; అయ్యో— మనం అలాగ లేమే మని క్రిగ్గు ళ్ళడం, నిరాశ జెందడం వేరు. తీరికగా ఆలోచించుకో. మళ్ళీ వస్తాను," అంటూ వెళ్ళిపోయాడు శేషు.

తనలో తాను నిర్లిప్తంగా నవ్వుకుంది కళ్యాణి. 'ఈ రోజు, ఈ క్షణం క్రొత్తగా ఆలోచించే దేముంది ? అనునిత్యం, అనుక్షణం రాత్రింబవళ్ళూ ఆలోచనలు వాటంతటవే అవిరామంగా వచ్చి, అయోమయం చేస్తాయి !'

అలా ఎంత సేపు కూర్చున్నదో తనకే తెలియదు. నిప్పులు కురిపిస్తూన్న సూర్య కిరణాలు వచ్చి పైన పడడంతో, ఆలోచనావాహిని నుండి తేరుకొని తల పైకెత్తింది. సూర్యుడు నడినెత్తిమీ దున్నాడు. ఏ పన్నెండున్నరో ఒంటిగంటో అయ్యుంటుంది టైము. భోజనం చేయక నీరసంగా వుంది. లోపల తల్లికూడా భోజనం చేయ కుండానే పడుకొంది. స్కూళ్ళకు వెళ్ళిన పిల్లలూ, తండ్రీ రాకముందే కాస్త భోజనం చేద్దామనే ఉద్దేశ్యంతో లేచి వెళ్ళి తల్లిని లేపింది. మగతనిద్రలో వున్న జానకి లేస్తూనే కూతుర్ని కౌగలించుకుని "ఇంత అందగత్తెవు ఈ బీదకడుపున ఎందుకు పుట్టావు తల్లీ? నీకు నేనే ముచ్చటా తీర్చలేకుండా వున్నాను" అంటూ భోరు మంది. తల్లి గుండెలలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది కళ్యాణి. ఏడ్చి ఏడ్చి కొద్దిసేపటికి తమంత తామే సమాధాన పడ్డారు తల్లీ కుమార్తెలు.

"రామ్మా, కాస్త అన్నం తిందాం. ఇక నీ కీ పట్టెడు మెతుకులైనా పెట్టే యోగ్యతకూడా కొద్దిరోజులే కదా! ఏ యింటి కెళ్తావో, నీ అదృష్టం ఎలా వున్నదో!" అంటూ వంటింటివైపు దారి తీసింది జానకమ్మ, కనులు ఒత్తుకుంటూ. కళ్యాణి మౌనంగా అనుసరించింది, కన్నీటిస్రవంతిని కట్టడిచేయడానికి విఫలయత్నం చేస్తూ.

'ఎంత అందంగా ఉంటే నేం, ఎంత గుణవంతులైతే నేం, ఎంత మంచి సాంప్రదాయ ముంటే నేం, డబ్బుతర్వాతనే అన్నీ. డబ్బు లేనిదే పెళ్ళిళ్ళు జరగడం లేదుకదా! ధనమూలం ప్రపంచమైపోయింది......డబ్బు యివ్వని దేవుడు ఈ పిల్లల్ని మాత్రం ఎందు కిచ్చినట్టు? ఆ ఎదురింటి జమీందారిణి సుభద్రకు మైత్రేయి ఒక్కతే పిల్ల; మరి సంతానం లేదని వాపోతుంటుంది. అటువంటివారి కివ్వకూడదూ ఈ బిడ్డలను? చక్కగా ఏ లోటూ కలగనీకుండా సంతోషంగా పెంచుకొందురు?...' జానకమ్మ స్వగతం అలా సాగిపోతూనే వున్నది.

కల్యాణి ఆలోచనాస్రవంతి మరో తరహాలో సాగిపోతున్నది; 'తానెంత నిరాభరణంగా వున్నా, చింకిగుడ్డలు కట్టుకున్నా అప్సరసలాగే వుంటుం దని తరచు పలువురి నోట వినబడుతుంటుంది. తాను ఎప్పుడైనా ఏ స్నేహితు లింటికో ఏ పేరం

టానికో వెళ్తూంటే దారిన పోయే యువకులు తనను చూచి చిత్రప్రతిమ లై పోతారు, తదేకంగా చూస్తూ. కనుమరుగయ్యేవరకూ కన్ను వాల్చక, కాలు కదల్చక నిల్చుం టారు. మరి అటువంటివాళ్లు ఒక్కరూ తనను వివాహ మాడడానికిమాత్రం ముందుకు రారు. తనకు ధనరాసులు లేనందున! అదేం అప్రయోజకులో!...నిజంగా



తానే ఆ మైత్రేయి స్థానంలో వుంటే – విలువైన దుస్తులు, ఖరీదైన నగలు, కార్లలో షికార్లు, ప్రకాశంవంటి యువకుని ప్రక్కన – ఓహ్! చీకూ చింతా లేని జీవితం!'

"ఎందుకే తల్లీ ఆ విచారం? భోజనం చెయ్యి. మన ముఖాల్ని ఎలా వ్రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది. తినమ్మా. ఆ ముఖం చూడు ఎలా వాచిపోయిందో ఏడ్చిఏడ్చి; ఏడవకు." తల్లి హెచ్చరింపుతో, తన పరధ్యాసకు సిగ్గుపడుతూ భోజనం ముగించి లేచింది కళ్యాణి. అంతలో స్కూలుకు వెళ్ళిన పిల్లలు భోజనాలకు రావడంతో తిరిగి తల్లీ కుమార్తె లిద్దరూ పనులలో మునిగిపోయారు.

"మైత్రేయిగారు ఒక్కసారి మిమ్మల్ని రమ్మన్నారు." అంటూ వచ్చిన వార్తాహరుని "రాలేను" అని పంపించేసింది, మనఃస్థిమితం లేని కళ్యాణి.

పదినిముషాలలో ఆ నౌఖరు మళ్ళీ వచ్చాడు; "రేపు వారంతా పిక్నిక్ పోతున్నారట; అన్నీ సర్దుకుంటున్నారు. మీరుకూడా రావాలట. ఆవిషయం చెప్పడానికి ఒక్కసారి రమ్మన్నారు."

కళ్యాణి మనస్సు ఒక్కసారిగా పొంగిపోబోయి, అంతలోనే రాత్రి సినీమానుండి వచ్చిన అనంతర పరిస్థితి గుర్తుకురాగా కృంగిపోయింది. అసలు ఆ మాట తల్లికీ తండ్రికీ చెప్పే సాహసమే కలుగలేదు. "రాలేను. మైత్రేయిని ఏమీ అనుకోవద్దని చెప్పు." అని చెప్పి పంపేసింది.

"వెళ్ళక్కర్లేదు. కలవాళ్ళు ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా చెల్లుతుంది. నువ్వు దేనికి?" అప్పుడే తిరిగివచ్చిన శేషు అన్నాడు. అసలే మనశ్శాంతి లేని కళ్యాణి చురుగ్గా చూచింది "నువ్వేమీ వ్యాఖ్యానించ నవసరంలేదు. నీ అధికారాలూ, సలహాలూ ఎవరికీ అక్కర్లేదు".

- కళ్యాణిచే ఎన్నడూ అంతగా నిరసింపబడని శేషాద్రి లిప్తకాలం నివ్వెరపోయి నిలబడ్డాడు. "ఎంత నిరసన? ఎంత ఈసడింపు? చూచావా అత్తయ్యా దాని మాటలు?" అటుగా వచ్చిన జానకమ్మకు ఫిర్యాదు చేశాడు శేషాద్రి.

"ఏమిటి?" విషయం వినిన జానకి తమ్ముడి ఫిర్యాదును విస్మరించేసింది. "వారికి కోపం వస్తుందేమో: రానని ఎందుకన్నావ్?" అనడిగింది కుమార్తెను.

"ఇదేమైనా వాళ్ళ నౌఖరా, లేక వాళ్ళ సమాన పాయిలోనిదా? వెళ్ళద్దు; అందువల్ల చాలా అనర్థా లున్నాయి" తీవ్రంగా అన్నాడు శేషు.

ఆమాటలు విన్పించుకోలేదు జానికి ఒక్కక్షణం పరీక్షగా చూచింది కుమార్తెవైపు. "నిన్న సినిమాకు వెళ్ళినందుకు కోప్పడ్డాననటే?" దగ్గరకు తీసుకుని చుబుకం పట్టి లాలనగా అడిగింది. అప్పుడప్పుడు బాధావనికల మాటునుండి మాతృహృదయం కరిగి బయటపడ్తూండడం కద్దు: "ఏదో బాధలో, చికాకులో అన్నానే కాని నిజంగా నీపై విసుగటే అమ్మా నాకు? వెళ్ళు." కళ్యాణి అప్పటికీ మాట్లాడలేదు.

